# భాద్రపదమాసము

కుజచారః
శు౨శ-ఉఫ౩కు౩-౪
౭గు-ఉఫ౪కు౧౨-౫
౧౩మం-హ౧కు౨౦-౧౪
బ౩ఆ-హ౨కు౨౮-౨౬
౮శు-హ౩కు౩౨-౩౫
౧౨బు-హ౪కు౩౭-౧౪
బుధచారః
శు౩ఆ-చి౧బు౨౪-౩౦
౬బు-చి౨బు౪౬-౨౪
౧౧ఆ-చి౩తుబు౫౨-౨౦

బ౭గు-బుధవక్రారంభః
౧౦ఆ-పశ్చాదస్తమితః
౧౦సో-చి౨వక్రిబు౧౭-౧౪
౧౩గు-చి౧వబు౪౩-౪౧
గురుచారః
శు౩ఆ-పున౩గు౪౯-౧
బ౧౨బు పున౪కటబు౫౫-౨౭
శుక్రచారః
శు౩ఆ-మ౪శు౧౦-౮
౫మం-పూఫ౧శు౫౨-౧౮
౮శు-పూఫ౨శు౩౩-౫౫

౧౨సో-పూఫ౩శు౧౫-౨౦
౧౪బు-పూఫ౪శు౫౬-౫౪
బ౨శ-ఉఫ౧శు౩౭-౩౩
౫మం-ఉఫ౨కశు౧౮-౧౭
౭గు-ఉఫ౩శు౫౮-౫౦
౧౦ఆ-ఉఫ౪శు౩౯-౩౪
౧౨బు-హ౧శు౨౦-౧౦
౧౩గు-ప్రాగస్తమితః
౩౦శ-హ౨శు౦-౨౭
శనిచారః
బ౧శు-వక్రారంభః

రాహుకేతుచారౌ
శు౩ఆ-మఘా౩రాహుః
శత౧కేతుః౫౫-౦

| | | |
|---|---|---|
| | శ | గు |
| కే | శు౬కన్యారవిః<br>౧౧-తులాబుధః<br>బ౧౦-క వ బు<br>బ౧౨-కటగురుః<br>బ౫-కన్యా శు | ర శు రా |
| | | కు బు |

# ఆశ్వయుజమాసము

కుజచారః
శు౨సో-చిత్రా౧కు౪౧-౧౪
౮శ-చి౨కు౪౪-౩౦
౧౩గు-చి౩తుకు౪౫-౧౭
బ౩మం-చి౪కు౪౪-౨౫
౮ఆ-స్వా౧కు౪౨-౪౩
౧౩శు-స్వా౨కు౩౯-౩౦
బుధచారః
శు౧ఆ-హ౪వబు౩౬-౨౫
౫బు-హ౩వబు౪౨-౩౦
౧౧మం-ప్రాగుదితః

౧౪శు-వక్రత్యాగః
బ౧ఆ-హ౪బుబు౨౪-౩
౪బు-చి౧బు౪౨-౬
౭శ-చి౨బు౨౧-౪౪
౯సో-చి౩తుబు౩౯-౧౮
౧౧బు-చి౪బు౫౨-౪౭
౧౪శ-స్వా౧బు౧-౧౭
౩౦ఆ-ప్రాగస్తమితః
గురుచారో నాస్తి
శుక్రచారః
శు౨సో-హ౩శు౪౦-౪౯

౬గు-హ౪శు౨౦-౨౮
౯ఆ-చి౧శు౦-౨౭
౧౧మం-చి౨శు౪౦-౧౬
౧౪శు-చి౩తుశు౨౦-౪
బ౨సో-చి౪శు౦-౪
౪బు-స్వా౧శు౩౯-౪౦
౭శ-స్వా౨శు౧౯-౪
౯సో-స్వా౩శు౫౮-౪౪
౧౨గు-స్వా౪శు౩౮-౧౦
౩౦ఆ-విశా౧శు౧౮-౨
శనిచారో నాస్తి

రాహుకేతుచారౌ నస్తః

| | | |
|---|---|---|
| | శ | |
| కే | శు౮-తులా రవిః<br>శు౧౩-తులా కు<br>బ౯-తులా బుధ<br>శు౧౪-తులా శు | గు రా |
| | | ర బు కు శు |

# కార్తికమాసము

కుజచారః
శు౩బు-స్వా౩కు౩౫-౦
౯సో-స్వా౪కు౨౯-౧౫
౧౪శ-విశా౧కు౨౨-౪౨
బ౪గు-విశా౨కు౧౫-౪
ప్రాగుదితః
౮మం-విశా౩కు౪-౩౭
౧౨శ-విశా౪వృకు౫౩-౪౦
బుధచారః
శు౧సో-స్వా౨బు౭-౪౨
౩బు-స్వా౩బు౧౨-౪౨
౫శు-స్వా౪బు౧౬-౫౨
౮ఆ-విశా౧బు౨౦-౨౮

౧౦మం-విశా౨బు౨౪-౨౨
౧౨గు-విశా౩బు౨౮-౪౦
౧౪శ-విశా౪వృబు౩౩-౨౮
బ౧సో-అనూ౧బు౩౯-౦
౩బు-అనూ౨బు౪౫-౪
౪శు-అనూ౩బు౫౦-౩౩
౬ఆ-అనూ౪బు౫౭-౦
౯బు-జ్యే౧బు౪-౪
బ౧౧సో-జ్యే౨బు౧౦-౫౩
౧౩ఆ-జ్యే౩బు౧౭-౪౫
౩౦మం-జ్యే౪బు౨౫-౦
గురుచారః
శు౫శు-గురువక్రారంభః

శుక్రచారః
శు౨మం-విశా౨శు౫౭-౩౦
౫శు-విశా౩శు౩౬-౨౬
౯సో-విశా౪వృశు౧౫-౨౨
౧౧బు-అనూ౧శు౫౪-౧౮
౧౪శ-అనూ౨శు౩౩-౧౪
బ౨మ-అనూ౩శు౧౨-౧౦
౪గు-అనూ౪శు౫౧-౬
౬ఆ-జ్యే౧శు౩౦-౨
౯బు-జ్యే౨శు౮-౫౮
౧౧శు-జ్యే౩శు౪౭-౫౪
౧౪సో-జ్యే౪శు౨౬-౫౦
శనిచారః

శు౧౪శ-రో౨వ శని౫౨-౦
రాహుకేతుచారౌ
శు౮ఆ-మఘా౨రాహుః
ధని౪కేతుః౪౯-౩౧

| | | |
|---|---|---|
| | శ | |
| కే | శు౯-వృశ్చి రవిః<br>బ౧౨-వృ కే కు<br>శు౧౪-వృ కే బు<br>౯-వృ కే శుక్రః | గు రా |
| | ర కు బు శు | |

# మార్గశిరమాసము

కుజచారః
శు౩గు-అనూ౧కు౪౧-౨౭
౮మం-అనూ౨కు౨౮-౨౨
౧౩ఆ-అనూ౩కు౧౩-౧౭
బ౨శు-అనూ౪కు౫౭-౪౧
౭మం-జ్యే౧కు౩౮-౪౫
౧౨ఆ-జ్యే౨కు౨౨-౧౭
బుధచారః
శు౩గు-మూ౧బు౩౨-౩౨
౫శ-మూ౨బు౪౦-౭
౭సో-మూ౩బు౪౬-౩౪
౯బు-మూ౪బు౫౩-౪౭
౧౨శ-పూషా౧బు౦-౩౬

౧౪సో-పూషా౨బు౭-౨౬
బ౧బు-పూషా౩బు౧౪-౧౭
బ౨గు-పశ్చాదుదితః
౩శు-పూషా౪బు౨౩-౪
౫ఆ-ఉషా౧బు౩౩-౦
౭మం-ఉ౨మబు౪౦-౪౮
౯గు-ఉషా౩బు౫౭-౧౦
౧౨ఆ-ఉషా౪బు౧౨-౦
౧౪మం-శ్ర౧బు౪౭-౧౫
గురుచారః [౨౩-౨
శు౧౦శు-పున౩ వక్రీగురుః
శుక్రచారః [౫-౪౬
శు౩గు-మూల౧ నుశుక్రః

౫శ-మూ౨శు౪౪-౪౨
౮మం-మూ౩శు౨౩-౩౮
౧౧శు-మూ౪శు౨-౩౪
౧౩ఆ-పూషా౧శు౪౧-౩౦
బ౧బు-పూషా౨శు౨౦-౨౬
బ౩శు-పూషా౩శు౫౯-౨౨
౫ఆ-పశ్చాదుదితః [౧౮
౬సో-పూషా౪శుక్రః౩౮-
౯గు-ఉషా౧శు౧౭-౩౪
౧౧శ-ఉషా౨మశు౫౬-౩౦
౧౪మం-ఉషా౩శు౩౬-౦
శనిచారః
బ౧౪మం-రోహి౧వక్రీ

శనిః౪౩-౩౦
రాహుకేతుచారా నస్తిః

| | | | |
|---|---|---|---|
| | | శ | |
| కే | శు౮-ధనుషి రవి<br>శు౩-ధనుషి బుధ<br>బ౭-మకర బుధః<br>శు౧౦-మిథునే | | గు |
| | వక్రీ గురుః<br>శు౩-ధను శుక్రః<br>బ౧౧-మకర శుక్ర | | రా |
| బు శు | ర కు | | |

# పుష్యమాసము

కుజచారః
శు౨శు-జ్యే౩కు౩ ౭
౬మం-జ్యే౪కు౪౩-౧౫
౧౧ఆ-మూ౧కు౨౦-౨౮
బ౧శు-మూ౨కు౫౭-౧౦
౫మం-మూ౩కు౩౩-౫౭
౧౦ఆ-మూ౪కు౯-౦
౧౪గు-ఉషా౧కు౪౪-౮
బుధచారః
శు౨శు-శ్రవ౨బు౪౩-౨౮
౮బు-శ్రవ౩బు౭-౦
౯గు-బుధవక్రారంభః

౧౨సో-పశ్చాదస్తమితః
౧౨సో-శ్ర౨వబు౩౭-౪౦
బ౧శు-శ్ర౧వక్రీబుధ౩౦-౪
బ౪సో-ఉ౪వబు౧౯-౧౬
౬గు-ఉషా౩వబు౯-౧౩
౯శ-ప్రాగుదితః
౧౦ఆ-ఉషా౨వబు౪౫-౪
౧౨మంబుధవక్రత్యాగః
గురుచా ః
శు౮బు-పున౨వగు౨౨-౫౩
శుక్రచారః
శు౨శు-ఉషా౪శు౧౫-౨౬

౪ఆ-శ్ర౧శు౫౪-౫౦
౮బు-శ్ర౨శు౩౪-౩౭
౧౧శ-శ్ర౩శు౧౪-౧౨
౧౨సో-శ్ర౪శు౫౩-౨౯
౧౫శు-ధని౧శు౩౩-౨౭
బ౩ఆ-ధని౨శు౧౩-౨౫
౫మం-ధ౩కుంశు౫౩-౨౩
౮శు-ధని౪శు౩౩-౨౧
౧౧సో-శత౧శు౧౩-౨౦
౧౩బు-శత౨శు౫౩-౧౮
శనిచారో నాస్తి
రాహుకేతుచారా

శు౧౧ఆ-మఘ౧రాహుః
ధని౩కేతుః౪౩-౨౩

| | | | |
|---|---|---|---|
| | | శ | గు |
| కే | శు౯-ఉషా౨మ ర<br>శు౧౧ధనుషి కుజ<br>బ౫కుంభే శుక్రః | | |
| బు శు | | | రా |
| ర | కు | | |

# మాఘమాసము

కుజచారః
శు౫మం-పూషా౨కు౧౬-
౩౨
౯శ-పూషా౩కు౪౯-౭
౧౩గు-పూషా౪కు౨౦-౪౦
బ౨సో-ఉషా౧కు౫౧-౪౨
౭శ-ఉషా౨మకు౨౧-౧౭
౧౨బు-ఉషా౩కు౫౦-౫౦
బుధచారః
శు౬బు-ఉషా౩బు౪౭-౨౦
౧౧బు-ఉషా౪బు౩౪-౪౭
౧౪శు-శ్ర౧బు౧-౨౫

బ౨సో-శ్ర౨బు౮-౦
౪బు-శ్ర౩బు౫౨-౪౭
౭శ-శ్ర౪బు౩౦-౩౦
౧౦సో-ధని౧బు౫౯-౯
౧౩గు-ధని౨బు౩౪-౧౪
౩౦శ-ధని౩కుంబు౪౦-౫౩
గురుచారః
శు౫మం-పున౧వ౫౯-౨౬
శుక్రచారః
శు౨శ-శత౩శు౩౩-౧౬
శు౫మం-శత౪శు౧౩-౧౪
౭గు-పూభా౧శు౫౬-౬

౧౦ఆ-పూభా౨శు౩౭-౧౦
౧౩బు-పూభా౩శు౧౮-౧౩
౧౪శు-పూభా౪మీనేశు
౫౯-౧౪
బ౨సో-ఉభా౧శు౪౧-౩
౫గు-ఉభా౨శు౨౩-౧౨
౮ఆ-ఉభా౩శు౫-౨౧
౧౧మం-ఉభా౪శు౪౭-౩౦
౧౪శు-రే౧శు౨౯-౩౯
శనిచారః
శు౩ఆ-శనివక్రతాగః
రాహుకేతుచారా నస్తిః

| | | | |
|---|---|---|---|
| | | శ | గు |
| కే శు | శు౮-కుంభే రవి<br>బ౭-మకరే కుజ<br>బ౩౦-కుంభే బు<br>శు౧౪-మీనే శు | | |
| ర బు | | | రా |
| కు | | | |

## ఫాల్గునమాసము

కుజచారః
శు౨సో-ఉషా౪కు౧౮-౪౬
౬శు-క్రి౧కు౪౬-౩౮
౧౧బు-క్రి౨కు౧౪-౧౨
౧౫ఆ-క్రి౩కు౪౧-౨౦
బ౫శు-క్రి౪కు౭-౪౮
౯మం-ధ౧కు౩౪-౨౫
౧౪శ-ధ౨కు౫౯-౩౦

బుధచారః
శు౨సో-ధ౪బు౫౬-౪
౫గు-శత౧బు౭-౧౦
౭శ-శత౨బు౧౩-౫౧
౯సో-శ౩బు౧౫-౦
శు౧౧బు-శ౪బు౧౫-౧౫
౧౩శు-పూభా౧బు౧౩-౫
౧౪శ-ప్రాగస్తమితః
౧౫ఆ-పూభా౨బు౧౦-౦
బ౨మం పూభా౩బు౪-౧౬
౩బు పూభా౪మీబు౫౫-౦
౫శు-ఉభా౧బు౪౦-౧౬
౭ఆ-ఉభా౨బు౨౪-౪౫
౯మం-ఉభా౩బు౪-౪౧
౧౦బు-ఉభా౪బు౪౪-౫౭
౧౨శు-రే౧బు౨౫-౦
౩౦ఆ-రే౨బు౫-౭

గురుచారః
శు౫గు-గురువక్రత్యాగః

శుక్రచారః
శు౨సో-రే౨శు౧౧-౪౮
౪బు-రే౩శు౫౪-౨౨
౭శ-రే౪శు౩౭-౩౧
౧౦మం అ౧మేశు౧౯-౪౫
౧౩శు-అ౨శు౪-౩౬
౧౫ఆ-అ౩శు౪౮-౩౦
బ౩బు-అ౪శు౩౨-౨౦
౬శ-భ౧శు౧౭-౨౪
౯మం-భ౨శు౧-౫౧
౧౧గు-భ౩శు౪౭-౧౩
౩౦ఆ-భ౪శు౩౩-౧౭

శనిచారః
శు౪బురో౨బుజాశ్మనః
౧౪-౦

రాహుకేతుచారౌ
శు౧౫ఆ-ఆశ్లే౪కటరాహు
ధని౨మకరేకేతుః౩౯-౪

| శు | | శ | ర |
|---|---|---|---|
| కే<br>బు ర | శు౭-మీనే రవిః<br>బ౩-మీనే బుధః<br>శు౧౦-మేషే శుక్ర | | |
| కు | శు౧౫-కట రా<br>మకరే కేతుః | | రా |
| | | | |

## మేషాదిలగ్న ప్రమాణములు పుష్కరకాలము

| లగ్నము | ప్రమాణ ఘటికలు | ప్రమాణ గంటలు | పుష్కర ఘటికలు | పుష్కర గంటలు |
|---|---|---|---|---|
| మేషము | ౪-౨౩ | 1-45 | ౩-౧ | 1-15 |
| వృషభము | ౫-౨ | 2-1 | ౨-౨ | 0-56 |
| మిథునము | ౫-౨౯ | 2-12 | ౪-౨౪ | 1-46 |
| కర్కాటకము | ౫-౩౦ | 2-12 | ౧-౧౭ | 0-31 |
| సింహము | ౫-౧౮ | 2.7 | ౩-౪౧ | 1-28 |
| కన్య | ౫-౧౫ | 2-6 | ౨-౨౭ | 0-59 |
| తుల | ౫-౨౫ | 2-10 | ౪-౨౦ | 1-44 |
| వృశ్చికము | ౫-౩౩ | 2-13 | ౧-౧౮ | 0-31 |
| ధనుస్సు | ౫-౧౬ | 2-6 | ౩-౩౧ | 1-24 |
| మకరము | ౪-౩౮ | 1-52 | ౨-౧౦ | 0-52 |
| కుంభము | ౪-౮ | 1-39 | ౩-౧౮ | 1-19 |
| మీనము | ౪-౨ | 1-37 | ౦-౫౬ | 0-22 |

## గృహప్రవేశ విషయమైన చక్రములు

| వృషభచక్రం రవిభాత్ | | కలశచక్రం రవిభాత్ | |
|---|---|---|---|
| ౩ మృత్యు | ౪ అర్థకృత్ | ౧ శీర్షచ్ఛేదం | ౪ నిర్ధనం |
| ౪ దుర్దశా | ౪ ధాన్యం | ౪ ప్రవాసః | ౪ గర్భస్రావం |
| ౪ స్థైర్యం | ౩ సంపద | ౪ అభయః | ౩ శ్రియం. |
| ౩ భ్రమణం | ౩ పశువృద్ధి | ౪ ధాన్యం | ౩ శతాయుః |

## గండపురుషస్థితి

గండపురుషుడు కార్తిక, ఆషాఢ, ఫాల్గున, వైశాఖ మాసములయందు ఆకాశమునను, మాఘ, భాద్రపద, చైత్ర, ఆశ్వయుజమాసములలో పాతాళమునను, జ్యేష్ఠ, శ్రావణ, మార్గశీర్ష, పుష్యమాసములలో భూమియందును ఉండును. రజోదర్శనము ప్రసూతి మొదలగునవి సంభవించినపుడు గండపురుషుడు భూమియందుండెనేని దోష మధికమగుటచే విశేషశాంతి చేయవలెను. మిగతకాలములో దోషము సామాన్యము.

## వార దుర్ముహూర్తములు

| ఆ | | సో | | మం | | బుధ | | గురు | | శుక్ర | | శని | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ |

౨౭-౨౮, ౧౭-౧౮, ౭-౮, ౧౫-౧౬, ౧౧-౧౨, ౭-౮,
౧-౨, ౨౩-౨౪, ౪౩-౪౪, ౨౩-౨౪,
౧౭-౧౮, ౩-౪.

## బల్లిపాటునకు ఫలములు

శిరస్సు-కలహము, ముఖము-బంధు దర్శనము, కనుబొమ్మలనడుమ-రాజానుగ్రహము, పై పెదవి-ధనవ్యయము, క్రింది పెదవి-ధనలాభము, ముక్కు చివర-రోగము, కుడి చెవి-దీర్ఘాయువు, ఎడమ చెవి-వర్తకలాభము, నేత్రము-ఖైదు, గడ్డము-రాజదండనము, నోరు-భయము, కంఠము-శత్రుహాని, కుడిభుజము-ఆరోగ్యము, ఎడమభుజము-స్త్రీ సంగమము, కుడిముంజేయి-కీర్తి, ఎడమముంజేయి-రోగము, స్తనయుగ్మము-దోషము, ఉదరము-ధాన్యలాభము, రొమ్ము, నాభి-ధనలాభము, ప్రక్కలు-సుఖము, పాదము-ప్రయాణము, వీపు-శుభము, గోళ్లు-ధనవ్యయము, లింగము-దారిద్ర్యము, జుట్టుకొన-మృత్యువు. ఈ ప్రదేశములయందు తొండప్రాకినను ఫలమిట్లేయని తెలియునది.



హిమవంతుడు

[ చిత్రకారుడు : శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి ]

ॐ

# ప్ర స్తా వ న

అనంతమగు నీ కాలప్రవాహమున మరియొక చాంద్రమానాబ్దము గతించినది. నూతనాబ్ద మారంభమైనది. వసంతాగమనముతో ప్రకృతియంతయు నూతనోజ్జీవితమై, భగవద్విలాసమును ప్రకటించుచున్నది. ప్రకృతిశోభను గాంచి సమ్మోహితమగు పక్షిసంతాన మంతయు ఆనందాతిరేకమున భగవల్లీలల గాన మొనర్చుచున్నది. స్థావర, జంగమాత్మకమగు సృష్టియంతయు నిట్టి ఆనందమున నోలలాడుచున్న సమయమున, మానవజాతిమాత్రము భగవంతుని మరచి, పరస్పర మారణకృత్యములయందు నిమగ్నమై యుండుట విచిత్రముగ గనుపించును.

సృష్టిలోకెల్ల మానవజన్మయే యుత్తమమైన దని మానవుడు గర్వించుచుండును. అందును తమ పూర్వులకంటెనుగూడ తామే విజ్ఞానవంతుల మని ఆధునికుల అహంకారము. విజ్ఞానపరిశోధనలచే ప్రకృతిని వశపరచుకొని, తమకు సేవకునిగ నొనర్చుకొనుచుంటి మని వీరు గర్వించుచుందురు. కాని, ఈ విజ్ఞానాభివృద్ధులన్నియు, ప్రపంచకల్యాణసాధక మగుటకుమారు, కామక్రోధాది అరిషడ్వర్గప్రేరితులగు మానవులయందు మానవ మారణకృత్యములకు కారణ మగుచున్నవి.

రెండవ ప్రపంచసంగ్రామము ప్రారంభమై రెండువత్సరములు దాటినవి. మూడవ వత్సరముగూడ ముగియవచ్చుచున్నది. కాని ఇది యెప్పుడు ముగియునో, యెటులు ముగియునో కూడ చెప్పుటకు వీలు లేకున్నది. అంతర్జాతీయ వ్యవహారములయందు ధర్మములు పోయినవి. పవిత్రమగు ఒడంబడికలు, వాగ్దానములు కేవలము 'కాగితపు ముక్కలు' గనే పరిగణింపబడుచున్నవి. పదివత్సరముల వరకు మైత్రిని పాటించుటకు రెండున్నరవత్సరముల క్రిందటనే రష్యాతో సంధిచేసుకొనిన హిట్లరు, గత జూనుమాసమున, ఆకస్మికముగ సోవియటురష్యాపైన బ్రహ్మాండ మగు దాడిని ప్రారంభించెను. గత డిసెంబరుమాసమున తూర్పున జపానుగూడ బ్రిటను అమెరికా ప్రభుత్వములపై ఆకస్మికముగ యుద్ధము ప్రకటించి, తూర్పు ఆసియా దేశములపై దాడులు సాగించెను. దీనితో ఇంతవరకును ఐరోపాయందుమాత్రమే జరుగుచున్న సంగ్రామము ప్రపంచమునందలి ఉభయార్ధగోళములకును వ్యాపించెను. ఇంచుమించు మానవజాతియంతయు రెండుపక్షములుగ నేర్పడి ఈసంగ్రామమున పరస్పర నిర్మూలన కాంక్షతో పెనగులాడుచున్నది. ఈ సంఘర్షణయందు చేరకుండ, ఏ పెద్ద జాతియు తప్పించుకొనజాలకున్నది. టర్కీవంటి దేశములు కొన్ని తమ తాటస్థ్యము నింతవర కతిజాగ్రత్తతో సంరక్షించుకొనగల్గినను, ముందుముందు వానిస్థితి యెటులు మారునో నిశ్చయముగ చెప్పరాదు.

ఈ ప్రపంచవిలయమునుండి యెట్టి శక్తి యుద్భవించునో తెలియదు. సముద్రమథనసమయమునందువలె ముందుగ హాలాహలమే జనింపవచ్చును. కాని, తరువాత, అమృతము లభించుటకుగూడ అవకాశము లేకపోలేదు. నేటి సంగ్రామములచే మానవజాతికి గల్గుచున్న సంక్షోభములనుగాంచి,బల

వంతములగు దేశములు పరితప్త హృదయులై, సమస్తజాతుల స్వాతంత్ర్యమును అంగీకరించి ఆయుధవిసర్జన మొనర్చినయెడల దీనితో సంగ్రామము లంతరించి, మానవజాతి సుఖించును; దానితో మానవచారిత్రమున స్వర్ణయుగ మారంభమగును. కాని, నేటి ప్రపంచపరిస్థితులను పరికించువో నట్టి 'కమ్మనికలల'కు తావు గనుపింపదు. నేడు ప్రపంచాధిపత్యమునకు పోరాడుచున్న హిట్లరు సిద్ధాంతములయందు జర్మనులకును, అతనిచే అంగీకరింపబడు 'ఆర్య' జాతులకును దప్ప ఇతరులకు స్థానము లేదు. ఐరోపాయందలి శ్వేతజాతులుగూడ జర్మనీయొక్క కనుసన్నలనే మెలగవలసి యుండును. ప్రపంచమున మిగిలినజాతులవారికి బానిసత్వము తప్ప, సరిసమానప్రతిపత్తిమాట యెత్తుటకే వీలుండదు. అక్సిసుమిత్రవర్గమునందు జేరిన జపానుగూడ ఆసియాఖండ దేశములపై అధిపత్యము నాసించుచున్నది. శ్వేతజాతులచే ఆక్రమింపబడియున్న ఆసియాజాతులకు దాస్యవిముక్తి నొసర్చుటకే తా మీసంగ్రామమును ప్రారంభించితి మని జపానునాయకులు చెలుపవచ్చును. కాని, జపానునాయకత్వమున వారు నెలకొల్ప నున్న 'నూతన వ్యవస్థ'కును, సమానసౌభాగ్య సిద్ధాంతమునకును, హిట్లరు ఐరోపాలో దలపెట్టిన నూతన వ్యవస్థకును ఎక్కువ భేదము కనుపింపదు. మిగిలిన ఆసియాజాతులకంటెగాని, తదితరజాతులకంటెగాని జపానుజాతి అధికమైనదనిమాత్రము చెప్పుటలేదు. ఇటుల చెప్పనంతమాత్రమున, జపానుయొక్క సామ్రాజ్యకాంక్ష తక్కువది గాదు. హిట్లరు నాయకత్వమున జర్మనీ యెటులు ప్రపంచాధిపత్యమును గోరుచున్నదో, జపానుగూడ అట్టి ఆధిపత్యమునే కోరుచున్నది.

ఇక మిత్రమండలి యుద్ధాశయములను గురించి రూజ్వెల్టు, చర్చిలు ప్రధానులు కలసి నిర్ణయించి ప్రకటించిరి. అందు మొదటి భాగమునందు, తమకు ఇతర దేశముల నాక్రమించవలెనని కాని, అధికారమును నెలకొల్పుకొనవలెననికాని యేమాత్రమును లేదని వారు వెల్లడించిరి. శత్రుదురాక్రమణలచే స్వాతంత్ర్యమును కోల్పోయిన దేశము లన్నిటికిని తిరిగి స్వాతంత్ర్య మిప్పించెదమని తెల్పిరి. కాని, ఈ ప్రకటన ఇండియావంటి ఆంగ్ల పరిపాలిత దేశములకు వర్తింప దనియు, ఐరోపా దేశములకు మాత్రమే వర్తించు ననియు చర్చిలుప్రధాని వెల్లడించుటవలన, అట్లాంటిక్కుప్రకటన అంతర్జాతీయసంబంధములను సంస్కరించు నను ఆశలు తొలగిపోయెను. ప్రపంచవిస్తీర్ణమునందు నాల్గవవంతు బ్రిటిషు సామ్రాజ్యము వ్యాపించియున్నది. అందలి దేశముల నన్నిటిని స్వాతంత్ర్యమునొసగి మినహాయించుటవలన, ప్రపంచశాంతికి అట్లాంటిక్కు ప్రకటనవలని ఉపయోగము చాలవరకు తగ్గిపోయెను. జర్మనీని ఓడింపగల్గువో, ఆంగ్ల-అమెరికా దేశములకు ఐరోపాయందే కాక — ఒక్క రష్యాయందు తప్ప — ప్రపంచమునందంతటను ప్రాబల్యము సిద్ధించును. అట్లాంటిక్కుప్రకటనయందలి 8-వ సూచనక్రింద, శత్రుదేశములు నిరాయుధములుగ నొనర్పబడును. ప్రపంచశాంతిరక్షణమునకుగాను ఆంగ్ల - అమెరికాదేశములు తగినంత సైన్యమును, ఆయుధములను నిలిపియుంచుకొనును. కనుక, మరే ఇతర దేశమునుగూడ మిత్రమండలిని ప్రతిఘటింపగల్గుస్థితియం దుండదు. ఇట్టి స్థితిని, అపుడా రెండు దేశములందును అధికారమునం దుండువ్యక్తులు, ప్రపంచమున ఆంగ్లో - అమెరికను ఆధిపత్యమును నెలకొల్పుకొనుట కుపయోగించుకొనవచ్చునని

అనుమానించువారుగూడ లేకపోలేదు. మిత్రమండలి దేశములు సామ్రాజ్యతత్వము వదలి, ఇంతవరకును తమ పరిపాలన యందున్న దేశములన్నిటికిని స్వాతంత్ర్యము నొసగిననేతప్ప ఈ సంగ్రామాంతమున ప్రపంచమున సుస్థిరమగు శాంతి నెలకొనుట అసంభవము. అంతియకాక, పాలితజాతుల దృష్టియందు జర్మని జపానుల సామ్రాజ్య కాంక్షకును, మిత్రమండలి సామ్రాజ్యతత్వములకును ఎక్కువ భేదము గన్పించుట కష్టము. ఈసందర్భమున తమ స్వాధీనమున నున్న 'కాలనీల'కు స్వాతంత్ర్య మొసగ వలసి యుండునను ఆలోచనయే ఆంగ్లనాయకులకు తట్టలేదు. సంగ్రామానంతరముగూడ నీదేశములను తమదేశమునందుత్పత్తియైన పారిశ్రామికవస్తువులను విక్రయించుటకు అంగడులుగ నుపయోగించుకొన వచ్చుననియే తలచుచున్నారు అక్కడకూడ చిన్న మార్పుల నొనర్చుట తప్ప బ్రిటిషు 'కలోనియలు' విధానమున పెద్దమార్పుల దలపెట్ట నక్కరలేదని ఇటీవల టైమ్సుపత్రిక వ్రాసిన వ్రాతలు ఆంగ్లదేశమునందలి సామ్రాజ్య వాదుల చిత్తప్రవృత్తిని వెలువుచున్నది. 'వెనుకబడియున్న' జాతులను స్వలాభము కొరకుపయోగించుకొనుటయే ఇంకను వీరి తలంపు. సామ్రాజ్యదేశములు ఇట్టి స్వార్థ వాంఛల విడువనంతవరకు, పాలితదేశముల పై రాజకీయాధికారమును వదలుకొనుట అసాధ్యము. అంతవరకును దుర్బలజాతులు బలవంతమగుజాతులకు బానిసత్వమున పడి యుండకతప్పదు. ఈపద్ధతులు మారనంతవరకు ప్రపంచమున సుస్థిరముగు శాంతి అసంభవము. ఈ విషయమును ఆంగ్లో-అమెరికా దేశముల నాయకులెంత త్వరితముగ గుర్తించిన నంత మంచిది.

ప్రపంచశాంతిని కలుషిత మొనర్చుచున్నది సామ్రాజ్యతత్వ మొక్కటియే కాదు. శ్వేతజాతుల ప్రజలు ఆసియా మొదలగు ఇతర ఖండములయందలి వివిధజాతులయెడల గన్పరుచుచున్న వర్ణభేదమును, అసహనమును గూడ నేటి ప్రపంచపరిస్థితులకు కొంతవరకు కారణమని అంగీకరింపక తప్పదు. అమెరికా యందు శ్వేతజాతీయులలో కొందరు నీగ్రోజాతీయుల యెడలను, ఆదిమవాసులగు ఎర్ర ఇండియనులయెడలను గన్పరుచుచున్న వర్ణద్వేషము, అసహనమును అమెరికను నాయకుల లోనే పల్వురచే తీవ్రముగ ఖండింపబడు చున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రముల శాసనసభలు జపానీయులు, చైనీయులు, భారతీయులు మొదలగు ఆసియా జాతులవారు తమ దేశమునకు వలస రాకుండ నిషేధించుచు గావించిన చట్టములే నేడు జపాను-అమెరికా దేశములకు గల వైషమ్యములలో చాలవరకు కారణమని నవో అతిశయోక్తి గాదు. ఆంగ్లదేశమున నీ రంగువిభేదములను ప్రజ లంతగ పాటింపరని చెప్పుకొనుచుందురు. కాని ఇటీవల సర్ హరి సింగుగారువంటి సుప్రసిద్ధ భారతీయ ప్రముఖునకు, అతడు నల్లజాతియుడను కారణముచే లండను 'హోటళ్ల'యందు బసగూడ నిరాకరింపబడె ననువిషయమును పార్లమెంటు నందుగూడ అంగీకరింపక తప్పినదిగాదు. బ్రిటిషుసామ్రాజ్యమున నొక భాగమగు దక్షిణాఫ్రికాయందు శ్వేతజాతులు భారతీయులను, ఇతర ఆసియాజాతులను పాల్పరచుచున్న అవమానములను గురించి తెలియనిదిగాదు. ఆస్ట్రేలియాఖండమున అధికారులు, ఆదేశము కేవలము శ్వేతజాతీయులదే ననియు, ఇతర రంగుజాతులవారచటకు వలసరాగూడదనియు శాసనమును గావించి అమలు జరుపు

చుండిరి. వా రట్టి అసహనమును గన్పరచి యుండనిచో, దూరప్రాచ్యమున నే డిట్టిసంఘర్షణ సంభవించియుండుట అసంభవము. ఆక్సిసు రాజ్యములయం దిదివర కెటులున్నను, ఇకమీదట నీ రంగు విభేదము మరింత యధికమగును. హిట్లరుయొక్క 'ఆర్యజాతీ'య సిద్ధాంతమునకును, 'పాలకజాతి' సిద్ధాంతమునకును ఇంతకంటెను తీవ్రతరమగు జాతీయ దురహంకారమే పునాది. జపాను జర్మనీతో ఏకమై పోరాడుచున్నను, 'పసుపు పచ్చ' జాతులపై హిట్లరుకు స్నేహాభిమానములు గలవని తలచుట పొరబాటు. తన పని తీరిన వెంటనే, వీలైనచో, ఆసియాజాతుల నణగగొట్టుటకు హిట్లరు శ్వేతజాతుల సమ్మేళనము నేర్పరచుకొని జపానును ప్రతిఘటింపజూచుచో ఆశ్చర్య ముండదు. ఈ శ్వేతజాతులకును, ఇతర రంగుజాతులకును అట్టి మహాసంగ్రామ మేర్పడుచో, ప్రపంచపుస్థితి యెంత ఘోరముగ నుండునో యూహించుకొనవచ్చును. ప్రపంచమున కట్టి యుపద్రవమును తప్పింపవలె ననినయెడల, బ్రిటిషు సామ్రాజ్యమునందలి శ్వేతదేశములును, అమెరికా సంయుక్తరాష్ట్రములునుగూడ ప్రజలలో నిట్టి జాతిదురహంకారములను నిరసించి, అన్యోన్యగౌరవసద్భావములను ప్రోత్సహించు టవసరము. పిమ్మట ఇతర శ్వేతజాతులుగూడ ఈ విషయమున ఆంగ్ల అమెరికా దేశముల అడుగుజాడల ననుసరించును.

అట్లాంటికు ప్రకటనయందు సూచింపబడిన స్వాతంత్ర్యము భారతదేశమునకును, ఇతరసామ్రాజ్యదేశములకును వర్తింప దని చర్చిలుప్రధాని నిరాకరించుటలో బ్రహ్మాండమగు పొరబా టొనర్చెను. దానివలన, ఈ సంగ్రామమున మిత్రమండలి విజయ మందినచో, శత్రు ఆక్రమితములగు ఐరోపాదేశములకు స్వాతంత్ర్యము లభించునుగాని, తమ స్థితియందుమాత్ర మెట్టి మార్పును నుండదని భారతీయులయందును, ఇతర పాలిత దేశములందును నిరాశా రోషములు వ్యాపించెను. ఒక్క చర్చిలుయందే కాదు, సంగ్రామారంభమునుండియు, ప్రభుత్వమున పలుకుబడి గల బ్రిటిషు నాయకు లందరియందును గూడ ఇట్టి సంకుచిత భావమే యేర్పడియుండుట బ్రిటిషుసామ్రాజ్యపు దురదృష్టమనియే చెప్పవలెను. గత డిసెంబరు మాసమున తూర్పున జపాను బ్రిటను, అమెరికాలపై ఒకేసారి ఆకస్మికముగ సంగ్రామమునకు దిగిన సమయమునగూడ, బ్రిటిషు అధికారులు ఆసియాజాతులపై ఆధిపత్యమును వదలుకొని స్వాతంత్ర్య మొసగు టుచితమని గ్రహింపజాలకపోయిరి. జపానువాహినులు హాంకాంగ్, మలయా, సింగపూరు, ఫిలిప్పైను, డచ్చియిండియా దీవులను ఆక్రమించుకొని బర్మాకుగూడ ఉపద్రవమును గల్పించుటకు ప్రారంభించినతరువాత మాత్రమే బ్రిటిషు అధికారులయందు చలనము గల్గినట్లు గనిపించును. అసలు లేనిదానికంటె [illegible]కైనను బ్రిటిషు నాయకులు మేల్కొనగల్గుట కొంతమేలే. బ్రిటిషు ప్రభుత్వము వారిపుడు భారత జాతీయాశయములను సంతృప్తిపరచి, సంగ్రామ నిర్వహణమున భారతీయుల హృదయపూర్వకమగు సహకారమును పొందుటకు సర్ స్టాఫర్డు క్రిప్సుగారి ద్వారా కొన్ని సూచనలను పంపిరి. ఆసూచనలు భారతీయాశయముల నెంతవరకు సఫలపరచునో, క్రిప్సుగారు భారతీయ నాయకులతో సంప్రదింపులు ముగించిన పిదపగాని తెలియదు.

కాని, బ్రిటిషు ప్రభుత్వ మింతవరకును భారతస్వాతంత్ర్యముపట్ల నిట్టి 'ససేమిరా' వైఖరి నవలంబించుటకు మనలోపముగూడ

కొంతగలదని అంగీకరింపక తప్పదు. గత మూడు వత్సరముల నుండియు, జిన్నాగారి నాయకత్వమున ముస్లింలీగు భారత దేశమును హిందూ రాజ్యములుగను, మహమ్మదీయ రాజ్యములుగను పూర్తిగా చీలదీయవలెనని తీవ్రమగు ఆందోళనను సాగించుచున్నది. మహమ్మదీయులలో చాల భాగ మీయాందోళనను బలపరచుచున్న విషయమును గూడ కాదనుటకు వీలులేదు. తమ కోర్కెలు అంగీకరింపబడువరకును భారత రాజ్యాంగమున నెట్టి మార్పులను గావింపరాదని ముస్లింలీగు పట్టు పట్టియుండెను. బ్రిటిషు అధికారు లొసగిన ప్రోత్సాహమే ముస్లింలీగు అవలంబించిన వైఖరికి కారణమను విషయము నిజమే. ఇట్టి విభజనకు ఇతర భారతీయులే కాక బ్రిటిషు ప్రభుత్వము గూడ అంగీకరింపదను విషయము ముస్లింలీగు నాయకులకు తెలిసియే యుండవలెను. అట్టి సందర్భమున, భారత జాతీయ స్వాతంత్ర్య వాంఛను దుర్బలపరచుట తప్ప దీనివలన గలుగు ప్రయోజన మెద్దియును లేదు. అయినను, భారత మహమ్మదీయ ప్రముఖులు చాలమంది, ముస్లింలీగు వైఖరిని బలపరచి, భారత స్వాతంత్ర్యమున కడ్డుదగిలియుండుట దురదృష్టము.

భారత స్వాతంత్ర్యమున కట్లు సంస్థానాధీశులుగూడ ఇట్టి వైఖరినే అనుసరించియుండిరి. వీరి ప్రాతికూల్యమువలననే, భారత దేశ సమాఖ్య రాజ్యాంగమును బ్రిటిషు ప్రభుత్వమువారు వదలుకొనవలసి వచ్చెను. ఇటీవల జరిగిన నరేంద్రమండలి సమావేశమునగూడ, తమ ప్రత్యేక హక్కులకును, సంపూర్ణమగు రాజ్యాధికారములకును, సంధి యొడంబడిక షరతులకును భంగకరమగు రాజ్యాంగమును బ్రిటిషు ఇండియాయందు ప్రవేశపెట్టరాదని హెచ్చరించుచు తీర్మానించియుండిరి. ఈ విపత్సమయమున గూడ వీరు తమ ప్రత్యేకహక్కులను పట్టుకొని ప్రాకులాడుచుండుట వీరి సంకుచిత దృష్టిని వెల్లడించుచున్నది. బ్రిటిషు ప్రభుత్వము వారు భారత ప్రజాబాహుళ్యముయొక్క సహకారము నందగోరుచో, అభివృద్ధి విముఖులును కేవల స్వార్థ సంరక్షణ పరాయణులునగు నిట్టివారి సలహాలను నిర్దాక్షిణ్యముగ త్రోసివేయవలసి యుండును.

ఎవరెంత చెప్పినను, అఖిలభారతజాతీయ మహాసభకంటె ప్రజాబాహుళ్యముయొక్క ఆశయమును సరిగ వ్యక్తీకరించుచున్న సంస్థ మరియొకటి లేదనువిషయము నెవ్వరును కాదనజాలరు. ఇటీవల బర్డోలియందు సమావేశమైనపుడు కాంగ్రెసుకార్యసంఘముగూడ ఆదర్శనీయము మాత్రమే [illegible] 'సంపూర్ణ అహింసా'వాదమును వదలి, దేశరక్షణకు గాను హింసాత్మకమగు ప్రతిరోధపద్ధతుల ననుసరించుటకు కాంగ్రెసు వెనుకాడదని వెల్లడించెను. దీనివలన యుద్ధనిర్వహణమున కాంగ్రెసుతోడ్పాటును గురించిన సందియములు తొలగిపోవలెను. ఈనిర్ణయమువలన దేశరక్షణకు అవసరమగు పెద్దపరిశ్రమలను నెలకొల్పువిషయమునగూడ కాంగ్రెసువైఖరి స్పష్టమైనది. కేవలము గ్రామీణము మాత్రమేయగు గృహపరిశ్రమల మీదనే భావిభారతప్రజాజీవితము పునర్నిర్మితము గావలెననువాదము సంపూర్ణ అహింసా సిద్ధాంతముపై నాధారపడియున్నది, ఆ సిద్ధాంతము మారుచో, పారిశ్రామిక విధానముగూడ మార్పు చెందవలసియుండును. దేశరక్షణకు హింసాత్మకమగు సంగ్రామ పద్ధతుల ననుసరింపవలెననినయెడల అందు కవసరమగు ఆయుధపరికరములను నిర్మించు

ఆధునిక యంత్రపరిశ్రమ లన్నియుగూడ నుండక తప్పదు.

ఈప్రళయసమయమున ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణమునుగురించి అధికారులను వత్తిడిచేయుటకు పరిస్థితులు అనుకూలముగ లేవు. కాని, అంతమాత్రమున ఆంధ్రులు నిరుత్సాహులై యూరకొనక ఆంధ్రజాతీయ తను బలపరచు ఇతర ఉద్యమములయందు తమ దృష్టిని కేంద్రీకరించుచుండుట సంతోషదాయకము. ఈ ప్రయత్నములఫలితముగ కోస్తాప్రాంతములకును, పడమటి జిల్లాలకును అన్యోన్యత యధికమై ఆంధ్రరాష్ట్రసిద్ధికి ఉభయప్రాంతములవారునుకలసి ఏకకంఠముతో నాందోళన మొనర్పగలుగునెడల ఆంధ్రరాష్ట్రము చాలవరకు సాధింపబడినదనియే చెప్పవచ్చును.

ఈ ప్రస్తావనను ముగించుటకు పూర్వము పాఠకలోకమున కొక్క విషయమును మనవి చేయవలసి యున్నది. ఉగాదినాడు ఆంధ్రసంచికలను ప్రచురించుటకు ప్రారంభించి నేటికి ముప్పది రెండు వత్సరములైనది. ఇది ముప్పదిమూడవ సంచిక. ప్రస్తుతము దేశమునం దేర్పడియున్న కాగితపు కఱవుచే, మేమీసారి ఈ సంచికను యథాపూర్వముగ ప్రకటింపగల్గుదుమని తలంపలేదు. సంవత్సరాది పండుగకు కొలది దినములకు ముందు మాత్రమే మా కీవిషయమున కొంత ధైర్యము చిక్కినది. అపుడు వ్యాసముల కొరకు ఆహ్వానములనంపితిమి. తగినంత వ్యవధి లేకపోయినను, మా కోర్కెలను మన్నించి, అమూల్యములగు తమ వ్యాసములనంపిన వ్యాసకర్తలకందరకును మా హృదయ పూర్వకమగు కృతజ్ఞతాభినందనముల నందజేయుచున్నాము. పాఠకలోకము యథాపూర్వముగ మా ప్రయత్నమును ఆదరించి ప్రోత్సహింతురని నమ్ముచున్నాము.

చిత్రభాను వత్సరము ప్రపంచమున కంతకును శాంతి సంధాయకమై, ప్రజలు సౌఖ్యముల బడయగల్గుదురని ఆశించుచున్నాము.

# పుష్పవృష్టి

శ్రీ గుఱ్ఱప్పడియ ఆంజనేయులు

తరుణరసాల భూరుహా నితంబిని కమ్మని విందొసంగ, నిం
దిర నలరించు గానజలధిం గదలించు పికాధినేత లె
ల్లరు నుతిసేయ, నూత్నరుచులం జనుదెంచిన చిత్రభాను వ
త్సరము దిగంతశాంతి సుఖదాయకమై జగమేలుఁగావుతన్.

చెదరిన భాగ్యరేఖలకుఁ జక్కులుదీసి, స్వకీయరాష్ట్ర సం
పద గడియింప దుష్కర తపంబొనరించు తెలుంగుజాతిపై
నెదఁగరుణించి, విశ్వజగదీశ్వరుఁ డాంధ్రమహీపురంధ్రి క
భ్యుదయ వరప్రదానమునఁ బూర్ణమనోరథ సిద్ధిఁ గూర్పుతన్.

# ఉగాదివేకువ

= శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి =

మాఁమిడిపూఁతలోన మధుమాసపు శోభలు తొంగలింప, శా
ఖామృదుడోల నూఁగుచును గానముసేయ వనప్రియమ్ము లా
రామమె పల్లవించి కళలన్ గురియింపఁగ స్వర్గమట్లు, లీ
లామయు సృష్టిఁ గాంచి నుతులన్ బొనరింతు నుగాదివేకువన్.

సురభిళంబైన నింబ ప్రసూనవితతి
హారితరక్తవర్ణమ్ముల నలరుతలిరు
జొంపములు పాంథజనముల చూడ్కిఁ దనిపి
హృదయముల నూతనానందమొదవఁ జేయు!

పొరిఁబొరి కష్టముల్ దొలఁగిపోవ, నపూర్వములైన సౌఖ్యముల్
బొరసెదమంచు కాంక్షలను బూని ప్రజల్ ప్రమదాబ్ధిఁ దేలిపో
యిరి, పరిణామ మెట్టిదో నిరీక్షణకున్ తలపోయఁజాల మీ
శ్వరుని కృపాస్రవంతి కొనసాగునో శాంతతరంగ శోభలన్.

హృది నైరాశ్యభరంబునన్ కలఁగిపోనీ, ఘోరదారిద్ర్యమే
కొదవల్ గూర్పఁగ నాలుబిడ్డలును నాక్రోశింపనీ, ధైర్యసం
పద గోల్పోవని మా కృషీవలుఁడు భూమాతన్ సమర్చింప, ని
రదసంతానము లాడవే దివిని గర్జామాధురీరీతులన్.

తొలుకారు మేఘములు, చి
న్కులు రాల్చుచుఁ దొలఁగిచనుచు నుల్లములం దా
శలు గొలిపెడు, నేఫలములు
గలవో యెఱుఁగుదుమె భావికాలమునందున్?

తన సౌందర్యము కుప్పవోసిన వసంతశ్రీ విలోకించి ని
ర్జనవాసంబున భావలోలురెద నారాధించుచున్ తన్మయం
బున, నెగ్గెత్తి రసార్ద్రగీతికలు సమ్మోదంబునం బల్కి దీ
వన లందింతురు నూతనాబ్దమునఁగూర్పన్ సర్వసౌఖ్యోన్నతుల్.

మరల వాసంతవల్లరుల్, మధురమధుర
కోకిలాలాపములు, చివురాకుగములు,
మరల నవజీవితానందమగ్నగతులు
స్వాదువనిపించె చిత్రభానూదయమ్ము!

# చిత్రభాను సంవత్సర ఫలాలు

= శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులు =

శ్రీమాత ! మణిద్వీప-స్వామిని వని పేరు పొంది సకలజగముల౯
ప్రేమించి యేలుచుందువు - కామేశ్వరితల్లి ! భక్తకల్పకవల్లీ !

హైందవు లందఱచే నభి-వందితపాదాబ్జ ! కష్టజలధి మునుఁగు మా
యందఱ డెందమ్ముల నా-నందము నొందింపుమా ! జనని ! కామాక్షీ !

శ్రీలు జయమందఁగాత ! మీ చిత్రభాను-వత్సరమ్మున నాయీ నవగ్రహముల
వలన దేశమ్మునకుఁ గల్గవలయు ఫలము - లెల్ల వినిపింతు వినుము కామేశ్వరమ్మ !

మత్సరి యా కుజుండు యజమానుఁడు కాఁగల చిత్రభానుసం
వత్సరముం దలంచుకొని వందురుచుండఁగ వచ్చిపడ్డ దా
పత్సమయమ్ములా ; గెటులు పాలన చేతువో యేమొ ? తల్లి ! నీ
వత్సలతాకటాక్షముల వైభవ మిప్పుడు గుప్పఁగావలెన్.

అంగారకుండు రా, జాపైని ధాన్యాధిపతియు నైనాఁడు తత్ఫలము లిట్లు—
రోగాగ్ని బాధ, చోరులబాధ, శత్రుబాధయు, భూపతులకు యుద్ధముల బాధ,
సరిగ వానలు లేక సస్యమ్ములకు బాధ, మిక్కిలి హెచ్చుగా మృత్యుబాధ*
తప్పనివఁట !; శూకధాన్యముల్ రక్తధాన్యము లెట్టిభువి పండునంట !; ఔను
గాని, రా జెంత దుర్మార్గుఁ డైన నేమి? - మంత్రి మొదలైన నాయకుల్ మంచివారు
గాన రాజువలని దుష్టమైన ఫలము - మనకు లేదంట ! అనుకొంట మంచిదంట !

మానముగఁ జిత్రభాను సు-భానులు మొత్తమునఁ జెడ్డ వత్సరములె యా
నైనను నీదయ గలిగిన - మానవులకు మంచిగానె మాఱును దేవీ !

ఒక్కరాజు దక్కఁ దక్కిన నాయకుల్ - మంచివారు ; మఱియు మంచివాఁడు
చందమామ మంత్రి, సైన్యాధిపతియు, మే-ఘాధిపతియుఁ గాన నగును మేలు.

చంద్రుండు మంత్రి, పర్జన్య-సేనా-గ్రామ-పూర్వ మధ్యమసస్య ధూర్వహుండు
గాన వర్షించుఁ, జక్కఁగఁ బండు సస్యమ్ము, లాలుబఱ్ఱెలు చాలఁ బాలొసంగు,
ప్రజల కారోగ్య సౌభాగ్యముల్ వర్ధిల్లు, శాంతి కల్గును, సుభిక్షముగ నుండు,
బ్రాహ్మణుల్ స్వక్రియాపరతంత్రు లగుదు, రెల్లెడల వాయువు వీచు నిష్టముగను

---

* ఒక వత్సరమ్మలోపలఁ - బ్రకటమ్ముగ గురుఁడు మూఁడురాసులలోఁ ద
ప్పక తిరిగెనేని నిండును - సకలధరణి యేడుకోట్ల శవములతోడన్.

వృక్షజాతులు ఫలియించు నక్షయముగ-గోదుమలు వడ్లు చెఱకు నెక్కువగఁ బండు
నీతిమార్గానువర్తనుల్ నేలతేండ్లు - మాత! ఈతఁడె ముందు రా నౌత! మనకు.

బుధుఁ డంతిమసస్యములకు - నధిపతి కాఁబట్టి వాని నన్నింటిని న
త్యధికముగాఁ బండించును - బుధుఁ డనఁగాఁ జంద్రునకు సుపుత్త్రుఁడు గాఁడే?

సస్యాధిపతి, నీరసప్రభుండును, బురోహితుఁడు, పరీక్షకుం డింద్రగురుఁడు
కనుకఁ దత్ఫల మిట్లు—సెనగలు, యవలు, గోధూమమ్ములును, బచ్చభూమి పండు.
పశువులు బాగుగాఁ బాలిచ్చు భూపతుల్ నీతిమంతులు వృక్షజాతి పండు.
వక్కలు, రత్నముల్, బంగారు, ధాన్యముల్, ప్రత్తి, తోళ్లు, సుగంధవస్తువులును
వృద్ధి నై చౌక యగు. విప్రులు నిజకర్మనిరతు లౌదురు. ప్రజానీకము కడు
నారోగ్యభాగ్య మేపారుచుండఁగ నిత్య మొండొరున్ ప్రేమించుచుండి సుఖము
లొందుదురు మంచివర్షమ్ము లుండి పంట-పండును. పరీక్షకులు నీతిపరులు. ధాన్య
ములకు సామాన్యముగ మంచివెలలు గలుగు-నిట్లు జరిగినఁ బ్రజల కింకేమి వలయు?

కవి గణకుఁడు గావున మంచివర్షములు గురిసి యెల్లచేలును పండున్
తవుగతి వెలలును గలుగును— కవులకు గణకులకు నొదవు గౌరవ మంబా!

రసములపతి శని యగుటను - రసహాని ధనక్షయముఁ దురకలకుఁ బెంపున్
పొసఁగును వానలు తక్కువ - పసిగా సస్యములు ఫల మొసంగవు దేవీ!.

ధరలపతి సూర్యుఁ డౌటచే ధరలు తగ్గు - వర్షముల్ స్వల్ప మాఁకలిబాధ హెచ్చు.
ప్రభువు లన్యోన్యవైరులై సభయు లగుదు-రింకఁ బ్రజలకు సుఖశాంతు లెట్లు గలుగు?

ఈతఁడె దైవజ్ఞుండై - నీతిపరులఁ జేయు ధారుణీపతులను ని
ష్ణాతముగఁ జేయు బాఁపన-జాతిని తన పనులయందు; జరగునె? అంబా!

దండధరుఁడు పాలకుండును స్థానసం-రక్షకుండు పోతరాజు గాన
పరమమిత్ర మైన పశుసంతతికి వృద్ధి -- యుండవలసినంత యుండదంట!

భూమిని మోయును పద్మక-నామముగలపాము గాన నరులు సుఖశ్రీ
క్షేమారోగ్యసమన్వితు-లై మోదము నొందుచుందురఁట! ఈయేఁటన్.

ఖగముల్ నా గ్రహమండలమ్ము తమదౌ కర్తవ్యముం జేయుఁగా
క గురుం డట్లు చరించినన్ సరియె ముఖ్యమ్మైన మా టొక్కటే
భగవద్భక్తులు పాపభీతులు దయాస్వాంతుల్ ప్రశాంతాత్ము లే
దిగులుం జెందక సంతసింతు రని మీ తీర్థుల్ వచించున్ శివోమ్.



# నాదబ్రహ్మము

= శ్రీ శొంఠి వెంకటరామమూర్తి =

౧

ముప్పదిసంవత్సరముల క్రిందట, నేను ఇంగ్లాండులో ఐ. సి. ఎస్. ప్రొబేషనరుగ నుండగ, ఆంధ్రపునరభ్యుదయముకొఱకు పాటుపడినవారిలో నగ్రగణ్యులైన కీర్తిశేషులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రిక ప్రథమ ఉగాదిసంచికకు నన్నొక వ్యాసము వ్రాయగోరిరి. నేడు, వారి అల్లుడు-ఇప్పటి పత్రికాసంపాదకులు ఈ సంచికకు ఒక వ్యాసము వ్రాసి పంపగోరినారు. నే నందుకు సంతోషముతో నంగీకరించితిని. వారు నాకు నిర్ణయించిన విషయము 'నాద బ్రహ్మము.'

౨

బ్రహ్మము సత్తు అగును, అసత్తుకూడ నగును. బ్రహ్మము నిజముగ త్రిరూపాత్మకము—సత్తు, అసత్తు, ఈ రెంటిని అంగీభూతము చేసుకొను పరమతత్వము. అట్లే త్రిగుణాత్మకముకూడ – సత్వరజస్తమములనెడు గుణములు గలది. ఈ త్రిత్వము నీక్రిందివిధముగ గూడ సూచించవచ్చును: అస్తిత్వము (Existence), స్పందనము (Vibration), విస్తృతి (Extension); లేదా, జడము (Matter), శక్తి (Energy), ఆకాశము (Ether). బ్రహ్మముయొక్క స్వరూపము అణురూపాత్మకము(Atomic). అణువులు అంతరిక్షములో ఆవాసస్థాన మేర్పరచుకొన్నవి. అణువుల సంయోగ వియోగములీ అంతరిక్షముగుండ జరుగుచుండుటవలన అంతరిక్షముగూడ అణువులస్వభావమున బాల్గొనుచున్నదని చెప్పనొప్పును. శక్తి పరిమాణరూపతః(Quantam) అణురూపాత్మకము, జడము(Matter) దేశము (Space) అణువుల, ఎలెక్ట్రానుల మయమైనట్లే.

౩

త్రిరూపాత్మకమైన బ్రహ్మము అనేక భూమికలలో (levels) అభివ్యక్త మగుచున్నది. జడప్రపంచము మనకు సులభముగ ప్రత్యక్షమగుచున్న భూమిక. జడము అసత్తు. దీని దిక్కు మనకు దేశము (Space), లేక విస్తృతిగ (Extension) గోచర మగుచున్నది. కాలము ఈ రెంటిని అనుబంధములుగ కూర్చుచున్నది. జడ, దేశ, కాలములు మూడును జేరి బాహ్యములుగ గన్పట్టుచున్నను, నిజముగ మనోమయ జగత్తునందు

ప్రతిష్ఠితములై యున్నవి. అన్నమయ (Matter-Space-Time) మనోమయములను, అంతర బహిరములను, విషయావిషయములను (Subject and Object) అంతర్భుక్తము చేసుకొనునది నిజముగ ఆత్మతత్త్వము. బ్రహ్మము ఈ సదసత్తుల భూమికల నన్నిటిని సూచించుచుండుటచేత, ఇవన్నియు ఆత్మయొక్క భిన్నలోకములే అని తెలియనగును.

౪

జడము దేశములో (Space) నివాస మేర్పరచుకొని ఉన్నది. సంచలనము (Motion) ఈ రెంటిని అనుబంధములుగ జేర్చుకొని బ్రహ్మమున కొక భూమిక అగుచున్నది. జడములో సంచలనము కలిగి నాదప్రపంచ మేర్పడుచున్నది. ఇది మరియొక భూమిక. ఆకాశమునందలి సంచలనము వర్ణప్రపంచమును గల్పించుచున్నది. ఇవన్నియు బ్రహ్మముయొక్క భిన్నభూమికలు. సంఖ్యారూపము మరియొక భూమిక. అందు మన జ్ఞానము గడ్డకట్టుకొనుచు, తిరిగి కరిగిపోవుచు సంఖ్యాప్రపంచము నేర్పరచుకొనుచున్నది.

ఈవిధముగ బ్రహ్మము అనురూపమై సంఖ్యాప్రపంచముగ రూపొందుచున్నది.

౫

నాదము అణురూపాత్మకము. సంగీతమున అణువుల స్పందనము క్రమానుగతములైన తరంగవేగములవలన ఆరోహణావరోహణము లేర్పడుచున్నవి. ఒక తరంగవేగమును ప్రమాణముగ (unit) 'స' స్వరము నిరూపితమైన యెడల తక్కిన తరంగవేగ ప్రమాణములు $2^{\frac{1}{12}}$ నుండి 12 మెట్లమీద బైకిపోవునప్పుడు రెండై తిరిగి 'స' స్వర మేర్పడును. ఈస్పందన క్రమమే మన చెవులకు ఇంపునుగూర్చును. మనకంటె భిన్నమైన జీవు లుండురేని, నాదపు అణువుల వేరు కూర్పు వారికి శ్రావ్యతను గల్పించవచ్చును. ప్రధానస్వరముల మధ్య నుండు అంతరములు కూడ నాదపు అణువులతో నిండియుండును — సంఖ్యకు సంఖ్యకు మధ్యనుండు అంతరములుకూడ సంఖ్యామయము లైనట్లు. మన చెవికి సోకని నాదప్రపంచ మెంతయో కలదు. మనకు శ్రవణగోచరమైన నాదము ఆ శ్రవణాతీతమైన నాదప్రపంచమున ప్రతిష్ఠితమై యున్న దనుట నిశ్చయము. మనకు శ్రవణాతీతమైన నాదము మనకు అశబ్దముగ తోచవచ్చును; లేదా మన చెవులకు కటువైన శబ్దముగను తోచవచ్చును. మనకు శ్రుతిరంజకమైన నాదము ఆమహానాదములోని ఒక అంశమాత్రము.

౬

బ్రహ్మ మెంత గభీరమో, ఎంతవిశాలమో, ఎంత పూర్ణమో బ్రహ్మభూమికలలో నొకటియగు నాదముకూడ అంత గభీరము, అంత విశాలము, అంత పూర్ణము అని గ్రహింపనగును. అందుకనియే నాదము పరబ్రహ్మస్వరూపమని మన ఋషులు కీర్తించిరి.

# పదములు - క్షేత్రయ్య

= శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ =

"మదివిటులు వెధవలంజలు" ఇత్యాదిగా, ఎందుకును తరముగానివానిలో 'పదకవితలు'గూడ ఏమహానుభావుఁడో — శ్రీనాథుని దాకీర్తి — చేర్చి త్రోసినాఁడు. ఇట్లే "ద్విపదకావ్యంబు ముదిలంజ దిడ్డికంత" అని మఱియొక్కఁడు గుంపుగూర్చెను. కాని పాల్కురికి సోమనిమొదలు నేఁటివఱకు వద్దన్నను వినక ద్విపద కవిత్వము తెలుఁగుసాహిత్యములో చోటుచేసికొని కూర్చున్నది. 'పామరుల'తోఁగూడ 'పండితులు'ను చేరి దాన్ని నాదరించి గౌరవించినారు. కొన్ని ద్విపదకావ్యములు ప్రామాణికములుగూడ నైనవి. కాని పదకవిత్వమున కా పుణ్యము ఇంకను పట్టలేదు.

ఛందస్సు కొంత సులభమని అందలి రచనలు గూడ అనవసరముగా వెలివేయుటకంటె సాహిత్యప్రపంచమందు అన్యాయము వేఱొకటి యుండదు. కవుల విషయమున మన మీ ద్రోహమును చాలనాళ్లుగా చేయుచున్నాము. తిక్కన్నవంటివానికిఁగూడ, చంపకాది చతుష్టయము, కందసీసగీతములు తప్ప తక్కిన జాతివృత్తములలో రచనచేయుటకు రాదని సమకాలికు లెవరో అవ్యావర్తకులు అడుకొనఁగా, ఆ పరమప్రశాంతమూర్తికిఁగూడ అసహ్యము, కోపము గలిగి చిక్కిన వృత్తములలో స్త్రీపర్వము నల్లగిసి చెఱిచినాఁడు. మన ప్రాప్తము — ఆయన అక్కసు అంతటితో తెగిపోయినది! లేకున్న తెలుఁగుభారతముగతి యేమైయుండునో ఊహించుటకును భయమగుచున్నది.

## 'పదము' అనఁగా నేమి?

'పదము' అనుమాటకు తెనుఁగులో సొంతముగ నొక యర్థ మేర్పడినది. సంస్కృతమున గంపెఁడర్థములు. గాయకప్రపంచమందు మొత్తపు పాటయందలి కేంద్రమగు భావమును వెలువరించు భాగమునకు 'పల్లవి' యని నేఁటి వ్యవహారము. ప్రాచీనులు దానిని 'ధ్రువపదము' అనిరి. అందలి 'పద'శబ్ద మూడిపడి 'ధ్రువ' మాత్రము 'దరువు'గా ఇంకను తెలుఁగులో నిలిచినది. జయదేవుని 'గీతగోవిందము'నకు 'అష్టపది' యని మనలో వ్యవహారము వచ్చుట చూడఁగా, ఇప్పుడు 'చరణము', 'నుడుగు' అని వాడఁబడు గీతభిన్నభాగముల కొకానొక కాలమున 'పదము' అను పేరు గలిగియున్న ట్లూహింపవలసియున్నది — అందలి ప్రతిపాటకును ఎనిమిది 'నుడుగులు' కలవుకాన. కాని యిప్పుడు శృంగారమయమై, ఎక్కువగా విలంబకాలమందు, క్వచిత్తుగా మధ్యమకాలమందు నడచుచు, పల్లవానుపల్లవములు, మూఁడింటికి తక్కువకాని చరణములు గలిగి, ప్రాచీనరక్తిరాగములలో చేయఁబడిన గేయరచనకు 'పదము' లని పేరు. పాటలన్నిటిని పదము లనము. (ఆ వ్యవహారమును ఇప్పటి పామరులలో పూర్తిగా లేకపోలేదు.) సంగీతరచనాప్రధానము లగు త్యాగయ్యగారి రచనలవంటివానిని 'కృతు' లనుచున్నాము. భక్తిప్రధానములగు రామదాసుపాటలవంటివి 'కీర్తనములు' అనుచున్నాము. సంగీతసాహిత్యములు రెండును చౌకరకములనై దేశీయరాగములలో చిల్లరశృంగారపుమాటలఁ గూర్చిన పాటలను 'జావళ్లు' అనుచున్నాము. కృతులందువలె సాహిత్యమును గాని, కీర్తనలందువలె సంగీతమును గాని దిగమ్రింగుటకు పదములలో అనుమతి లేదు. రెంటికిని సమాన ప్రాధాన్య మీయఁగల సంగీతశిల్పికి తప్ప తక్కినవారి కిందులో పప్పుడకదు. లయస్థాపనకై అకారేకారములను దంచుట, శ్రుతిని సవరించుకొనుటకై అస్థానమందు 'రీ' అని విశ్రాంతి పుచ్చుకొనుట, నాదమును దానినంటిన యక్షరములు పుట్టిన చోటఁగాక వేఱెక్కడనో వెలువరించుట ఇత్యాదులు పదగాయకుఁడు వదలవలసిన దోషములు.

### పదకవితా పితామహుఁడు

ఈపదకవితకు పితామహుఁడు, ఇప్పుడు మన మెఱిఁగినంతవరకు, తాళ్లపాక అన్నమయ్యంగారు. తిరుపతి దేవాలయమువారు తాళ్లపాకవారి పాటలను — మాటలుమాత్రము — యథాయోగ్యములుగా ఈవల అచ్చు వేయుచున్నారు. ౧౫-వ శతాబ్ది ఆదినుండి ఇంచు మించు పదునాఱవ శతకము తుదవఱకును ఈకుటుంబము వారు పదకవితకు మార్గదర్శకులై పనిచేసినారు. అన్నమాచార్యుని మనుమఁడు చినతిరుమలార్యుఁడు 'సంకీర్తనలక్షణము' అను చిన్న గ్రంథముగూడ వ్రాసెను. వారు తమ రచనలను 'సంకీర్తనము'లని పేర్కొన్నను, వారికాలమందే వానికి పదము లను పేరు వాడుకలోనున్నట్లు పైగ్రంథమే తెలుపు చున్నది. దాని తుద నీపద్యము గలదు:

"బూరుగుకాయం గొఱికిన
నీరసతూలంబు దిశల నిండినగతి ని
స్సారపదబంధకవితా
పారీణుల పదము హాస్యపదమై యుండుఁగా."

---

తాళ్లపాకవారి కాశ్రయమిచ్చిన విజయనగరా స్థానమునే ఆశ్రయించి పదునాఱవశతాబ్దమం దుండిన వ్యాసతీర్థులు, పురందరదాసులు మొదలగు వైష్ణవ భక్తులు కన్నడభాషలో 'దాసరపదగళు'అను పేర నీతి భక్తిప్రధానములగు ఇట్టి రచనలనే వేల లక్షలకొలఁదిగా రచించి దేశమంతట వెదచల్లి 'దాసకూటము' అను నూతనసంప్రదాయమునే స్థాపించిరి. అది యిప్పటికిని కర్ణాటకమున అనువర్తించి వచ్చుచున్నది. తెలుఁగులో పదకవిత తరువాత చాల శాఖోపశాఖలుగా పెరిగి కొన్నియేండ్లక్రింద నిలిచినది. దాని కడపటి పరిణత రూపమే జావళ్లు.

### తెలుఁగుపదములలో శృంగారమునకు కారణము

కన్నడమున ఈవాఙ్మయము భక్తిమతప్రధాన ముగా వెలసినది. తెలుఁగులో ఇది శృంగారమయ ముగా విజృంభించినది. కన్నడమున శృంగారపదము లును, తెలుఁగున భక్తిపదములును చాల అరుదని చెప్ప నంత గౌణస్థితికి ఆరెండురసములును దిగినవి. ఈవిం తకు నిజమైన హేతు వేమో చెప్పలేను. ఒక ఊహ సాహసించి చేసెదను.——కన్నడవాఙ్మయమున అంతకు చాలఏండ్లక్రిందనే శైవవైష్ణవమత ప్రచారకులు రాజా శ్రయము నాశించక సామాన్యజనోద్బోధమునకై సాహి త్యమును సృజించిరి. తెలుఁగువాఙ్మయ మన్ననో మొదటినుండియు రాజుల పెట్టుపోఁతలచేతనే బ్రదికి బైటఁబడినది. తెలుఁగుదేశమున రాజుల సంఖ్యయు ఎక్కువ. రాజులు సహజముగా రసికులు. రమణీ కుసుమాయుధులు. అందును తెలుఁగురాజులు తమ శౌర్యమును పొగడించుకొనునప్పుడు గూడ, శత్రు రాజులు స్త్రీలని, తాము పురుషు లని చాటించుకొని తృప్తిపడినవారు.'రాయవేశ్యాభుజంగులు' కాని రాజులు తెలుఁగులో పలువురు లేరు. కాఁబట్టి వారి యాజ్ఞచే, ప్రోత్సాహముచే పుట్టిన రచనలలో శృంగారము నిండి యుండుట వింతకాదు. మఱియు భగవత్ప్రియమే భక్తుని శృంగారముగా మాఱుట అనేకమతములలోఁ గల సహజపరిణామము. మఱి దానికి రాజసమ్మానము గూడ లభించెనేని అడుగవలయునా? కావున తెలుఁగు పదములలో పేరు దైవభక్తియైనను పదార్థము మనుష్య శృంగారమే యైనది.

### పదకవితా జనకుఁడు క్షేత్రయ్య

తెలుఁగు పదకవితాకన్యకు పితామహుఁడు తాళ్ల పాక అన్నయ్యగారంటిని. కాని జనకుఁడు క్షేత్రయ్య. తాత మొదలుపెట్టిన పనిని తలపాలముదాఁక ఈడ్చిన తండ్రి యితఁడు. తరువాతివారి సేద్యము గనిమలను దాఁటి ముండ్లలో, రాళ్లలోఁగూడ మడకనీడ్చి కంపల పొదలను పెంచినని. ఇతనికి ముందుగాని, వెనుకఁగాని తెలుఁగుసాహిత్యములో — ఒక్క తిక్కన్నను వదలితి మేని — ఇంతటి రసికుఁడు, సహృదయుఁడు, భాషా మర్మజ్ఞుఁడు, ప్రతిభాశాలి యగు కావ్యశిల్పి ఇం కొకఁడు పుట్టలేదు; ఎట్లును నాయెఱుకకు రాలేదు. ఇతని పాత్రములు మెఱుపుతో తయారైనవి; మఱవ రానివి; భావనాప్రపంచమందలి ప్రతినాడిని వేధించి

నిలుచును. ఇతనితరువాత ఇతనివలె వ్రాయఁబ్రయత్నించినవారు పెందలకొలఁది.

ఇతని చరిత్రమునుగూర్చి ఎక్కువగా మన కేమియు తెలియదు. ఆంధ్రసాహిత్యచరిత్రను వ్రాసిన యెవరుగాని ఇతనినిగూర్చి చర్చింపలేదు. అరవవారగు శ్రీ వి. వృద్ధగిరీశన్ అను పండితులు అణ్ణామలై విశ్వకళాపరిషత్పత్రికలో తంజావూరి నాయక రాజులను గూర్చి వ్రాయుచు (మార్చి 1941) —

*" Kshethragna, the great South Indian musician and composer is said to have adorned the Court of Vijaya Raghava and flourished in that period."*

(దక్షిణదేశపు మహాగాయకుఁడును, మహాకవియు నగు క్షేత్రజ్ఞుఁడు విజయరాఘవనాయకుని ఆస్థానము నలంకరించి ఆకాలమున నున్నట్లు చెప్పుదురు.)

అని సంగ్రహముగా చూపినంత గౌరవము గూడ ఆంధ్రులైన ఆంధ్రచరిత్రకారు లెవ్వరును చూపకపోవుట అనిర్వచనీయము వింత! శ్రీ వీరేశలింగము, చెంచయ్య-భుజంగరాయులు ఇతని పేరే యెత్తలేదు. శ్రీ వంగూరి సుబ్బరావు, వేంకటనారాయణరావులు క్షేత్రయ్య పేరు గూడ చెప్పక మువ్వగోపాల పదము లనిమాత్రము చెప్పి, ఒకరు సంఘమునకు మిక్కిలి అపకరించు జావళీల తరగతికి చేర్చి కొట్టివేయఁగా, వేఱొకరు త్యాగరాజకృతుల పంక్తిని సమీపించునని యూరకుండిరి. పదములను చదువకమునుపే, అవేవో అపభ్రష్టరచనలని కర్ణాకర్ణికగా వచ్చిన చాందసాభిప్రాయము నెలకొనుటచే కలిగిన దీయుపేక్ష. తుదకితని ప్రయోగములను నిఘంటువులో ఉదాహరించునంత చొరవ చూపిన శ్రీ సీతారామాచార్యులకుఁగూడ కవుల పట్టికలో ఇతనిని చేర్చి చాటుటకు ధైర్యము చాలదయ్యెను!

మద్రాసుయూనివర్సిటీపత్రిక 1938 జనవరి సంచికలో టి. ఎస్. వాసుదేవన్ అను మఱియొక తమిళువిద్వాంసుఁడు క్షేత్రయ్యను గూర్చి ఈక్రింది విషయములు ప్రకటించిరి (*Article on the Karnatic Composers*) :

" క్షేత్రయ్యనివాసము కృష్ణామండలమందలి ఘంటసాలదగ్గఱి మువ్వ యనుగ్రామము. తంజావూరి నాయక రాజులలో కడపటివారగు రఘునాథనాయకుఁడు, అతని కుమారుఁడు విజయరాఘవనాయకుఁడును ఇతని కాశ్రయదాతలగు ప్రభువులు. వారి కాలము ౧౬౧౪ మొదలు ౧౬౭౩ వఱకు. ఆంధ్రకౌముదిలో తంజావూరిరఘునాథరాయలనుగూర్చిన ఇతని చాటుపద్య మొకటి కలదు. తంజావూరిపుస్తకభాండాగారములో ఇతఁడు రచించిన యక్షగాన మొకటి కలదు."

కాని ఆంధ్రకౌముదిలో నామాపున కా చాటుపద్యము కానరాలేదు. భాండాగారపు కేటలాగులో వారు చూపిన 429-వ సంఖ్యగల పుస్తకమునుగూర్చి 'క్షేత్రయపదములు' అనిమాత్రమే వివరణముగలదు. 'నీకేల భ్రమ దీఱదే' అను పదము మచ్చు కుదాహరింపఁబడినది. కావున ఈ కడపటి రెండువిషయములును సందిగ్ధములు. మువ్వ ఇతని స్వగ్రామమనుట నిస్సందేహముగా నున్నది. అక్కడ నేఁటికిని గోపాలుని దేవళము గలదని, ఆచుట్టుప్రక్కల క్షేత్రయ్యవంశమువా రనఁబడు ఆంధ్రబ్రాహ్మణులు గలరని విన్నాను.

ఇతఁడు చిన్నతనమందే ఒక మహాయోగి శ్రీగోపాలమంత్రము నుపదేశింపఁగా, దానిని జపించి ఆ శృంగారరసాధిదేవతను ప్రత్యక్షముచేసికొని, తత్ఫలముగా వెంటనే,

"శ్రీపతిసుతు బారికి నే నోపలేక నిను వేఁడితే
కోపాలా? మువ్వగోపాలా"

అను ఆనందభైరవిరాగపదమును పాడెనని, అది మొద లనేకపదములను రచించెనని ఎట్టియాపురము సుబ్బరామదీక్షితులు 'సంగీతసంప్రదాయప్రదర్శిని' పీఠికలో వాగ్గేయకారకుల చరిత్ర (పుట ౮)లో వ్రాసిరి. మహాపురుషుల కందఱికిని ఇట్టి విభూతికథలు సామాన్యములు. ఇంతకన్న అందమైన కథ మఱియొకటి నేను విన్నాను.

ఇతఁడు తంజావూరు, మధుర మొదలగు పలువురు రాజుల యాస్థానములలో చాల మాన్యుఁడై,

వారినే నాయకులనుగాఁ జేసి పదములు వ్రాయుచు, శృంగారరసమున మునిఁగి తేలుచు, ఒకనాఁడు స్వగ్రామమగు మువ్వకు పోయి, తన యిలువేల్పగు ఆయూరి గోపాలస్వామిని దర్శించుటకై కాయపండ్లను దీసికొని దేవళమునకు పోయెనఁట. అక్కడ దేవతాదర్శనమున కన్న మొదలు ఆదేవత నాశ్రయించియున్న దాసి కన్య యొకర్తు దర్శనమిచ్చినది. దాని తారుణ్య లావణ్యములకు ముగ్ధుఁడై, ఇట్టి వ్యవహారములలో ఆరితేరిన చేయిగావున, దానితో జంకు గొంకు లేక సరసములకు దిగి చేరమాడుటకు ప్రారంభించెను. ఆసానిపిల్ల, పూర్వపుణ్యవశమున తన కుల వ్యాపారమునకు దిగక నిజమగు 'దేవదాసి'యైన భాగవతిగా నుండి, ఇతని సయ్యాటలను తిరస్కరించెను. ఇతని కది సరిపడలేదు. ఒక పల్లెటూరి భోగపు పిల్ల తనవంటి 'విటరాయని' వలపు నుపేక్షించినచో ఇఁకముందు విటసంఘమందు తన పరువు దమ్మిడీకి దక్కదని యతఁడు భావించెను. కావున "నీ వేమడిగినను ఇచ్చెదను, న న్నంగీకరింపక తప్పదు" అని పట్టు పట్టెను. ఆపిల్ల, ఈరాజపూజితునితో ఎక్కువ కంటు గట్టుకొన్నచో తన్ను బలవంతముగానైనను ఎత్తుకొని పోయి వ్రతభంగము చేయునేమో యనియు, భోగము దాని వ్రతము నిలుపుటకు బాసటగా వచ్చువా రెవరనియు తలఁచి, నయముగా తప్పించుకొన నెంచి, "నీవు రాజు లెందఱను గూర్చియో మంచి పదముల నేకములు వ్రాసిన మహాకవివి. నాసర్వస్వమగు ఈ గోపాలదేవునిగూర్చి నాలుగుపదములు చెప్పి నన్ను మెప్పించితివేని నీవెంట వత్తును" అని కోరెనఁట. "ఇంతేనా? అ దెంత ప్రొద్దు?" అని యతఁడు అక్కడనే కూర్చుండి ఆఱుగంటలు గూని రచనచేయఁ బ్రయత్నించెను. కాని భక్తికి సంబంధించిన రసమైన యొక మాటయైనను తల కంటలేదు. ఎన్నఁడైనను దాని ననుభవించియున్నఁగదా! తాను చూచి, అనుభవించి, భావించి, చెప్పిన దంతయు శృంగారమే. అందులోఁ గావలసియున్న వేలకొలఁది పదములను వెదఁజల్లఁగలఁడు. కాని ఫలమేమి? 'రామకృష్ణ గోవింద నారాయణా' వంటి వట్టి యెండుమాటల కూర్పు తాను చేయఁజాలనిది. మఱి హఠమును వదలుకొని బ్రదుకుట యెట్లు? "మా యిలువేల్పగు ఈగోపాలమూర్తియందే మైన సత్యమున్నచో నాచే నాలుగుపదములైనను తన్నుగూర్చి చేయించి ఈభోగపుదిఱుతుక కోడిపోవు బంధబ్రదుకునుండి నన్ను తప్పింపఁగలఁడు. అంతవఱకుపవాసము. అది సిద్ధింపకున్న ప్రాయోపవేశము" అని నిర్ణయించి ఆమూర్తి కెదురుగా చూచుచు తదేకధ్యానముతో కూర్చుండెను. ఆహారము లేదు, నిద్ర లేదు. ఇతని యనుమతి లేక దేవళమువారు తలుపుతాళములు వేయఁగలరా? ఇట్లు చిత్తము, చూపు గోపాలునియందు సమాహితములై రెండుమూఁడు దినములే కడచెనఁట. ఆ తపస్సుకు ఫలముగా శ్రీగోపాలమూర్తి అతనికి తన దివ్యవిభూతిదర్శన మిచ్చెను. ఆ యలౌకికరసానుభవము గల్గినతరువాత ఈరాజులు—రాజ్యాలు, సానులు—సంసారాలు మనస్సున కంటఁగలవా? ఎవరి గతి యేమైనదో కాని ఆతరువాత ఇతఁడుమాత్రము 'జై మువ్వగోపాల' యని తంబుర చేతఁబట్టి అవధూతుఁడై స్వచ్ఛందముగా దేశద్రిమ్మరి యాయెను. పలువైష్ణవక్షేత్రములను సంచరించెను. పోయినచోటెల్ల అక్కడి దేవతపై పదములు రచించెను. అదివఱకు వ్రాసిన పదములలో అంకితమగు నాయకుఁడుగా ఏదొరయో యుండెను. ఇప్పుడాస్థానమున 'మువ్వగోపాలుఁడు' ప్రవేశించెను. అంతే భేదము. ఆద్యంతము అదే శృంగారమే; కాని వేఱు దారిని త్రొక్కినది. తరువాత అతఁడెట్లు, ఎక్కడ, ఎప్పుడు అంతర్ధానమైనాఁడో తెలియదు. అట్లు పలు క్షేత్రములలో ప్రత్యక్షమగుచు పదములు పాడుచుండుట చేత ఇతనికి అసలు పేరు పోయి 'క్షేత్రయ్య' అను పే రొనఁగెనఁట.

కాని ఇతని అసలుపేరేమో యేకథయును, ఎవరును ఇప్పటికి చెప్పలేదు. వీరభద్రుని పేరుగా 'క్షేత్రపాలయ్య' అని కొందఱు అపురూపముగా పేరుంచుకొనుట కలదు. దాని సంగ్రహము 'క్షేత్రయ్య' ఐనను కావచ్చును. కాని అరవదేశమం దితనికి వాడఁబడు 'క్షేత్రజ్ఞుఁడు' అనుపేరుమాత్రము తెలుఁగువారి శక్తికి, రక్తికి మించిన మఱిని గట్టుకొన్నది. అసలు పేరు ఇట్లు ఆనుషంగికముగా మఱుఁగుపడుట ఆశ్చర్యమేమియు కాదు. తానే కంఠోక్తముగా చెప్పుకొన్నను భవ

ధూర్తని 'క్రీంకయ్య' గా నేఁటివఱకెవరు గుర్తింపఁ గలిగినారు !

మఱి అతని పదము లన్నిటియందును ప్రతిఫలించు ఆర్ద్రహృదయమును, రసపారవశ్యమును గమనించితిమేని క్షేత్రయ్యవంటివాని జీవితమున పైకథలోనివానివంటి సన్నివేశములు, అనుభవములు సంభవించుటలో వింత యేమియు నుండదని యెఱుఁగఁగలము.

ఇఁక అతఁడు మధుర, తంజావూరు, గోలకొండ రాజుల యాస్థానములను కంగాణించినవాఁ డనుటకు అతఁడే చెప్పినాఁ డనఁబడు ఈక్రింది పదమే సాక్షి:

దేవగాంధారి-ఆదితాళము

ప. వేడుకతో నడుచుకొన్న - విటరాయడే.

అ. ఏడుమూడు తరములుగా - నిందున్న కొణాచబె,

(౧) మధుర తిరుమలేంద్రుడు - మంచి బహుమానమిచ్చి
ఎదుట గూర్చుండమని - ఎన్నిక లిమ్మనెనే
ఇదిగో రెండువేలపదముల - నిపు డెంచుకొమ్మనఁగ
చనువుమీదనే యున్న సామికి - సంతోస మింతంతగాదే. (వేడుక)

(౨) అటుమీఁది తంజావూరి-అచ్యుతవిజయరాఘవుఁడు
వలయు మనుష్యులవెంబడిని-వేగ పొడగాంచి
చలువచప్పరమున నుండి-చక్కగా వెయ్యిపదములు
పలుకరించుకోగానే-బహుమాన మిచ్చెనావేళ.

(3) బలవంతుడౌ గోలకొండ-బాదుషా బహుమాన మొసగి
తులసిమూర్తితో వాదు-దలచేవేళ
నెలయుచు మువ్వగోపాలుడు-వేయిన్నూరుపదములు
నలువదిదినములలో నే-నవ్వు కలిసి వినిపించెనే. *

ఇది అతఁడే వ్రాసియుండెనేని దీనిప్రకారము క్షేత్రయ వ్రాసిన రాజాంకితపదములే నాల్గువేలనూటికి తక్కువ యుండవు! కాని ఇప్పు డచ్చునకు వచ్చినవి రెండువందలకు కొంచెము మించుగామాత్రము. సుబ్బరామదీక్షితులు తమయింటి వ్రాఁతప్రతిలో ఐదువందలు గల వనిరి. విజయరాఘవాంకితముగా ఇతఁడు 'పంచరత్నములు' వ్రాసెనని (చూ. సం. సం. ప్ర. ౧ భా. పుట ౮). నేను చూచిన ప్రాఁత యచ్చుప్రతి ౧౮౭౩-వ సంవత్సరముది. తరువాతివన్నియు దాని నకళ్లే. అనఁగా ఈ ౬౦ సంవత్సరములలో మరల ఆపదములను సమకూర్పు ప్రయత్నమే జరుగలేదన్నమాట! ఉన్నవానిలో తిరుమలేంద్రుని ముద్రవి, గోలకొండ పాదుషాముద్రవి కానరావు. విజయరాఘవముద్రవి ఐదారు కలవు. ఇవిగాక 'తుపాకుల వెంకటకృష్ణు'ని ముద్రవి మూఁడు నాల్గు గలవు. అవి 'చెంజి' సంస్థానముతోఁడి యితని చనవును సూచించునేమో!

మఱి యితఁడు పలుక్షేత్రములు సంచరించినవాఁ డనుట కనేకపదములు సాక్షిగా నున్నవి. తిరుపతి, కడప, హేమగిరి, తిరువళ్లూరు, చిదంబరము, మేలుకోట, ఇనపురి మొదలగు పుణ్యస్థలము లెన్నో ఇతఁడు తిరిగినాఁడు. ముఖ్యముగా కంచివరదునిమీఁది పదము లనేకము లున్నవి.

ఒకనాఁ డితఁడు కంచివరదరాజుల దేవళమందు రాత్రిపూజను దర్శించినాఁడు. అక్కడ అమ్మవారగు శ్రీ పెరుందేవి దేవళము దిగువను, మీఁదియంతస్తున – హస్తిగిరిమీఁద – వరదుని దేవళమును ఉన్నవి. రాత్రి వరదునికి శయ్యాసనము సమర్పించి అర్చకులు, భక్తులు అమ్మవారి విగ్రహమును మిద్దెమీఁదికి విజయంచేయించి, తలుపులు బిగించి, వినియోగములు ముగించి మూటగట్టుకొని తాళముద్రలు వేసి వెడలిపోయిరి. ఏమూల చీఁకటికంబమునకో జేరగిలఁబడి కన్నులు మూసికొని యున్న యీ పదాలపిచ్చయ్య నెవ్వరును గమనింపలేదు. ఇతని యాంతరదృష్టి యంతయును కేళీమందిరములోని అమ్మఅయ్యల అలౌకికశృంగారరసానుభవభావనలో లీనమైయున్నది. ఆసమాధిలోనే రాత్రి యంతయుఁ గడచినది. తెల్లవాఱుజామున ఇతఁడు యోగనిద్ర మేల్కొని కన్నులు తెఱవఁగా మిద్దెమెట్ల నుండి దిగి వచ్చుచున్నట్లు ఒకానొక దివ్యస్త్రీవ్యక్తి

* ఇది సుబ్బరామదీక్షితుల పాఠము ననుసరించినది. చూ. ప్రథమాభ్యాసపుస్తకము, పుట ౧౧౧. ఇంతకంటె అనర్థకములు, అనన్వితములును అగు పాఠములు గలవు. ప్రాఁతపదముల కూర్పులో ఇది లేదు.

కనిపించెనఁట. వెంటనే యీ క్రిందిపదము ప్రత్యక్షమైనది :

మోహనరాగము - జంపె

ప. మగువ తన కేళికామందిరము వెడలెన్.

అ. వగకాడ మాకంచివరద తెల్లవారెనని.

(౧) విడజారు కొజ్జంగి — విరిదండ జడతోను
కడు చిక్కుబడి పెనగు — కంటసరితో
నిడుదకన్నుల దేరు — నిదురమబ్బుతోను
తొడరి పదయుగళమున — తడబడెడు నడతో.

(౨) స్గగసిసొగయని యలపు - సొలపుమాపులతోను
వగవగల ఘనసార — వాసనలతో
జిగిమించు కెమ్మోవి — చిగురుకెంపులతోను
నగముకుచముల విడియ — చందురులతో.

(౩) తర్రితీపులైన సమ — సురతిబడలికతోను
జరతపావడచెరగు — జార్పైటతో
ఇరుగడల కైదండ — లిచ్చు తరుణులతోను
పరమాత్మ! మువ్వగోపాల! తెల్లవారెనని.

మఱి. యితఁడు తంజావూరి రఘునాథనాయకుని కంకితముగా ఏయేని పదములు వ్రాసెనేమో తెలియదు. విజయరాఘవాంకిత పదములలో కొన్నిటియందు 'అచ్యుతవిజయరాఘవ' అని కలదు. అచ్యుతుఁడితని తాత, తండ్రి రఘునాథుఁడు. తాతపేరు చేర్చుకొని మనుమని పేర్కొనుట ఇందలి విశేషము. కాక యీ విజయరాఘవుఁడు వేఱువ్యక్తిగా నుండునా?— క్షేత్రయ పేరు గల పదము లన్నిటిని సంగ్రహించి పరీక్షించినఁగాని యీతని చరిత్రకాలాదులు నిర్ణయించు మార్గము గానరాదు. అది యెప్పు, డెవ్వరి పుణ్యాన జరుగునో తెలియదు.

పునరుద్ధరణ
ఆవశ్యకత :

అందుకై తెలుఁగుదేశముమాత్రము వెదకినఁ జాలదు. దక్షిణదేశమందలి భరతనాట్యకళలో కేంద్రస్థానము వహించిన వీపాటలు. పదము పాడి యభినయము పట్టుట నర్తకుల పరాయణము. ఆపనికి వలసిన రాగతాళముల రసభావముల విస్తర సౌకుమార్య గాంభీర్యములు క్షేత్రయపదములం దున్నంత మఱెందును ఉండవు. కావున అరవలు, కన్నడులు, మలయాళులు గూడ ఇందుకై తెలుఁగుభాష నేర్చుకొని వాని నుపాసనచేసిరి. కనుక దక్షిణదేశమందెల్ల వీనికై వెదకవలసియున్నది. అట్లు చేయుటలో క్షేత్రయ్యపదముల సంగీతసాహిత్యములు రెంటియందును భక్తిరక్తులు గలిగి సంపాదించినఁదప్ప ఆయన పూర్ణానుగ్రహమునకు పాత్రులము కాలేము.

కాని ఆతని సంగీతమును అతఁడు సృజించినట్లు పునరుద్ధరింపఁగలమనుట నాకుఁ జూడఁగా వట్టి పేరాస. మనలో పాటలను స్వరపఱచి వ్రాసికొనుట ఈవలి పద్ధతి. ప్రాచీనులకు పాట వేదమువలె శ్రుతిపరంపరగా వచ్చినది. సాహిత్యాక్షరములు మాత్రము వ్రాసి గుర్తు వేసికొన్నవారును కొందఱే. మఱియు వేదమువలె స్థిరములగు మూఁడునాలుగు స్వరములతో ముగియక, స్థాయిత్రయములు, సప్తస్వరములు, వాని వికృతులు, గమకములు, సంచారభేదములు— ఇత్యాదులతో స్వతంత్రకల్పన కెక్కువ యవకాశము గల కళగావున, సంగీతము, మేఘమాలికవలె అనుక్షణమును రూపుమాఱుట తప్పని స్వభావము. రాగము, తాళము మొదలగున వెల్ల పాటలకు, మనుష్యులకు కులగోత్రము లున్నట్లు. ప్రాచీనమగు తత్త్వము ఏదో, ఏమాత్రమో అనువర్తించివచ్చుననిమాత్రము కొంతవఱకు చెప్పుకొనవచ్చునే కాని, దానిని మనసుతో ననుభవింపవచ్చునే కాని, అది ఇంత యని, ఇట్టిదని పట్టిచూపలేము. అప్పటప్పటికి వ్రాసి పెట్టుకొను వాడుకయైన నుండినచో కొంత మేలుగా నుండియుండెడిది. అది లేదుగావున సంగీతవిద్యకు పరిణామప్రవాహమునఁ గలిగినంత నష్టము మఱి యే విద్యకును కలుగలేదనవచ్చును. నే నెఱిఁగినంతవఱకు సుమారు నలువదేండ్లక్రింద సుబ్బరామదీక్షితులే సంగీతసంప్రదాయప్రదర్శినిలో నాలుగైదు క్షేత్రయపదములకు మొట్టమొదట చిట్ట తన సంప్రదాయప్రకారము వ్రాసి ప్రచురించెను. తరువాతివా రెవరును ఇదివఱకును ఆ పని చేయలేదు. కనుక తక్కిన జయదేవాదుల గీతములవలె వీనియందును సంగీతవిషయమున

మనకు మిగిలినది ఆ యనిర్వచనీయమగు మూల తత్త్వము మాత్రమే. కాని అనేకులు అనేక దేశము లందు రక్తితో, భక్తితో ఉపాసించినవి గనుక వానిలో అది కొంత యెక్కువగా మిగిలి నిలిచిన దనుకోవచ్చును.

## పదములలోని సాహిత్యపుసొంపు

ఇఁక అరచనల సాహిత్యము అజరామరమైనది. దివ్యమైనది. మర్త్యులమగు మన యవివేకముచే, ఉపేక్షచే ఏగర్భగుడిలోనో మురుగవలసియున్నను వాని యందచందములు అఱనివి; శక్తి శుష్కింపనిది. గమనించి ఉపాసించి అనుభవింపని లోపము మనదిగాని వానిదిగాదు. శృంగారముతప్ప తక్కిన యేరసమున కును ఇందు ప్రవేశములేకున్నను ఇందలి పాత్రముల అనుభవములు అనంతములు, అకృత్రిమములు, సూక్ష్మములు, తీవ్రములు, తేజోవంతములు.

శృంగారమందుఁగూడ క్షేత్రయ్యప్రతిభాబలము పదను స్త్రీస్వభావనిర్వచనమున 'నవనవోన్మేషశాలి' గా నున్నది. భగవద్భక్తిని శృంగారముగా మార్చుకొన్న వారికి ఉపాస్యవస్తువు పురుషుఁడుగాను, తాము స్త్రీలు గాను అనుభవమునకు వచ్చునంగురు.

"స ఏవ వాసుదేవోఽసౌ
సాక్షాత్పురుష ఉచ్యతే,
స్త్రీప్రాయ మితర త్సర్వం
జగ ద్బ్రహ్మపురస్సరమ్"
"స్వామిత్వాత్మత్వ శేషిత్వ
పుంస్త్వాద్యాః స్వామినోగుణాః,
స్వభోగ్య దాసత్వ దేహత్వ
శేషత్వస్త్రీత్వదాయినః."

అనుట వారి మతము. కనుక క్షేత్రయకును గోపాలునియందలి మధురభక్తిచే తనయందు స్త్రీత్వానుసంధానము గలిగి దాని ఫలముగా అన్యాదృశమగు స్త్రీస్వభావానుభవము గలిగియుండును. ఇఁక స్త్రీస్వరూపానుభవమునకు ఆకాలమున, ఆ వీరశృంగారములలో ఏదో యొకటికిమాత్రము బ్రతికిచచ్చిన రాజుల నీడలలో, ఆ వేశవాటికలలో, ఆబహుపత్నీవ్రతనిష్ఠాతుల ప్రపంచములో కొదవ యేమియు లేదుగదా. కాని క్షేత్రయకును అట్టి భౌతికమగు స్త్రీరూపలావణ్యముల కంటె వేయిరెట్లు ఎక్కువ అనుభవమునకు, భావనకు వచ్చినది ఆధ్యాత్మికమగు స్త్రీస్వభావము. కాఁబట్టి ఇతని పదములలో మగబొమ్మలు సేరుగా మన కన్నుల యెదుట ప్రాయశః పడరు. వారి నాడించు సూత్రధారిణులు స్త్రీలే. మగవాఁడు సొంతముగా తన అపుపోపులను వెడలఁబోసికొనునట్టివి—

బిలహరి — త్రిపుట

ప. మఱచితివా నన్ను మగువా?

అ. గుఱుతెఱుగవా మువ్వ—గోపాలుఁడను గానా?

(౧) సుదతి యెన్నఁడు నన్ను—జూడనట్లనేవు;
నిదురకు నేఁగాదా—నీవేళ వచ్చినది?
కొదమగుబ్బలమీద - క్రొన్నెల లేమాయెనో?

(౨) నన్ను తాంగిరో యెన్ని - జాణతనములు చేసేవు!
కన్నెరికమునకు - కంటసరు లిచ్చినది
మొన్న గాదటవే నీ - మోవి గంటుచేసినది?

(౩) పాటలాధరి మువ్వగో - పాల రమ్మని మంచి
తేటముత్తెపుపేరు - తీసుకకూడిన
నాటి బడలి కింకా - నేటికి దీఱదు.

ఇటువంటిపదము లెందు రెందున్నను వాని యందలి నాయకుఁడు ఏవో పరే పొమ్మనవలసినంతటి వాఁడేకాని అట్టే మనల నాకర్షింపఁడు. అదే 'మగ కూయి' ఆఁడదాని నోట పరోక్షముగా వచ్చినప్పటి వన్నె వేఱు, వర్చస్సు వేఱు.

ధన్యాసి—చాపుతాళము.

ప. ఇంతిరో వరదునికి నీపై నెంత మోహమో?

అ. సంతతం బతని వెత చూడ - జాలక యిందు వచ్చితిని.

(౧) చెక్కుట చేయి చేర్చుకొనెను - చిఱునవ్వు
నవ్వుకొనెను,

అక్కట నేదలచినట్లె - నై రా(?)దనెను.
మక్కువ మున చేసిన చెలిమి - మఱపురాదా యె
ననెను

చక్కని యా చెలిని గూడని - జన్మ మేటి జన్మ
మనెను,

(౨) పవతి యొండుండి నేనేమి-పాపము చేసితి ననెను
తనవు నిన్నెడబాసి - తాళలే ననెను
మనవ నొప్పెదనెను–నాపటం జేయుంచుకొనెను
అశించే మీ రేమైన–నార్చెరో తీర్చెరో యనెను.

(౩) వలవరించుచు మా మువ్వగో-పాలుడైన నగధరుడు
నలినాక్షి నాటి సంతో–షడమునో యనెను.
తలచి యను రుసరుమనెను–దైన మిట్లు చేసెననెను.
వలపనే పాపము పగ–వానికైన గారాదనెను.

(ఆ తిరో)

స్త్రీపుంవ్యక్తులని చేతలో ఇంత వ్యత్యాసముగా చిత్రింపఁబడుటకు ఇతఁడే ఒక ప్రధానకారణము ఒకచోట సూచించియున్నాఁడు. ఒక ఖండిత మువ్వగోపాలునితో నిట్లన్నది:

మధ్యమావతి – అటతాళము

ప. నను నీవు వలచేది న్యాయము గాదు.
అ. నిన్ను నేను వలచేది నీతిగాదు మువ్వగోపాల!...

మగవాని –ఆకాలమున–తలఁపు; ఆఁడుదానిది వలపు! తలఁపు తాత్కాలికము; వ్యాధివంటిది. ఏ వైద్యుని మందైనను నివర్తించును. వలపుగలిగిన యొక్కతె తలఁపుకొలఁదిఁ బోయిన మువ్వగోపాలుని నడత నిట్లు సరిపుచ్చుకొనుచున్నది:

మోహన – ఆదితాళము

ప. పరదేశమున జేసిన-పను లిందు చెప్పరాదురే!
అ. తరుణులార! ఇ దెక్కడి జోలి? తాళగదరె మీ
పుణ్యమయ్యేని.

(౧) దాని యింటికి బోయి వలచి–ధనములిచ్చి వేడు
కొన్నాడా?
వాని చక్కదనమె చూచి–వలచి పైకొని బతిమాలి
గానవిద్యాప్రౌఢిమచే–కరగించినట్లుగాబోలు
మానిని మగవాడుగనుక-మనసు నిలుపలేడాయె.

(౨) పూచిన తంగేడువలె నే-భూషణభూషితురాలై
చూచి మరుడంపినమోహినీ-సుదతిగాలె నేవచ్చినిలిచి
యో చక్కని ముద్దుసామి! ఒంటినుండ
మేరగాదని
పిలిచివచ్చి మాయింటిలో పవ-ళించుమనెగాబోలు.

(౩) ఎన్నగ మధురాపురీశు–డైన మువ్వగోపాలుడు
నన్ను మరుకేళిలో గూడిన–నాటినుండి యొక్క
మెలుగడు,
చిన్నవాడు గాదమ్మ–చెలియరో గాంభీర్యశాలి,
కన్నెరో నేదగ్గ తేని, కాంతాళానసైనట్లుగాబోలు.

(పరదేశ)

ఈ మగతలఁపుస్వరూపమునే సారంగపాణి వేణుగోపాలుని నోట,

"నీవేనా శాస్త్రంబు నాచేత కాకుంటే
నీయక్క యింకొక్కతె అది గాకుంటే-దానక్క
మరియొక్కతె!"

అని వచ్చివచ్చిగా పలుకఁబెట్టి చెప్పించినాఁడు. వలపుట్టినగాదు విరహోత్కణ్ఠయగు, మువ్వగోపాలు వలచిన ముగుద యొకతె యేమన్నది?

ఘన్నాగవరాళి – త్రిపుట

ప. వలపనే దెటువంటి - వస్తువో తెలియదే!
అ. తెలిదుబోణి మువ్వగోపాలుని- చ్చనలకే లోనైతినే!
తాళజాల నేమి సేతునే? అమ్మయ్యో!

(౧) కన్న విన్న మేలుగాదు-ఉన్నచోట నుండనీదు.
అన్నము హితవుగాదు - అదేమో ప్రొద్దుపోదు.
కన్నెరో వలపు నన్నింతగా – చేసెనో లేదో
కటకట! తాళ నావశమా? అమ్మయ్యో!

(౨) రేయు పగలు నిద్దురలేక-రెట్టించి వానిపై ప్రేమ
ఓయమ్మ! మించెనే తమి - యోర్వ నావశమా!
మాయకాడు మువ్వగోపాలుని – మచ్చికలకే
లోనైతినే
గాయకము తెలియనైతినే! అమ్మయ్యో!

(౩) కలలో మెలకువను వాని కలవరమే గాని
చెలులతో మాటాడ నా-చిత్తము రాదే
అలవాటులేని మోహము గాకనే.
అయ్యయ్యో! ఏమి సేతునే? అమ్మయ్యో!

తెలియని వస్తువును తెలిసికొనుటకే ప్రయత్నించిన ప్రతిభాస్వయంవరపతి క్షేత్రయ్య. నా యెఱిఁగినంతలో స్త్రీ స్వభావమునందలి వైవిధ్యమును, అందచందములను ఇంతసుకుమారముగ, గంభీరముగ తచ్చి

చూచి చూపినవారు లేరు. ఆకాలపు స్త్రీల వలపు, మోహము, భక్తి, త్యాగము, క్షమ, ఆశ, నిరాశ, ఆనందము, ఆహంకారము, అసూయ, కోపము, దైన్యము, ఆవేదనము, తృప్తి, ఆత్మభిరాగ్రహము, మౌగ్ధ్యము ప్రౌఢి—ఇత్యాదు లన్నిటి నిష్కపట సుకుమారచిత్రము లందు చూడవచ్చును. స్త్రీలలో స్వీయ, పరకీయ, సామాన్య, కన్యాజాతులు నాల్గును సమానమగు ప్రీతి గౌరవముతో ఇందు పొందింపఁబడినవి. ఆఁడది యెట్టిదైనను, దాని యవస్థ యెట్టిదైనను అలక్ష్యముతోఁగాని, అగౌరవముతోఁగాని ఇతఁ డెప్పుడును చూడలేదు. మొత్తముమీఁద ఈతని సాహిత్యమంతయు ఆకాలపు ఆఁడజాతియొక్క ఆధ్యాత్మికకథ యనవచ్చును. అంతయు దయనీయమైన కరుణకథ.

ఏకపత్నీకసంసారమునకు వాడుకపడిన మనకు బహుపత్నీక జీవనమందలి యాబ్రహ్మణ్యములు సులభముగా అర్థముకాఁజాలవు. భార్యల 'అసూర్యంపశ్య'మగు అంతఃపురనివాసము; భర్తతోనైనను ఇచ్చవచ్చినప్పుడు ముచ్చటించుట కవకాశములేమి; ఉన్నప్పుడు సవతుల పోటాపోటి; రూపయౌవనలావణ్యాదులయెడ భర్త చూపు పక్షపాతము; అవి గడచిపోవునేమో యను భయము; కలిగిన వలపును కడుపులో దాఁచుకొని క్రుళ్లుచుండవలయుట; మగఁడు చేసిన తప్పు లన్ని మఱచి, మ్రింగి, అతనినే వేఁడుకొనవలసిన సాత్మ్యదైన్యము; అందఱు సవతుల నడుమ అతనిని నేరపఱచుకొనఁగల్గినప్పుడు కలుగు [illegible] ; అహంకారము; అతనిని తోడితెమ్మని చెలికత్తెలను చేత చేతికలగూడ కాళ్లుపట్టుకొని వేఁడవలసిన దైన్యము; చెలికత్తెలే తమకు సవతు లగుట గను[illegible] — ఇత్యాదులు ఇప్పటి మనకు కొంత నవ్వును, కొంత అసహ్యమును గలిగించు చక్కందాలు కాని ఆకాలపు స్త్రీలకు క్షణక్షణము నెదుర్కొనవలసిన తీవ్ర జీవితసంకటములు; సామాన్యముగా తెగని చిక్కులు. ఈ వాఙ్మయము చదివి రసింపఁగోరువారు ఈ విషయము గమనింపనిచో దారితప్పుట తప్పనిది.

వేఱొకటి: ఆకాలమందు పురుషులకు వీరత్వమును, స్త్రీలకు వీరపత్నీ వీరమాతృత్వములును జీవితపరాయణములు. కనుక దేహమనస్సౌఖ్యములను సంపాదించుకొనుటకై వా రఖండప్రయత్నము చేసినవారు. దాని ఫలముగా కామక్రోధాదిభావములకు విలువయు, శక్తియు నెక్కువ. కాఁబట్టి కామము వారికి నిజమగు పురుషార్థము అనఁగా స్త్రీపార్థము గూడ-గా నుండెడిది. కావుననే కావ్యముల రసములలో శృంగారము ప్రధానముగా పరిగణింపఁబడెను. తక్కిన రసములే కావని తిరస్కరించినవారును ప్రాచీనులలోఁ గలరు. కాఁబట్టి వారు శృంగారప్రపంచమును సాంగోపాంగముగా చర్చించి నేర్పాటుచేసినంత మఱి యేరసమును చేయలేదు. సిగ్గు, సంకోచము, మఱుఁగు, మర్యాద మొదలగు సంకేతము లన్ని ఆశృంగారపు విలువను హెచ్చించు నుపస్కారక గుణములుగానే పరిగ్రహించిరిగాని వాని నా మేరను దాఁటనీయలేదు. విరహానుభవములలో కాముకులకు మృతిగూడ కడపటి యనుభవము గావచ్చునను భయము వారి కుండెను. కనుకనే విరహులను జూచినప్పుడు అయ్యోపాప మనని వా రాకాలమం దరుదు. సంకేతములకన్న సత్యము ప్రబలముగా నున్న జీవితము వారిది. దానికి తలక్రిందైనది మనబ్రతుకు. కనుకనే ఈ శృంగారసాహిత్యము మనకు పచ్చిగా, అశ్లీలముగాఁ గానవచ్చును. దానికి మనము భయపడుచున్నాము.

నిజముగా ఈపచ్చి మనము భయపడవలసినదే. దీనికే "మహాశనో మహాపాప్మా" అనియు, "జ్ఞానినో నిత్యవైరిణా" యనియు గీతాచార్యుఁడు [illegible] చేయవలయును? మూలముట్టుగా చంపుట యొక మార్గము. మనము తలతప్పించుకొని తిరుగుట రెండవది. ఈ రెంటికన్న ఉత్తమమైనది, "పా[illegible] మేలుచేసి పాము[illegible] చాలు" అని వేమన్న చెప్పినటు, ఆశత్రువును మిత్రునిగాఁ జేసికొనుట: అనఁగా పచ్చిని పండుగా చేసికొనుట. ఉత్తమసంస్కారము లక్షణ మది. ఈ పచ్చి ప్రశ్న ఒక శృంగారమున మాత్రమే కాక ప్రతిరసమునందును, భాగమునందును గలుగును కరుణము, హాస్యము—బీభత్స భయానకరౌద్రములు చెప్పనక్కరలేదు — మొదలగున వన్నియు అసహ్యమగునంత పచ్చికి దించవచ్చును. నాఁటికి నేఁటికి కవులలో అపని చేసిన, చేయుచున్న

అసంస్కృతు లెందఱో యున్నారు. కాని వాల్మీకి కాళిదాసాదిమహాకవు లందఱు ఇట్లు వచ్చిన పండిం చుటచేతనే మహత్త్వము సంపాదించుకొన్నారు. వచ్చియే పండుకొవలసినదిగాని అదిలేని యిది సృష్టిలో లేనిది. శృంగారమున మనుష్యుల రూపయౌవనములు, అంగసౌష్ఠవము, దేహసంబంధము ఈవచ్చితరగతివి. వీనిమూలమున మనము చేయవలసిన త్యాగములు, చూపవలసిన శౌర్యములు, దయాదాక్షిణ్యములు, కనవలసిన బిడ్డలు, వారినిగూర్చిన వాత్సల్యసౌలభ్యసౌశీల్యములు-ఇత్యాదు లాకసుగాయలు పండిన పంటలు.

ఇట్టి పంటను మనకు కుప్పపోసి అందిచ్చిన రసకృషీవలులలో పెద్దకాపు క్షేత్రయ్య. ఇంతే కాదు, దీనిని ఇంతకన్న పెద్దపంట-భగవద్భక్తి — సిద్ధించు సాధనముగా చేసికొని చూపినవాఁడు. కాఁబట్టియే ఇతని పదములలో సామాన్యముగా ఎందును,

మోహన—ఆది

ప. ఇంతిచక్కదన మింతంత యనుచు - ఎన్నదరము గాదురా.

అ. మంతు కెక్కు శ్రీశిరగిరిని వెలసిన - మాత్రుభూతేశ నుగుణనివేశ.

చ. అతిశపలుఁపరుస వజ్రపుబంతి- అల తొలకరి మెఱుపు మేనికాంతి,

రతిరహస్యములు తెలిసిన పొలంతి-రమణుల మేల్బంతి శ్రుతిగూడినయెడ కిన్నెరతంతి...

(సం. సం. ప్ర. ౨ భాగము)

ఇట్టి వట్టి అంగసౌందర్యవర్ణనము కొనరాదు. పైపాటలోనిది వచ్చిబొమ్మ. తలఁపునకు చాలునేమో కాని వలపునకు చాలదు; చాలఁగూడదు. పండిన స్త్రీ వ్యక్తి యితని దృష్టిలో నెట్టిది?—

శంకరాభరణము—చాపు

ప. ఇంతమోహ మేమిరా, ఇందరికంటె, ఇంతి చక్కనిదేమిరా!

అ. సుంతసేపు దాని జూడకుండలేవు; అంతరంగము దెలుప వదియేల? మువ్వగోపాల!

(౧) నీ కెదురుగవచ్చునా? నెనరూరగ — నిండుకౌగిట జేర్చునా?

ఆనమునుపు లిచ్చునా? తన చెలిమికి — అయిన వాడని మెచ్చునా? తమి హెచ్చునా?

ఏకచిత్తమున మీరిద్దరు - ఇంపుసొంపుగ నున్న ముచ్చట

నాకు వినవిన వేడుకయ్యెరా!-ఇపు డానతీరా!

(౨) మోవిపానక మిచ్చునా-కొసరికొసరి - ముద్దులాడ నిచ్చునా?

తావిపువ్వుల దెచ్చునా - తన సొగసుకు - తగిన వాడని మెచ్చునా, మనసిచ్చునా?

దేవరే మగడు కావలెనని - భావజుని పూజ లొనరించిన

ఆవనిత పేరేమి సెలవీరా! సిగ్గేల తేరా!

అశ్లీలము, అన్యాయము, అసహ్యము నైనది వాలెంతరాలితోడి కాముకవ్యాపారము. "మహిష్యాం ప్రసవార్తాయాం మహిషో మదనాతురః" అని యెవఁడో అసహ్యముగా దానిని పరిహసించెను. ఇట్టి సందర్భమునే క్షేత్రయ్య, మన దృష్టిని వేఱొకప్రక్కకు త్రిప్పి, ఎంత యుదాత్తముగా, పవిత్రముగా తీర్చినాఁడో చూడుఁడు:

ఆహిరి—చాపు

ప. వచ్చియొడలిదానరా! నాసామి!

అ. వచ్చియొడలిదాన; పాపడు నెలవాడు; వచ్చి కూడుటకు వేళగాదు,

వచ్చె తాళవోయి వదలను నీపొందు,
మచ్చిక నొయ్యారి! మామువ్వగోపాల!

(౧) మిసమిసలాడేటి-నాసటిసొంపు చూచి, కొసరి పై కొనేవు కొల్లలుగా,

కసరితే నొకవింత గారాబు జేసేవు
రసికుడ! యీవేళ రాఁరాదు పోపోరా!

(౨) పట్టకురా రొమ్ము! పా లంటు చేతుల
ఎట్టు లోర్తును? పరు లేమందురు?
వట్టిపోతే మొర బెట్టును పసిబిడ్డ
అట్టే మనసు బిగబట్టుకో రెణ్ణెల్లు. వచ్చి.

ఇవి పచ్చి యనుకొనువారి అనుభవవివేకములు పచ్చివి. అంతే!

ఐతే "అపక్వబుద్ధులకు, అసంస్కృతులకు దేహమనోవృత్తులను అల్లకల్లోలము చేయుట కివి చాలవా" యని యడుగవచ్చును. నిజమే. కాని దానికి చికిత్స పక్వబుద్ధులుగూడ వీనిని త్యజించుట కాదు. అది బిడ్డలు కసుగాయలు తిందురని పండ్లచెట్లనే కొట్టివేయుటవంటిది. తెలివిగలవారు చిన్నబిడ్డలను నిప్పువెంతకును పోనీయరు; ఇంటిలో నిప్పే లేకుండ చేసికొని ముడితిండి తిని చీకటిబ్రతుకును బ్రతుకరు. అన్నిటివలె బుద్ధికిని పక్వతాసంస్కారము క్రమికపరిణామరూపమే కాని ఆకస్మికము కాదు. అది విద్యావిధాతల ధర్మము, కర్మము. కావున ఈ శృంగారవాఙ్మయమును ఎప్పుడు ఎవరి కెవరు ఎట్లు పరిచితము చేయవలెననుట జీవితములోని పెద్దప్రశ్నలలో నొకటి. ప్రత్యుత్తరముగూడ పెద్దదే.

"తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ"

చేపల వేట

[లినోకట్ చిత్రము]

శ్రీ తేజోమూర్తుల కేశవరావు





# త్రిమూర్తుల సంసారము

శ్రీ శ్రీనివాస సోదరులు - శతావధానులు

౧

కదలదు మొదల దొక్కతె, ఇంక నొకసతి వేయిండ్లపూజారివిధము గలది;
కొడుకు చూచిన ననంగుఁడు, ముజ్జగమ్మును బాధించు, వారింప వలనుపడదు;
తాను పరుండఁగాఁ దగిన పానుపులేదు బస్సు బుస్సని లేచు పాము కాని;
ఒక చెంప నొకవీచి యొకచెంప నొకవీచి యెడపెడఁ గొట్టెడి కడలిమనికి;
వాహనంబగు పెనుగ్రద్ద పాముఁ దినఁగ - సమయమును వేచియుండు, సంసార మిట్టు
చట్టుబండలుగా జగజ్జెట్టివిష్ణు - వకట! దారురూపము నందె నంట! భువిని.

౨

కొడు కెక్కు నెలుకను గుటుకున మ్రింగఁగా బస్సని లేచెడి పాపనగలు;
ఆ పాపనగలపై ననిశంబు కనువేసి కారాడు కొమరుని వాహనంబు;
సతి యెక్కి తిరుగు కేసరి యేనుఁగుమొగంబుపుత్రుఁ జంపఁగ దూకఁబోవు మీఁద;
గంగపై పార్వతి కారాలు మిరియాలు నూరు, తప్పింపంగ దారిలేదు;
తనదు సిగబంతిజాబిల్లి తల్లడిల్లు - నిప్పు గుప్పెడు మూఁడవ నేత్రమునకు;
ఇంటిపోరును వారింప నీశ్వరుండు - నీశ్వరుఁడు గాక విసము గ్రసించె నకట!

3

పచ్చిగడ్డినిగూడ బగ్గున మండించు టక్కరి జగజంత యొక్క కొడుకు;
అంత తామసుఁడు తేఁ డనిపించుకొన్న యోగ్యుఁడు, లింగరూపుఁ డింకొక్క కొడుకు;
తనపీఠమగు తమ్మిఁ గని లొటికలు గొట్టు చదనుకై యరయు వాహనపుహంస;
పలువురినోళ్లలోఁ బడిన యిల్లాలికి కట్టు నేర్పుట చేతఁగాదు తనకు;
అనుదినమ్మును ఘటముల నాని యాని - బడలుటేకాని యంతును వంతు లేదు;
ఇట్టి జీవితభరము వహింపలేక - హారుఁడు తలమొత్త మాఱొడ్డఁడయ్యె నజుఁడు!

---



= మధ్యహిందూయుగమునాఁటి =

# దక్షిణభారతకళావికసనము

● శ్రీ నేలటూరి వెంకటరమణయ్య ●

దక్షిణభారతకళా చరిత్రమున హిందూయుగము శాతవాహనరాజ్యస్థాపనతో నారంభమై, క్రీ. శ. ౧౬-వ శతాబ్దిమధ్య విజయనగర సామ్రాజ్యపతనముతో నంతమందినది. ఈ యుగమును చరిత్ర రచనాసౌలభ్యమునకై మూఁడుఉపయుగములుగా విభజింపవచ్చును: ౧. పూర్వహిందూయుగము శాతవాహనులతో నారంభమై పల్లవులతో ముగియును; ౨. మధ్యయుగము బాదామిచాళుక్యులతో నారంభమయి చోళసామ్రాజ్యవినాశముతోఁ గడచును. ఈవ్యాసమున నీ యుగము శిల్పకళావిపర్యాసముల ననుసరించి చాళుక్యరాష్ట్రకూటయుగ మనియుఁ, జోళయుగ మనియుఁ జెప్పఁబడుచున్నది; 3. ఉత్తరయుగము కల్యాణీచాళుక్యరాజ్యాంతమునఁ బ్రారంభించి విజయనగర సామ్రాజ్యపతనముతోఁ దుదిముట్టును.

## ౧. చాళుక్యరాష్ట్రకూటయుగము

ఈయుగమునఁ గళలును, విద్యలును జక్కఁగ నభివృద్ధినందెను. ప్రథమమునఁ బరిగణింపఁదగినవి శిల్పవిద్యలు. వానియందు ప్రధానమైనది వాస్తునిర్మాణము. దీనితోఁగూడఁ బెరిగినవి ప్రతిమారచనా, చిత్రలేఖనములు. దక్షిణదేశమును చాళుక్యరాష్ట్రకూటవంశజు లగు నరపాలురు పాలించినప్పుడు ఈ కళలన్నియు రాజాదరణమును, జనాదరణమును బాత్రములై మహోన్నతస్థితికి వచ్చెను. యుగారంభదశయందు ప్రాచీనబౌద్ధుల మార్గము నవలంబించి కొండలను మలిచి గుహాలయములను నిర్మించుట యాచారమై యుండెను. ఈగుహాలయములను శిల్పవైచిత్రిని బ్రకటించు గండారప్రతిమలతోడను, నచ్చెరువుగొలుపు చిత్తరువులతోడను నలంకరించుట సర్వసామాన్యము. ఇట్టి గుహాలయములలోఁ బ్రసిద్ధికెక్కినవి బాదామి, భాగు, ఎల్లోర యను స్థలములందుఁ గలవు. గుహాలయములతోఁబాటు ఎల్లోరలో మఱియొక విచిత్రవాస్తు విశేషము గలదు. ఇది జీవశిలను మలిచి నిర్మించిన దేవాలయము. రాష్ట్రకూట వంశజుఁడైన ఇమ్మడికృష్ణ చక్రవర్తి తన యిష్టదైవమగు శివునికొఱకు కొండను

మలిపించి కన్నులపండువౌనట్లొక యాలయమును నిర్మించెను. వాస్తుశాస్త్రవిశారదు లీయద్భుతశివాలయముం గాంచి నేఁటికిని అచ్చెరువందుచున్నారు.

గుహాలయములతోఁ బాటు రాకట్టు గుడులును ప్రాచీనపాశ్చాత్యుల కాలముననే యారంభమాయెను. ఈ రాకట్టుగుళ్ల రచనావిధము ద్రావిడదేశమున వాడుకయం దుండిన పద్ధతికంటె భిన్నమైనది. దక్కనుదేశము నేలిన రాజులును, వారి యేలుబడియం దుండిన ప్రజలును దేవాలయములఁ గట్టఁదలఁచినప్పుడు చాళుక్యుల పద్ధతినే యవలంబించుటచేత నచటి యాలయముల శైలిని చాళుక్య పద్ధతి యని వాస్తుశాస్త్రజ్ఞులు పేర్కొనుచున్నారు. ధార్వాడజిల్లాలోని పట్టడకల్లు, లక్ష్మేశ్వరము నను తావులందు ఈశైలికయందు విరచితములైన ప్రాచీన దేవతాయతనములు అనేకములు నేఁటికిని గానవచ్చుచున్నవి.

చాళుక్యవాస్తురచనా విధానము రానురా నభివృద్ధినంది నూతనగతులఁ బరిణామమందెను. రాష్ట్రకూటుల కాలమునను, వారి తరువాత దక్కను నేలిన కల్యాణి చాళుక్యుల కాలమునను చాళుక్యశైలి మహోన్నతదశకు వచ్చె ననుట యతిశయోక్తి కాదు. వాస్తునిర్మాణముతోఁ గూడ కాసెపనియు నభివృద్ధి నందెను. మన దేవాలయములు మహమ్మదీయుల మసీదులవలె శూన్య ప్రార్థనామందిరములు గావు. మన పూర్వులు సౌందర్య పిపాసులు. శూన్యాగారములు వారికి నచ్చవు. కావున గృహములనుగాని, దేవాలయములను గాని కట్టవలసివచ్చునపుడు వారు సాధ్యమైనంతవఱకు గోడలమీఁదను, స్తంభోపరితలములందును, నడికొప్పులలోని భాగములలోను రాలను జెక్కి చిత్రవిచిత్రములైన పూవులతోను, నానావిధ ప్రతిమలతోను నలంకరించువారు. వాస్తునిర్మాణమునుబోలి కాసెపనియుఁ గ్రమక్రమముగ నభివృద్ధియై బహువిధరూపములను దాల్చి కల్యాణిచాళుక్యుల నాఁడు పరిపూర్ణత వహించెను. ఈయుగమునందలి శిల్పముయొక్క సౌభాగ్యాతిశయమును విశదముగ వివరించి చెప్పుట సులభసాధ్యమైన కార్యము గాదు. గండశిల యప్పటి శిల్పాచార్యుల చేతిసోఁకుడుచేఁ దన సహజకాఠిన్యమును మఱచి బంకమట్టి తెఱఁగునను, మైనముపోల్కిని మెత్తవడి వారి సంకల్పానుసారము అద్భుతజనకములగు నానావిధ లావణ్యరూపములను దాల్చెను. ఇప్పటికిని హైదరాబాదు దేశమున నచ్చటచ్చట నిలిచియుండు చాళుక్య రాష్ట్రకూటయుగమునాఁటి ప్రాచీనదేవాలయము లప్పటి శిల్పుల కళాకౌశలమును, హస్తలాఘవమును, సంగపరిమాణ జ్ఞానమును, సౌందర్యగ్రహణపరాయణతను వేనోళ్లఁ జాటుచున్నవి.

కాసెపనివలె వాస్తునిర్మాణముతోఁ గూడఁ బెరిగిన కళ మఱియొకటి కలదు. అది చిత్రరచన. మన పూర్వుల సౌందర్య పిపాస కిది యొక ప్రబల నిదర్శనము. తాము నివసించు మందిరములనుగాని, యర్చించు దేవతాగృహములనుగాని శక్త్యనుసారమలంకరించుట ప్రాచీనుల యాచారమని పైనఁ జెప్పియున్నాను. దీని ననుసరించి రాజులు, దొరలు మొదలగువారు ధనము వెచ్చపెట్టి కట్టించిన సౌధములను, దేవతాయతనములను చిత్రవర్ణములతోఁ బ్రతిమలు వ్రాయించి యలంకరించుకొనెడివారు. చాళుక్యరాష్ట్రకూటయుగమునఁ గట్టఁబడిన సౌధములును, గృహములును నప్పటి గ్రంథములయందు విపులముగ వర్ణింపఁబడియున్నను అవి నేఁ డెచటను గానరావు. కాని గుహాలయములును, రాకట్టుగుడులును పెక్కుతావులఁ గలవని పైనఁ జెప్పఁబడియున్నది. గుహాలయములయందుఁ గొన్నియెడల—ముఖ్యముగ నజంత, బాదామి, బాగు, ఎల్లోరలందు—చాళుక్యరాష్ట్రకూటయుగమునాఁటి చిత్రములు కలవు, ఇవి భారతీయచిత్రకళాచరిత్రయం దత్యున్నత స్థానము నలకరించుచున్నవి. ఇట్టి జీవకళ భరతఖండముననే కాక యన్యదేశములందుపయితము గానరాదు. ఈయుగమున వెలసిన చిత్రకారుల నేర్పు కొనియాడఁదగినది. భావప్రపంచమునఁ బొడమిన లావణ్యసర్వస్వమును వర్ణసమ్మేళనము గావించి స్వప్రతిభాజలములఁ గరఁచి తూలికలమూలమున శిలాతలమున కెక్కించి సృష్టికిఁ బ్రతిసృష్టి యొనర్చిరి. అజంతాదిగుహాలయములఁ బ్రవేశించిన వెంటనే చిత్రముల సౌభాగ్యవిశేషము చొక్కుమందై బహిఃప్రపంచము నంతటిని మనఃఫలకమునఁ దోఁచనీయక కప్పి పుచ్చి విస్మృతి గలిగించి యపరిచితమైన నూతనప్రపంచమును

డాక్టరు కే. విష్ణువర్ధనరావు, ఏ. ఆర్. ఏ. సి. వారి

అయోడైజ్డ్

# సార్సామృతము

(రిజిష్టర్డు)

## రక్తమును శుభ్రపరచు ఔషధరాజము

ఈసార్సామృతము చెడురక్తమును శుభ్రపరచి పరిశుద్ధముగ చేయుటలో అమోఘమైనది. అతిమేహము వలనను,రక్తము చెడుటవలననుకలుగు మేహవ్రణములు, నెత్తురుగడ్డలు, రాచకురుపులు, తీట, గజ్జి, దురద, తామర, కుష్ఠవ్యాధులను, అరికాళ్లు అరిచేతులు మంటలు, గనేరియా, కొరుకుడు (సవామేహము), ఆమవాతము, వాతరక్తము, విచర్చికా మొదలగు వ్యాధులను రూఢిగ పోగొట్టును. దీని అద్భుతగుణములకు అనేక యోగ్యతా పత్రములు పొందబడినది.

8 ఔన్సుల సీసా రు 1-8, 4 ఔన్సుల సీసా అ. 14.

# రేచన (రిజిష్టర్డు)

## ప్రతియింట ఉండదగిన ఔషధము

(తినుటకు రుచిగా నుండును)

ఈ లేహ్యము రాత్రి పరుండబోవు నప్పుడు కుంకుడుగింజంత పెద్దవారికిని, పిల్లలకు శనగింజంతమాత్రను పుచ్చుకొని మంచినీళ్లు త్రాగవలెను. ఉదయమునకు సుఖరేచన మగును. ఒకటి రెండు విరేచనములు ఎక్కువ కావలయునేని మోతాదు రెట్టింపుచేసి వాడవలెను. ఇందు నేపాళములుకలిసియుండలేదు. త్రిప్పుట కాని,వాంతులుకాని యుండవు,పథ్యములేదు. వివరములుకల కాగితము సీసాతో కలదు.

సీసా 1 కి 0-9-0, మోతాదు 0-1-0

సార్సామృతం డిపో, గవర్నరుపేట, బెజవాడ.

---

## బి. రెడ్డి అండ్ కంపెనీ, (రిజిస్టర్డు)

ప్రొప్రైటరు: జి.వి. రెడ్డి. గోపాలపురం, తూ. గో.

### "సర్వకుష్ఠులకు గ్యారంటీ చికిత్స"

మా "అతివిచిత్ర కుష్ఠునివారిణి" అష్టాదశకుష్ఠు,బొల్లి సర్వవిధ చర్మవ్యాధులను నిర్మూలించుటలో వజ్రాయుధమువంటిది. 2 నెలలకుసరిపడు 6 రకముల మందులసెట్టు వెల రు 25/-

### "సర్వసుఖరోగ నివారణి"

ఎంతపురాతనమై జీర్ణించి,ఎట్టి అపాయస్థితియందున్న సెగ సవాయిరోగములకైనను 3 పూటలకే అద్భుతగుణము. పథ్యములేదు. వెలస్వల్పము. 40 రోజులమందు రు. 4 లు.

### "భాస్కరామృత లేహ్యము"

నూరుమూలికలచే తయారుకాబడినది. శుక్లనష్టము, నిస్సత్తువ, అజీర్తి, నరములులాగుట, మొదలగు దుర్గుణములఖండించి రక్తము, వీర్యము వృద్ధిజేసి సింహబలునిగాజేయును. 40 రో. రు. 5/-

డాంబిక ప్రకటనలకు,
నకలుమందులకు మోసపోకుడు.

పో॥ ఖ॥ ప్రత్యేకము. క్యాటలాగు, సలహా ఉచితం.

---

# ది భారత లక్ష్మీ బ్యాంకు లిమిటెడ్.

(స్థాపితము 1929)

హెడ్డాఫీసు : మచిలీపట్టణము.

బ్రాంచి : నరసాపురం.

—: సీజన్ డిపాజిట్లు :—

**3 నుండి 6 మా॥ వరకు 100 సం॥ కి 3½%**

**6 నుండి 9 మా॥ వరకు 100 సం॥ కి 3¾%**

వడ్డీరేట్లతో తీసుకొనుచున్నాము.

అన్నివిధములయిన బ్యాంకింగు వ్యాపారములు చేయబడును.

బంగారము, గవర్నమెంటు పత్రములు, ఇన్సూరెన్సు పాలసీలు, ధాన్యం వగైరాలమీద అప్పులు యివ్వబడును.

మచిలీపట్టణము
21-2-42.

భో. వెంకటరత్నం,
కార్యదర్శి.

ప్రదర్శించుచున్నది. చిత్రకారుని లీలావిలాసముచే కూడ కొన్ని మాయాప్రపంచ మది. అందు లావణ్యేతర స్వరూపములకుఁ దావులేదు; ప్రతిచిత్రమును, ప్రతిరేఖయు చిత్రకారుని యపూర్వకళాకౌశలమును ప్రకటించును. దీని సౌష్ఠవమును పూర్వపాశ్చాత్యకళావేత్తలెల్లరును మెచ్చుకొని కరము శ్లాఘించి యున్నారు.

## ౨. చోళయుగము

చాళుక్యరాష్ట్రకూటరాజన్యులఁబోలి చోళదేశాధిపతులును కళలఁ బోషించిరి. ద్రావిడుల వాస్తునిర్మాణ సామర్థ్యము జగద్విదితము. కావున చిత్రకళకంటె వాస్తునిర్మాణ మీయుగమున వన్నెకెక్కెను. చోళయుగపుకళ చాళుక్యరాష్ట్రకూటయుగకళ కించుమించు సమకాలీనమయ్యు భేదించుచున్నది. ఈభేదము వాస్తునిర్మాణముననే యధికముగ వ్యక్తమగుచున్నది.

చోళచక్రవర్తులును, వారి సామంతులును బలువిధములగు కట్టడములను గట్టించినట్లు తెలియవచ్చుచున్నది. ఆనకట్టలు, వంతెనలు, ప్రాసాదములు మొదలగునవి యెన్నియో యప్పటి శాసనములందుఁ బేర్కొనఁబడియున్నవి. కాని వీనియందెవ్వియు నేఁడు గానరావు. చోళయుగము నాఁటి కట్టడములలో నింకను మిగిలియున్నవి దేవాలయములు. చోళుల వాస్తునిర్మాణకౌశల మంతయు వీనిమూలముననే ప్రకటితమగుచున్నది. మతవిజృంభణమువలన దేవాలయ నిర్మాణమున కట్టివిశేషము హెచ్చెను. చోళచక్రవర్తులను బోలి దేవాలయ నిర్మాణము నంత భారాళముగ సాగించిన రాజవంశము మఱియొకదానిని పేర్కొనుట సులభసాధ్యము గాదు. రాతికట్టుదేవాలయములను గట్టునాచారము పల్లవులనాఁడే ప్రారంభమాయెను. రచనావిధానమున విశేషభేదము గానరాకున్నను జోళదేవాలయములను బల్లవదేవాలయములనుండి వేర్పఱచుట కష్టము గాదు. ఆకారమునను, గట్టుపనితనపు నేర్పునను వీనికి వానికిని హస్తిమశకాంతరము భేదము గలదు. పరిమాణమునను, వైపుల్యమునను జోళదేవాలయములతో సరితూఁగఁగలవి మఱి యెచ్చటను గానరావు.

చోళయుగ దేవాలయ నిర్మాణమున నవస్థాద్వయము గానవచ్చుచున్నది. ప్రారంభదశయందుఁ గట్టఁబడిన యాలయములందు గర్భగుడిమీఁది విమానము నత్యున్నతముగఁ బెంచి కట్టుట సదాచారము. తంజాపురమునందలి బృహదీశ్వరాలయమును, గంగైకొండ చోళపురమునందలి గంగైకొండ చోళేశ్వరాలయమును దీనికిఁ దార్కాణ. వీనికిఁ బ్రాకారముండినను గోపురములు లేవు. ఇట్టి దేవాలయ ప్రాకారద్వారములపైఁ గొన్ని తావుల నిప్పుడు గానవచ్చు గోపురము లర్వాచీనములు. ఉత్తరదశయందుఁ గట్టఁబడిన దేవాలయములయొక్క బాహుళ్య మతిశయించెను. కట్టువిధమునందుఁగూడ కొంత మార్పుగపడుచున్నది. పూర్వదశయందలి దేవాలయములను బోలి గర్భగృహముమీఁది విమానము మహోన్నతముగాక చిన్నదిగఁ బరిణామమునందెను. ప్రాకారములు రాను రాను పెరిగి వైపుల్యము నంది చతుర్దిశలయందును నాలుగు గోపురములను గూడి రూపందెను. ఈ ప్రాకారము చరిత్రయు వినఁదగినదే. పల్లవయుగమున దేవాలయముచుట్టును చిన్నచిన్న గుళ్లు ఒకదాని కొనను కొని మఱియొకటిగఁ గట్టఁబడి ప్రాకార సదృశమై కానవచ్చుచుండెడివి. కాంచీపురిలోని కైలాసనాథుని దేవాలయముచుట్టు నందు ప్రాకార మిట్టిదియే. చోళయుగమున నీపద్ధతి మార్పునందెను. ప్రాకారము ఉత్తమమగుగోడ యాయెను; ప్రాకారాంతరమున దేవాలయముచుట్టు చిన్నగుళ్ల నేకములు పొడసూపెను. కులోత్తుంగచక్రవర్తి కాలమునుండియుఁ బ్రాకారద్వారములపై గోపురములఁ గట్టునాచారము ప్రారంభమాయెను. ఈ ప్రాకారముల సంఖ్యయు, గోపురముల యున్నతియు రానురా నభివృద్ధినంది దేవాలయము బహుప్రాకారగోపురపరివృతమై యొక నగరము విస్తరించెను. కొన్ని తావుల దేవాలయముల కేడు ప్రాకారములును, గోపురముల కేడెనిమిది యంతస్తులును గలవు. తిరువాలూరువాల్మీకేశ్వరాలయ మీ తరగతి దేవాలయములలో సుప్రసిద్ధమైనది.

**ప్రతిమారచన, చిత్రలేఖనము:—** దేవాలయ నిర్మాణముతోఁగూడ ప్రతిమారచనయు, చిత్రలేఖన

# మధ్యయుగ ఆంధ్రదేశము-
# సంగీతనాట్యకళాభివృద్ధి

= శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ =

క్రీస్తుశకము పదివందలు మొదలు పదునైదువందలవరకు మధ్యయుగ మని సంకేత ముంచుకొన్నచో ఈకాలమున ఆంధ్రదేశమున సంగీత, నాట్యకళలు రెండును అమితముగా వృద్ధిచెందిన వని చెప్పుటకు సందియ మేమియు లేదు. మధ్యయుగ ఆరంభకాలమున దేవాలయమునకు క్రొత్తప్రసిద్ధియు, ప్రాముఖ్యమును అమరినవి. పరివారదేవతలు హెచ్చినారు. పూజోత్సవాదికము లతిశయించినవి. దేవాలయమున పరివారదేవతల కాగారము లావశ్యకమై దేవాలయము విస్తృతి చెందినది. పూజోత్సవాదికములు ఎక్కువగుటచేత మండపము లధికమయినవి. దేవగృహమున నాట్యమండపమునకుకూడ ప్రధానత యేర్పడినది. ప్రసిద్ధక్షేత్రములయందలి దేవాలయములలో నాట్యకూటము, లేక నాట్యమండపము ప్రధానాంగ మయినది. విష్ణ్వాలయములందును, శివాలయములందును పౌరాణికులకు మాత్రమే కాక విష్ణుభాగవతులకును, శివభాగవతులకును వృత్తు లేర్పడినవి. దేవాలయనాట్యమండపము లెప్పుడును శివ, కేశవలీలలను, విజయాంకములను సంకీర్తనము చేయునట్టియు, అభినయించునట్టియు గాయన గాయనీమణులతో, వివిధ జంత్రవాదనకోవిదు లైన కళాకుశలులతో భాసిల్లుచుండెడివి. శ్రీశైలమహాపుణ్యక్షేత్రమునందు ఇట్టి నాట్యకూటములు అరువది నాలుగు కలవని ప్రసిద్ధి. ఈరీతిని దేవాలయము మధ్యయుగారంభమున సంగీతనాట్యకళలకు ఆశ్రయమిచ్చి వానిని పెంపొందించినది. నాడు మొదలు సంగీత, నాట్యములు ప్రజాదరణమును, రాజాదరణమును పొంది చక్కగా వర్ధిల్లినవి. అంతకుపూర్వము రాజాదరణము నేకాని యెఱుగని నాట్యకళ ఇప్పుడు ప్రజలచేతి ఎత్తుబిడ్డయి ప్రజానురాగమును చూరగొన్నది. శుభోత్సవావసరములందును, వేడుకలు వినోదములందును నాట్య మభిమానమయిన విధికృత్య



మైనది. ఆ కాలమునాటి ప్రసిద్ధక్షేత్రములయందలి దేవాలయశాసనములను బరిశీలించినచో ఆవజకాండ్రు, కరడకాండ్రు, మొఖరులు, వంశకారులు ఎందరో తెలియవత్తురు. ఆనాటి వాద్యవిశేషములు కొన్ని మనకు దెలియనివి యుండుట. అటుండ వాని పేరులుకూడ సరిగా దెలియనివి ఎన్నియో కలవు. కరడవాద్యము నాకిప్పటికిని దెలియదు. మొఖరు లన్నది 'ముఖర'మను వాదనమున కుశలులయిన వారికి పేరని తోచును. "ముఖరీద్వయసంయుక్తా అష్టౌ మర్దలవాదకాః......కరడావాదనాద్యేషు ..." అని మల్కాపురము శాసనము. "మూర్ఖునైనఁ బట్టి ముఖరునిఁ జేయుదు, ననిన భంగి సతి మృదంగ మంది ..." అని సింహాసన ద్వాత్రింశిక. మద్దెల వాయించువారు మద్దెలకారు. ఆవజము వాయించువాడు ఆవజీడు. వంశము — ఇది వేణు వనుకొందును — గానము చేయువారు వంశకారు. వంశమునకు వంశధ్వని యనియు పేరు కనబడుచున్నది. 'వాసెగ్రోలు' అన్నదికూడ ఈ 'వంశ' మేమో.

"గళరవంబు లమర గమకంబుతోఁ బేర్చ
రాగమున మనంబు రంజిలంగఁ
బ్రియుఁడువోలె నధరబింబంబు చుంబించు
వాసెగ్రోలు వట్టె వనిత యొర్తు"

అని కొరవి గోపరాజు వర్ణన. ఆ నాటి వాద్యవిశేషములే కాదు, విజయనగరమును తుళువవంశమువారు పాలించునాటి జంత్రవాద్యవిశేషములు కూడ పదునాఱవశతాబ్దినాటివి మనకు దెలియనివెన్నియో యున్నవి. తాడిపత్రి (అనంతపురంజిల్లా) లోని చింతలరాయని దేవళమున నాటికి వాడుకలో నుండిన జంత్రవాద్యముల శిల్పప్రతిమలు ఎన్నియో కలవు. ఈ దేవాలయము క్రీస్తుశకము పదునాఱవశతాబ్దిని నిర్మితమయినది. విజయనగర శిల్పకళాసంప్రదాయ వైభవములకు మచ్చుతునక యిది. శిల్పకళానిష్ణాతులును, తదభిమానులు నైనవారి పొగడ్తలను గాంచినది. ఇందు చిత్రితమయిన జంత్రవాద్యవిశేషములలో మనకు దెలియనివియు, మనము చూడనివియు నెన్నియో కలవు. పదునాఱవ శతాబ్దినాటివే మనకు దెలియనివున్నప్పుడు అంతకు పూర్వపు జంత్రవాద్యములు మనకు దెలియని వుండుటలో ఆశ్చర్యము లేదు. మద్దెలలో వీరమద్దెల యన్నది ఒక భేదము. మద్దెలకాండ్రకు, వీరమద్దెలకాండ్రకుకూడ కొన్ని కొన్ని దేవాలయములలో వృత్తు లున్నవి. ఒక్క దేవాలయములందు జరుగు అర్చనావసరములందే కాక సంపన్నగృహస్థుల యిండ్లలోను, భూధవుల లోగిళ్లలోను జరుగు ఇష్టదేవతా పూజల సందర్భమునగూడ ఆటపాటలు జరగుచుండెడివి. రాజమహేంద్రవరమును బరిపాలించిన పంటవంశజులయిన రెడ్డిరాజులు పూజచేయునప్పటి వైభవమును శ్రీనాథమహాకవి యిట్లభివర్ణించియున్నాడు :

"వల్లకి చక్కి కాహళము
వంశము ఢక్క హుడుక్క ఝర్ఝరుల్
ఝల్లరి యాదిగాఁగలుగు
శబ్దపరంపర తాళశబ్దమై
యుల్లసిలం బ్రబంధముల
కొప్పుగ నాడుదు రగ్రవేదిపైఁ
బల్లవపాణు లీశ్వరునిఁ
బంటుమహీపుల పూజసేయఁగన్"

ఈ పద్యమునందలి వల్లకి, చక్కి, కాహళము, వంశము, ఢక్క, హుడుక్క, ఝర్ఝరులు, ఝల్లరి మొదలైన వాద్యవిశేష

ములలో అనేకములు శాసనములయందును పేర్కొనబడినవి. 'జగఝంప'యన్నది ఎట్టి వాద్యవిశేషమో తెలియదుకాని యదికూడ క్రీస్తుశకము పన్నెండు, పదుమూడు శతాబ్దులలో వాడుకలో నుండినదే. ఇక జంత్రవాద్యములలో తరుచుగ శాసనములవలన దెలియవచ్చునది వీణ. ఈవీణలలో పెక్కురకముల వీణలను పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్యచరిత్రమున పర్వతప్రకరణమున పేర్కొనినాడు. అట్టివానిలో బ్రహ్మవీణ, నారంగవీణ, కూర్మవీణ, కాశ్యపవీణ, సరస్వతీవీణ యనునవి కొన్ని. వీనిలో 'బ్రాహ్మవీణ — బ్రహ్మవీణ'యే శాసనములవలన ఎక్కువగా దెలియవచ్చునది. కస్తూరివీణ, కనకవీణ యను రకములు వీణలలో మఱికొన్ని కలవని గ్రంథముల ననుసరించి తెలియనగును. కస్తూరివీణ నల్లగా నుండును. కొన్నికొన్ని దేవాలయములలో 'బ్రహ్మవీణాసన్వస్త్యయనము'నకు బ్రాహ్మణులకు వృత్తులు కల్పింపబడినవి. 'వీణతిమ్మయ', 'వీణలక్కన' అని వీణావాదనమున కడు ప్రవీణతను గాంచుటచేత కావచ్చును వీణ యన్నది బిరుదనామముగ ధరించినవారును కొందఱు మధ్యయుగమునందలి తెలుగుదేశశాసనముల ననుసరించి తెలియవచ్చుచున్నారు. ఈ విషయముల నన్నిటిని బట్టి చూడగా మధ్యయుగమున తెలుగుదేశమున సంగీత, నాట్యకళలు ప్రబలినట్లు చెప్పుటకు సందియములేదు. చిన్న పరిమిత రాజ్యమును పరిపాలించిన మండలేశ్వరులు, సేనాధిపతులుకూడ సంగీత, నాట్యకళల నాదరించుటయేకాక స్వయముగ దాము సంగీత, నాట్యకళల నభ్యసించి వానియందు గొప్ప ప్రజ్ఞను సంపాదించి పేరొందినారు.

క్రీస్తుశకము ౧౩౬౮ ప్రాంతమున జంతుర్నాటిరాజ్యమును పాలించుచుండిన సురభివంశజుడయిన ప్రతాపవీరగంగరాజు సంగీతజ్ఞుడని

"లక్ష్మీవాన్ వీరగంగ క్షితిపతితిలకః
సర్వలోకాభిరామః
ప్రఖ్యాతోరుప్రతాప స్సురభికులపయో
రాశిరాకాసుధాంశుః,
ఆశాధీశకృపాణాం రుచికలితయశ
శ్చంద్రిక స్సత్కళావాన్
సంగీతజ్ఞో వదాన్య స్సమవతు ధరణీం
యావదాచంద్రతారమ్"

అను శ్లోకమువలన విదితమగుచున్నది. ఇట్లే క్రీస్తుశకము ౧౩౬౭ నాటి పొత్తిపుటాల మంచిరాజుంగారి కుమారుడు కృష్ణభూపతి 'సంగీతాంభోధిచంద్రు'డట — "ప్రాదాత్ కృష్ణదేవ స్సంగీతాంభోధిచంద్ర స్సకళగుణనిధి ర్వేదశాస్త్రప్రవీణః" అని సింహాచలము శాసనము. జంతుర్నాటిరాజ్య మిప్పటివిశాఖపట్టణమండలములోనిది. ఎలమంచి (ఇప్పటి యలమంచిలి— విశాఖపట్టణముజిల్లా) రాజధానిగా తత్ప్రాంతప్రదేశము నేలిన చాళుక్యవంశజుడయిన విశ్వేశ్వరభూపతి — శాబ్దాలంకార చూడామణికృతిపతి — 'సంగీత సాహిత్య సరణి' నేర్చినవాడట. ఈ యుదాహరణములు మధ్యయుగమున ఆంధ్రదేశమున సంగీతకళ వృద్ధినందిన దని చెప్పుటకు జాలును. సంగీతజ్ఞుడును, సంగీతకళాభిమానియు నైన భూవరు డున్నచో అతని ప్రాపును బడయుటకును, అతని మెప్పును పొందుటకును ఎందఱు సంగీతకళాభిజ్ఞులు బయలుదేఱుదురో వేర చెప్పనక్కర లేదు. రాజపోషణముకదా సకలకళాభివృద్ధికి

ప్రాచీనకాలమున మూలకారణము! క్రీస్తు శకము పదునాలుగవశతాబ్దిని కోరుకొండ (తూర్పు గోదావరిజిల్లా) రాజధానిగా గొత్త మ్యాప్రాంతప్రదేశమును పాలించిన ముమ్మడి నాయకుని సోదరుడు శింగయనాయకుడు గొప్ప సంగీతకళాపోషకుడు. ఇత డెల్లప్పుడును వీణావాదనమునను, నాట్యగానము లందును నేర్పరులయిన కాంతాజనముతో కాలక్షేపము చేయువా డని

"వీణావాదనకోవిదేన విలస
ల్లాస్యప్రశస్యశ్రియా
సారస్యాస్పదగానమానవిధినా
సౌజన్యమానాత్మనా,
నిత్యైశ్వర్యవికాసినా నిరుపమా
కారేణ కాంతాజనే
నాయం కూనయశింగభూపతిలకః
క్రీడ న్సదా మోదతే."

అను శ్లోకము ననుసరించి తెలియుచున్నది. విజయనగరమును బరిపాలించిన రెండవ హరిహరరాయల కుమారుడు దేవరాయభూపతి గొప్ప సంగీతకళాభిజ్ఞుడట. మాండలికవంశము లంతరించినపిదప, కాకతీయసామ్రాజ్యము పతనమైన వెనుక సంగీతకళాలక్ష్మి తన కాశ్రయమిచ్చు నాథుని వెదకికొనుచు కొంతకాలము కొండవీడు, రాజమహేంద్రవరముల నిలిచి, యటుపిదప కతిపయప్రయాణముల విద్యానగరమును (విజయనగరమును) జేరుకొనెను. విజయనగరము సంగీతశ్రీని మంచిముత్యాల చవికెలో కల్యాణవేదిక నధివసింపజేసి కర్పూరరత్న నీరాజనము లిచ్చి గౌరవించి మార్గాయాసఖేదము నపనయింప వీవోపులిడినది.

పాల్కురికి సోమనాథకవి రచియించిన పండితారాధ్యచరిత్రము ననుసరించి క్రీస్తు శకము పదుమూడవశతాబ్దినాటికి సంగీతశాస్త్రము పొందిన యభివృద్ధి కొంత తెలియగలదు. సోమనాథుడు ఆగ్రంథమున పర్వత ప్రకరణమున తాళములు, రాగములు, గతులు, ఆలాపనములు మొదలైనవి వివరించియున్నాడు. వీని ననుసరించి సోమనాథునినాటికి సంగీతకళ యెట్టి యభివృద్ధియందుండెనో, అప్పటికే శాస్త్ర మెంత విస్తరిల్లినదో తెలియనగును. శ్రీనాథకవిసార్వభౌముడు హిందోళ, ఘంటారవ, శంకరాభరణ రాగములను తన గ్రంథముల నుటంకించినాడు. హిందోళము అచ్చరలకు బ్రియమైన రాగమట. శ్రీనాథుడు తన భీమేశ్వరపురాణమున "హిందోళంబునఁ బాడి రచ్చరలు భీమేశుం ద్రిలోకాధిపుల్' అనియు, హరవిలాసమున "అచ్చరలు పాడు హిందోళ మాలకించి యిందువక్త్రాళి ప్రసంఖ్యాన మెడలఁడమ్యో" అనియు వ్రాసియున్నాడు. ఈ రాగము అచ్చరలకు బ్రియమయిన దగునో, కాదో కాని శ్రీనాథుని కభిమానరాగముగా గనిపించుచున్నది.

**నాట్యకళ :**

సంగీతకళతో సరిసమానముగా మధ్యయుగమున వర్ధిల్లినది నాట్యకళ. ఈనాట్యకళను విశిష్టముగ నభ్యసించుచువచ్చినవారు గుడిసానులును, వేశ్యలును. గుడిసానులను 'గుడిచేటు'లనియు వ్యవహరించువారు. వేశ్యలువేసిన శాసనములుకూడ గొన్నియున్నవి. బెజవాడ మల్లేశ్వరస్వామియాలయమునందలి స్తంభములమీద 'పినకూనుతలాబత్తుని కూతలు శ్రీరామాయి' మాచద్దేవి చెక్కించిన శాసనములు కలవు. వీరు 'పృథివిం గల గోత్రంవారి కెల్లాను' పుణ్యముగా చేసిన

దానముల వివర మిందు గలదు. ఈ శాసన స్తంభములమీద 'పినకూనుతలాబత్తుడు' అను 'పినకూనబత్తుడు' మద్దెల వాయించుచున్నట్లు, మాచల్దేవి నాట్యము చేయుచున్నట్లును చెక్కిన రేఖాచిత్రము లున్నవి. మాచల్దేవి నాట్యభంగిమ చాల మనోహరముగనున్నది. ఆ భంగిమలోని భావరసోద్రేకమునకు దగినట్లు పినకూనాబత్తుని మృదంగవాద్యభంగిమ కలదు. గుడిసేటులు దేవునిపరిచర్యనిమిత్తము గుడికి కల్పిత లైనవారు. వీరిలో చాలమంది వాద్యవాద్యములందును, గాత్రపాటయందును సమముగను నేర్పరులు; మరికొందరు నట్టువులు.

ఈ నాట్యకళకూడ సంగీతకళవలెనే పదునొకండవశతాబ్దినాటికే చాల వృద్ధినందినది. దత్తిల, కోహళ, భరత, మతంగ, నందికేశ్వరాదులు నాట్యకళను పెంపొందించిన మహాశయులు.

నాట్యము ప్రధానముగ లాస్యము, తాండవము అని ద్వివిధము. 'తాండవవిద్యాప్రధానగురుడు' శివుడు; 'సుకుమార లాస్యజనని' పార్వతి. శివుడు 'డమరుధ్వానాదముల సముద్రముగలంగ ఆరభటవృత్తి దాండవం బవధరించె' నట 'ప్రళయవేళ.' కవిత్వమునం దున్నట్లే నాట్యమునను దేశి, మార్గభేదములు గలవు. తాండవము గంభీర పౌరుష ప్రతాపాటోపవిడంబనాసముద్ధతము. లాస్యము శ్రుతి, నయనపర్వములైన గాన గమక వర్తనగతి విభేదములతో, చారికా కరణాంగహారభంగిమములతో సుకుమార మనోహరము. లాస్యమును పదునైదవ శతాబ్ది ప్రథమార్థమునం దుండిన కొరవి గోపరాజు ఇట్లు వర్ణించియున్నాడు:

"తనువున గీతాలంబన
మున జేతుల నర్థవ్యాషితమును నేత్రయుగం
బున భావముఁ బదములఁ దా
ళనిర్ణయమ్మును మెఱయఁగ లాస్యము నెఱపెన్"

విన్నకోటపెద్దనకూడ నాట్యము నిట్లు వర్ణించినాడు :

"కనుఁగొన నొప్పు కంఠమున
గానముఁ, బాణుల మంజులార్థక
ల్పనమును, దృగ్విశేషమున
భావములుం, జరణక్రమంబులన్
దనరు లయ ప్రపూర్ణమగు
తాళముఁ గాంగఁ బాత్ర యొత్తు రం
జనముగ నాడె సింపువెద
చల్లుచు విశ్వనృపాలు సన్నిధిన్."

తాళలయాశ్రిత మయినది నృత్తము; రాగ, తాళ లయాత్మకము నృత్యము. చతుర్విధాభినయములతో, సాత్త్వికాంగిక పూర్వకసరణులతో, శిరోభావ, చక్షుర్భావ చాలనములతో, చౌషష్టిహస్తములతో రసానందోత్పాదకమై తనరునది నాట్యము.

నృత్యములలో పెక్కురకములు కలవు. వానిలో కుండలి, దండలాసకము, ప్రేరణి, ప్రేంఖణము, సింధు, కందుకము, హల్లీసకము అనునవి కొన్ని.

కుండలీనృత్యము నిట్లు ప్రశంసించుచున్నాడు సకలవిద్యాసనాథుడయిన శ్రీనాథకవివరేణ్యుడు :

"కుండలీనృత్యంబుఁ గోహలాద్యాచార్య
మతభేదముల దేసి, మార్గసరణి
చారికా కరణాంగహార రేచకముల
భ్రమరికావళుల వర్తనగతులను
నాడి మెప్పించు నెట్టిచోద్యంబొ..."

కుండలీనృత్యమునకే గొండ్లి యనిపేరు.

దండలాసకము కోలాటము. విజయనగరాధిపతులు కట్టించిన దేవాలయములలో అధిష్ఠానములందు చిత్రవిచిత్రగతులతో వివిధరీతుల కోలాటము వేయుచున్న స్త్రీ చిత్రములు చిత్రితమయినవి. ఇట్టి చిత్రపరంపరను తాడిపత్రి దేవాలయమునను గాంచవచ్చును.

ప్రేరణివికృతి పేరణి. దీనికి పేరడి యనియు వ్యవహారము. ఈ పేరణమునకు సరియైన లయయుద్ధి జంపెతాళము కాబోలు. శ్రీనాథుడు —

"చాముండి యొనరించు జంపెతాళమునకు
భృంగీశ్వరుం డాడెఁ బేరణంబు"

అని వచియించియున్నాడు. పేరణినృత్యమునకు భృంగీశ్వరుడు పెట్టినది పేరు కాబోలు.

"అంగనాజాతికి నానందముదవ,
భృంగి ముందరివంక పేరణిచూప"

అని ప్రభులింగలీల.

"భ్రమరముల్ సాళెముల్ బయకముల్ మెరసి,
రమణఁబంచాంసి పేరణి యాడువారు"

అని పాల్కురికి సోమనాథుడు.

హిందీలో 'పేరలి'యను పేర బరగు నృత్యవిశేషము పేరడియే కాదగునని నా యూహ. పేరలి తాండవనృత్యమున నొక భేదమనియు, ఇందు అంగవిక్షేప మధికమనియు, అభినయము కొద్దియనియు, ఇది 'దేసి' యనికూడ చెప్పబడుచున్నదనియు హిందీశబ్దకోశము.

ప్రేంఖణము రూపాంతరము పెక్కణ మనికూడ చెప్పుదురు. ఇది యభినయముతోడి నృత్యవిశేషమే కాక అష్టాదశ ఉపరూపకములలో నొకటి. ఏకాంకరూపకము. దీనిని సాహిత్యదర్పణకారు డిట్లు వివరించుచున్నాడు :

"గర్భావమర్శ రహితం ప్రేంఖణం హీననాయకమ్
అసూత్రధార మేకాంక మవిష్కంభ ప్రవేశకమ్
నియుద్ధసంఫేటయుతం సర్వవృత్తి సమాశ్రితమ్
నేపథ్యే గీయతే నాందీ తథా తత్ర ప్రరోచనా."

ఈ రూపకమున సూత్రధారు డుండడు; విష్కంభములు, ప్రవేశకములు ఉండవు; ఇందలి నాయకుడు హీనజాతినాయకుడు. ఇతివృత్తము వీరరసప్రధానము. నాందీ, ప్రరోచనములు నేపథ్యముననే జరుగును. ఒక్కటే అంకము రూపకమంతయు గలిపి.

సింధునృత్యవిశేషము 'దేశి' చిందు అని నాభావన. చిందునే సంస్కరింపగా సింధురూపము నొందినది కావచ్చును.

కందుక మన్నది బంతియాడుచున్నట్లభినయించు నృత్యవిశేషము. వినుకొండ వల్లభరాయుడు తన క్రీడాభిరామమున బాలాజనుల కందుకక్రీడ నిట్లభివర్ణించినాడు :

"పంచారించిన చేతచన్నులయియుం
బ్రాలంబముల్ ప్రాలఁగాఁ
గాంచీ నూపుర కంకణక్వణనముల్
గర్జింప బాలాజనల్
కించిన్న్యంచ దుదంచిత క్షమముగాఁ
గ్రీడించెద రుచ్చాడుమా
చంచత్కాంచన కందుకత్రయముఁ
సవ్యాపసవ్యంబులన్."

హల్లీసకమునకు హల్లీశక మనియు, హల్లీషక మనియుగూడ వ్యవహారము. దీనిని హేమచంద్రు డిట్లు వివరించియున్నాడు ;

# THE
# South India Co-Operative
## INSURANCE SOCIETY LTD.

Head Office:—MADRAS.

ది

# సౌత్ ఇండియా కో-ఆపరేటివ్
## ఇన్సురెన్సు సొసైటీ లిమిటెడ్.

హెడ్డాఫీసు:—మద్రాసు.

పోస్టు బాక్సు నెం. 182.

అధ్యక్షులు: శ్రీ పి. యస్. కుమారస్వామిరాజు, యం. యల్. ఏ.

- అనువైన సాలీనా బోనసుతోను, ధారాళమగు పట్టాషరతులతోను, ఇంకా అనేక ప్రత్యేక సదుపాయములతోను కో-ఆపరేటివ్ ఇన్సురెన్సు మీకు అత్యల్పమగు ప్రీమియము రేట్లలో అత్యధికమగు రక్షణ నివ్వగలదు.
- లాభములన్నియు పట్టాదార్లకే చెందును. ఈ సొసైటీ వారి స్వంతము, వారి కొరకే యున్నది, వారిచేతనే పరిపాలింపబడుచున్నది.
- ప్రభుత్వపు డైరెక్టు కంట్రోలుక్రింద మిక్కిలి పొదుపుగా నిర్వహింపబడుచు బలిష్ఠమయిన ఆర్థికరిజర్వులను నిర్మించియున్నది గాన మిక్కిలి భద్రమయినది.
- మీ రాబడి సాలీనా రు 100 లయినను రు 10,000 లయినను రు 100 ల నుంచి రు 10,000 ల వరకును మీ కనుకూలమగు పట్టా ఇవ్వబడును.

మావద్ద భీమాచేసి మీ భవిష్యత్తును భద్రపరచుకొనుడు:

**ధారాళమగు ఏజన్సీషరతులకై వ్రాయుడు:**

వే. వేంకటాచలం, ఎం. ఏ., బి. ఎల్.,

సెక్రటరి.

[illegible] : 3738.

టెలిగ్రాములు: "Sicois."

"మండలేన తు యన్నృత్యం హల్లీశక మితిస్మృతమ్,
ఏకస్తత్ర తు నేతా స్యాద్గోపస్త్రీణాం హరిర్యథా."

"మండలేనతు యన్నృత్యం స్త్రీణాం హల్లీసకంతు తత్" అని పాఠాంతరము. స్త్రీలు అనేకులు చేరి మండలాకారముగ దిరుగుచు చేయు నృత్యమిది. అభినేత యొకపురుషు డుండును. అతని యాదేశమువిూద స్త్రీలు వలయాకారముగ దిరుగుచు నృత్యము చేయుదురు. కంకంటి పాపరాజు తన యుత్తరరామాయణమున హల్లీసక నృత్యవిధమును కన్నులకుగట్టినట్లు ఇట్లు వర్ణించియున్నాడు:

"అన్యోన్యహస్త దండావృత్తు లెసఁగ నా
  డోరుల సాముఖ్యంబు లొంది యొంది
యావలావల వచ్చి యితరేతరముఁ దొల్త
  నిలిచిన నెలవుల నిలిచి నిలిచి
కంకణ మంజీర కాంచికల్ మ్రోయ స
  వ్యాపసవ్యస్ఫూర్తి జూపి చూపి
తాళవాద్యరవానుకూలంబుగా మంద
  ద్రుత మృదుగతులను దిరిగి తిరిగి
యాంగికమరసోదయంబున నభినవాతి
చిత్ర వర్తనభంగులఁ జెలఁగి చెలఁగి
విశదించిన మన్మథోన్మద ద్విరదములన
చెలువు హల్లీసకము సల్పె సంతసిల్లి."

తెలుగుదేశమున కంకంటి పాపరాజుగారి కాలమున హల్లీసకనృత్య మెట్లు సలుపబడుచుండెనో యీ పైపద్యమువలన దెలియవచ్చుచున్నది. పాపరాజుగారు పదునెనిమిదవ శతాబ్దినాటివారు; అయినను తెలుగుదేశమున మధ్యయుగమునాటనుండి సంప్రదాయసిద్ధముగ వచ్చుచుండిన పద్ధతిని ఆయన వర్ణించినట్లు చెప్పుట కభ్యంతరముండదు. ఈ పద్యమునకు పూర్వపు పద్యమున పాపరాజుగారు తననాటికి ఆంధ్రదేశమున నున్న నృత్యవిశేషము లితరములను కూడ ఈ క్రిందిరీతిని దెలుపుటయేకాక హల్లీసకమున పాల్గొన్న యింతుల సంఖ్య కూడ దెలిపినారు:

"అభినయంబుల కోపు లరుదైన తీరుపుల్
  వెలయఁగాఁ బదచాళివిధ మొకర్తు
లాసమైసిరియుఁ బల్లటియుఁ గత్తియుఁ జెక్క
  విలసిల్లు జక్కిణివిధ మొకర్తు
సిరిఁ దాళము లుగ్గడింపుచోఁ దీరుచో
  వింతగాఁ బేరణివిధ మొకర్తు
నలరి వినిపింపఁ బతి మెచ్చనంత నేడ్వు
రిరువు రెనమండ్రుఁ బదియాఱుగురును ముప్ప
దిద్ద ఱిరువదినలువురు హెచ్చుగాఁగ
బంతులై వంతులారి యయ్యింతులెల్ల."

"అన్యోన్యహస్తదండావృత్తు లెసఁగ" అని పైపద్యముతో నన్వయము. శబ్దరత్నాకరకర్త 'పదచాళి' యన్న నృత్యవిశేషమునకు పెక్కణమని యర్థము చెప్పుచున్నాడు. జక్కిణి, కత్తి యనునవి నాట్యముతో గూడిన రూపకములవంటివి. వీని పరిణామమే యక్షగానము. 'కత్రశాలాస్వామి' యట మైలారదేవుడు - 'భైరవుని తోడి జోడు'. మైలారదేవర సంబరముసందర్భమున 'గొరగపడుచు' అభినయమును వల్లభామాత్యు డిట్లు ప్రశంసించియున్నాడు:

"వీరు మైలారదేవర వీరభటులు
గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు
నాడుచున్నదిచూడు మూర్ధాభినయము
తాను నెట్టికసీలంత కాని లేదు."

"వెనుకకు మొగ్గవ్రాలి కడు
  విన్ననువొప్పఁగఁ దొట్టినీళ్ల లోఁ
మునిఁగి తదంతరస్థమగు
  ముంగర ముక్కునఁ గ్రుచ్చికొంచు లే

చెను రసనాప్రవాళమున
శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పే
రనుపమలీల నిప్పుడుచు
పాయము లిట్టివి యెట్టు నేర్చెనో."

నాట్యావసరములబాడు గీతప్రబంధములలో పెక్కుభేదములు కలవు. వానిలో 'పంజళము' ఒకటి.

"పాడి మెచ్చించె నొకయింతి పంజళమున
నాడి మెచ్చించె నొక లాస్యమున నొర్తు."

అని శ్రీనాథుడు. పంజళమునుగురించి యింత కధికము నాకు దెలియదు.

ధ్రువాప్రబంధము మఱియొకటి. ధ్రువయనగా దరువు. ఇది ప్రవేశ, నిష్క్రమణాది చతుర్విధములది. విజయోత్సవముల సందర్భమున ధ్రువాగానము విశేషము. శత్రుసంహారము గావించి విజయలక్ష్మీసమేతుడై భూనేత నిజనగరప్రవేశ మొనరించుసందర్భమున చాటూదాహరణ జయఘోష చక్రవాళాదిప్రబంధములతోపాటు 'ప్రావేశికధ్రువాగానము' కూడ వెలయుచుండెడిది. ధ్రువాప్రబంధసరణికి వాద్యము లెట్లుమ్రోగునో కొఱవిగోపరాజు చిత్రముగ సొగసుగ నిట్లు తెలిపినాడు :

"గంధర్వుల్ పదునాల్గుదోషములు ద
క్కం దాళ మానంబులన్
గాంధర్వంబు ధ్రువాప్రబంధసరణిన్
గావింపఁగా వాద్యముల్,
ధిం ధిం ధిక్కు ధిమిక్కు తక్కుధికతోం
ధిక్కుత్తకో ఝుక్కుణిం
ధిం ధాం ఝుంకకు ఝుక్కుధిగ్గిడధి ధా
ధీ యంచు మ్రోసెన్ వెసన్."

మధ్యయుగమున సాధారణగృహస్థు నాగరికు డనిపించుకొనుట కవసరమయినవి నాలుగు లక్షణములు. ఇవి లేనివో అతడు 'పశువే' నట. తెలియునా యానాలుగు లక్షణము లేవో—

"గద్యము పద్యముం జెనపఁ
గైకొను టొండె, ధ్రువాప్రబంధ సం
పద్యకుఁడౌట యొండె, మృదు
భావలఁ బ్రొద్దులుపుచ్చు టొండె (!) లో
కోద్యమలక్షణం బెఱుఁగు
టొండె గడు న్భజియించుఁగాక యే
విద్యలు నేరఁడేనిఁ బృథి
విం బశు వాతఁడెగా గణింపఁగన్."

ఎంతటి యసిధారాపరీక్ష యిది? ఈ పరీక్ష కాగగలవా రానా డెందరుండిరో. గంధర్వులుకూడ ఆనాడు ధ్రువాగానమునే యభిమానించిన ట్లున్నారు. కానిచో శ్రీనాథుడు—

"ఆవేళను గంధర్వులు
త్రైవారపదానుసారకమనీయముగాఁ
బ్రావేశికధ్రువాగా
నావళులం బరిఢవించి రంచితలీలన్."

అని యెందుకు వ్రాయును?

ఏలాప్రబంధముకూడ ప్రబంధములలో లెక్కయే. చూడుడు చిన్నకోట పెద్దన ఏమనుచున్నాడో :

"అలినాదంబులు దానమానములుగా
నాలప్తిఁ గావించుఁ దో
య్యలి యొక్కర్తె పాడు విశ్వవిభు నే
లాదిప్రబంధంబులన్
దెలివిం గైకొని యొక్కర్తు సొంగముగ న
ర్తించుం; గళాసించు ను
గ్మలి యొక్కర్తె వ్రాలు సోలములతోఁ
గాడంబరీగోష్ఠిచేన్."

వీర చరిత్రములు పాడుటకు ద్విపదప్రబంధము సమునైన దేసట. పల్నాటివీరుల కథను ద్విపదప్రబంధమున బాడునప్పటి రీతిని ఎంత చక్కగ వర్ణించినాడో చూడుడు వల్లభరాయుడు :

"ప్రకటితాసంబున వీరసంభితకథుం
ఘుం ఘుం కిటాత్కారసం
గతిరాజ్యః ప్రచు సాంతరాళిక యతి
గ్రామాభిరామంబుగా
జతిరూపం ద్విపద ప్రబంధమున వీ
రానీకముం బాడె నొ
క్కకొ ప్రత్యక్షరముం గుమారకులు ఛీ
టాత్కారంబునం మూలగన్.

"గర్జించి యరసి జంఘాకాండ యుగళంబు
వీరసం బెం కోల వ్రేయు నొకఁడు
ఆశ్రితపాదవిన్యాస ముప్పరగ వ్రాలి
కుంతాభినయముఁ గైకొను నొకండు
ఉరువుఁ గన్నుల నబ్బు బెదరుఁజూపులతోడ
ఛీటాత్కార మొనరించుఁ బెలుచ నొకఁడు
పలుభుజాస్ఫాలనపరిపాటి ఘటియిల్ల
నరణి యాస్ఫోటించి దాఁటు నొకఁడు
తద్ది ప్రకటింప నొక్కరుం డోలవాఁడు
బాలుల ఖడ్గంబు భంజళ్లఁ బఱపు నొకఁడు
కొమ్ము వాటించుచును బెద్దగొలువులోనఁ
బ్రీతి పల్నాటి వీరులఁ బాడునపుడు."

రెడ్డిమన్నెలు పరిపాలించిన కాలమున నాడు నాట్యకళ చాల అభివృద్ధిదశయందుండెను. అనవోతభూపతి కుమారుడైన కొమరగిరిరెడ్డి వసంతరాజీయ మను పేర నాట్యశాస్త్రమును రచించినాడట. అతని యాస్థానమున లకుమాదేవి యను నర్తకి క్రొత్త క్రొత్త పోకడల నాట్యార్థ రహస్యముల నభినయించుచువచ్చినదట.

ఈరీతిని మధ్యయుగమున ఆంధ్రదేశమున సంగీతనాట్యకళలు రెండును కవలపిల్లల వలె వృద్ధినొందినవి. సంగీత, నాట్య, అభినయములతో నాటకములు వాడుకలోనికి వచ్చినవి. పురాతన రాజచరిత్రములను, శివ, కేశవలీలలను నాటకమాడువారు. 'దేసి' నాటకము ఆనాటికి వాడుకలో నుండిన గీతా ప్రబంధసరణుల నన్నిటిని బొదివికొని యక్షగానరూప మలవరించుకొన్నది ఈ కాలముననే.

"ప్రమథపురాతన పటుచరిత్రములు
క్రమ మొంద బహునాటకము లాడువారు
లలితాంగ రసకళాలంకార రేఖ
లలవడ బహురూప మాడెడువారు
గరణముల్ మెరవణుల్ గతులు జిత్రములు
నరుదుగ వెడ్డంగ మాడెడువారు
. . . . . . . . . . .
భారతాదికథలఁ జీరమఱుఁగుల
నారంగ బొమ్మల నాడించువారు
గడు నద్భుతంబుగఁ గంబసూత్రంబు
లనరంగ బొమ్మల నాడించువారు
నాదట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు
విధమున బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి."

అని తననాడు వాడుకలో నుండిన నాటకాదికములను పాల్కురికి సోమనాథుడు మనకు దెలియజేయుచున్నాడు. పురాతన రాజదేవతా చరిత్రములే కాక ప్రసిద్ధవారస్త్రీ చరితములుకూడ నాటకములు కట్టి యాడు సంప్రదాయ మున్నట్లు వల్లభరాయుని క్రీడాభిరామమునందలి—

"(మాచల్దేవి వారాంగన) చిత్రశాలాప్రవేశంబు చేయుచున్న యది పుణ్యాహవచనకాలంబు మీరనుఁ బచ్చనిపిల్లికూటంబుఁ జూడవచ్చునది యనిన,

"తెప్పగాక కిరాట! యీ తేమ చరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన
వీనిఁజూడంగఁ బోదమా యీ నెపమున
నరసి చూతము మనకేమి యచట నవచు."

అను విషయమునుబట్టి విదితమగు చున్నది.

ప్రసిద్ధుడైన కాకతి గణపతి దేవమహారాజు గజసాహిణి జాయప సేనాని ఒక గొప్ప నట్టువోజు. ఇతడు నాట్యాచార్యుడు మాత్రమే కాక 'నృత్త రత్నావళి' అను పేర నాట్యశాస్త్రమునుగూడ రచించిన కళావిజ్ఞాని. ఈ గ్రంథమువలన ఆనాడాంధ్ర దేశ మాదరించిన నాట్యవిశేషములు కొన్ని తెలియగలవు.

మధ్యయుగము ప్రధానముగ శైవము విజృంభించిన కాలము. శివుడు నాట్యాధిదైవము. తాండవవిద్యాగురుడు కదా ఆ నటరాజు!—ఆటపాటలకు, నాట్యకూటములకు ఇంకేమి కొదవ? కాకతిభూపతుల కాలమున ఆంధ్రదేశమున పొటమరించిన శిల్పమంతయు నాట్యచిత్రాత్మకమయినదే. పాలంపేట, రామప్పగుడులలోని శిల్పచిత్రములు వివిధ నాట్యభంగిమములను వ్యక్తీకరించుచు కనుల పండువు చేయుచుండును. ఏకశిలానగరము (ఓరుగల్లు)నందలి స్వయంభూలింగ దేవుని యాలయము స్తంభములమీద—ఆయొక్క యాలయముననే కాదు, ఇతర ఆలయముల యందును—ఆ నాటి యాంధ్రశిల్పులు ఆంగుళమునందలి పదియవవంతు భాగమునగూడ పార్వతీపరమేశ్వరుల లాస్య, తాండవనాట్య లీలలు అతిసూక్ష్మముగ చెక్కి తమ కళానైపుణ్యమును ప్రదర్శించినారు. మధ్యయుగము ఆంధ్రదేశమున సంగీత, నాట్యకళావిజృంభణయుగము. చిరస్మరణీయము కదా అది!



# నేను మహాత్ముని అనుసరించుటకు కారణము

= శ్రీ సర్ పూసపాటి విజయానందగజపతి =

మన సాంఘిక రాజకీయాలలో సంభవించిన విచిత్రములందు నాలో కలిగిన పరివర్తన ఒకటని నా మిత్రు లన్నారు.

నేను ఆగర్భశ్రీమంతు ణ్ణవటమే కాకుండా మా తెగవా రందరూ ఉగ్గుపాలతో నేర్చుకొన్న ప్రభుభక్తిపరాయణత్వంకూడా చిన్ననాటనే నాకలవడింది. అప్పటికి అమలులో వుండే పాలక వర్గానికి భక్తితత్పరుడు కాకుండా జమీందారైనవాడెవ్వడూ వుండలేడు. కాని ప్రతి మానవుడి జీవితంలో కలిగే అద్భుత పరిణామాలను గురించి మనస్తత్వవేత్తలెవరైనా చెప్పగలరు. అసలు యథార్థం ఏమిటంటే ఆంగ్లేయునితో ఎంత సన్నిహితంగా సంచరిస్తే, అంత స్పష్టంగా అతడికీ మనకీ వుండే సంబంధంయొక్క మిథ్యా, కృత్రిమత్వం కండ్లకు కట్టుతుంది. ఆంగ్లేయుల్లో పెద్దలతో మనం విందు లారగించవచ్చు; గొప్పవారి సరసన భోంచెయ్యవచ్చు; మహోన్నతులతో భాయి భాయి అంటూ బుజాలుకలిపి తిరగవచ్చు; గవర్నమెంటుభవనంలో గాని, రాజప్రతినిధియింట గాని గౌరవనీయులైన అతిథులుగా వుండవచ్చు. చీట్లాటలో వారిని చిత్తుచేయవచ్చు; క్రికెటులో వారిని అవలీలగా వోడించవచ్చు. మనలను చూసి వారు సంతోషిస్తారు; ప్రేమిస్తారు. అయితే, అ దేమి చిత్రమో గాని వారికీ మనకీ మధ్య హిమాలయంలాంటి పెద్దగోడ వొకటి అడ్డువున్నట్టు అంతలో స్ఫురిస్తుంది.

తాము పాలకవర్గానికి చెందినవార మని ఆంగ్లేయు లెన్నడూ మరువలేరు. ఉత్తమోత్తముడైన భారతీయుడు సయితం అధమాధముడైన ఆంగ్లేయుడికిజోహారుచేయవలెనని భావాన్ని వారెన్నటికీ విస్మరించలేరు. ఆంగ్లేయులయొక్క ఈవైఖరి మనలో అణగియున్న స్వతస్సిద్ధమైన భారతీయత్వాన్ని పైకుబుకిస్తుంది. జ్ఞానోదయం లాగా అది నీలో వుత్పన్నం అవుతుంది. పాతవాసనలను వదిలి కొత్తబాంధవ్యాలకోసం నీ మనస్సు పరిశోధిస్తుంది. నాలో కలిగిన పరివర్తనకు కారణం యిది తప్ప మరొకటి కాదు. ఇది కేవల మనస్తత్వానికి సంబంధించిందే.

భూకర్షణ శక్తినుంచి తప్పించుకోగల మని అనుకోటం ఎలాంటిదో, ఈ కాలంలో భారతీయుడైవుండి గాంధీతత్వానికి ఆకర్షింపబడకపోవటం అలాంటిది. నిర్జీవంగానీ, సజీవంగానీ విగ్రహారాధన అనేది

మనలో పాతుకుపోయివుంది. భారతభూమి ప్రధానంగా అవతారాలకు ఆలవాలమైన దేశం. రాజకీయాలమాట అలావుంచండి; భారత దేశానికి ప్రపంచంలో ప్రత్యేకతనంపాదించిన మహోన్నత వ్యక్తినిగురించి ఏ భారతీయుడు గర్వించడు? ఫకీరుగానీ, అమీరుగానీ ప్రతిభారతీయుడిలోనూ త్యాగతత్వం ఎముక కంటుకొనివుంది. గాంధీమహాత్ముని జీవిత నిరాడంబరత అప్రతిమానమైనది. మన మత, సంస్కృతుల ఉదాత్తత యావత్తూ ఆయనలోమూర్తీభవించి వుండడంచేతనే గాంధీజీ అంటే మన కంతటి ఆకర్షణ. దానిని కాపాడటానికే మహాత్ముడు చరిత్రాత్మకమైన నిరశనవ్రతంలో ప్రాణాలొడ్డాడు. ఆయన మహాత్యాగం నన్ను ఆత్మపరిశోధనకు పురికొల్పింది. ఎంతటి మహోన్నతపథాలకు ఆత డెగిరిపోగలడో ఒక్కక్షణంలో మెరుపు భంగి నాకనుభూతమైంది. మనలోని పతితులయెడల్నూ, నికృష్టులయెడలా మనకు గల బాధ్యతలను గురించి నాకది కనువిప్పు అయింది. గాంధీమహాత్ముని జీవితం భగవద్గీతానుష్ఠానం. మహాత్ముని హిందూమతావలంబనం సంవత్సరంలోని రుతువులవలె కాలానుగుణ్యమూ, స్వయంపోషకమూ నైనది.

సత్య, అహింసలను గురించిన జిజ్ఞాసను మనం వేదాంతులకు వదలివేయవచ్చు. కాని, సిద్ధాంతపూర్వకంగా సత్యాన్ని ఎట్లా కాదనలేమో అట్లాగే అహింసాసిద్ధాంతాన్నికూడా కాదని వాదించలేము. మానవుడు అహింసను పూర్తిగా ఆచరించగల పరిణతిని పొందాడా అన్నది వేరేవిషయం. ఆతడింకా ఆ స్థితికి రాలేదనే నా అనుమానం. మనల్నింకా యుద్ధాలు వదలలేదు. మరికొన్ని రుధిర స్నానాలతోగాని ప్రపంచచరిత్ర పూర్తి కానట్టు తోస్తుంది. కాని, అంతమాత్రాన ప్రవక్తల దివ్యసందేశాలను, వారి కర్తవ్య పాలనను, వారి భావోన్నత్యాన్ని మనం కాదనలేము. దేశభక్తుడుగా కంటె మహా ప్రవక్తిగా ప్రపంచంలో మహాత్ముడికిగల స్థానం అధికమని అంగీకరించక తప్పదు. బుద్ధుడు, ఏసుక్రీస్తులవంటివాడు గాంధీమహాత్ముడు.

అన్యోన్య ప్రతికూల శక్తులవల్ల మానవ స్వభావం విచిత్రగతుల సంచరిస్తుంది. దైనందిన ప్రత్యక్షజీవితంలో అహింసావలంబనం మనకు అసాధ్యం కాబట్టే దానిని ఆదర్శంగా మనం ఆరాధిస్తున్నామేమో! అందుచేతనే మహాత్ముడికి మన హృదయాల్లో స్థిరమైన స్థావరం ఏర్పడ్డది. అంగుష్ఠమాత్రుడైన ఈ ప్రవక్త మనల్ని సందర్శనమాత్రంచేతనే ఆకర్షించుకుంటాడు.

ప్రతి క్రికెటు ఆటగానివలె నేను కూడా నిర్మాణశక్తియొక్క విలువనూ, ఐకమత్యావశ్యకతనూ, అందుకు వలసిన త్యాగాన్నీ గ్రహించి, గౌరవించ గలిగాను. ఈ గుణాలు గాంధీమహాత్ముడిలో కొల్లలుగా కనపడుతాయి. మహాత్ముడు ఈ గుణాలను తన మిత్రులకూ, అనుచరులకూ కూడా అనుగ్రహించాడు. ఏకీభావంతో కలిసి పనిచేయడం మనకు నేర్పినవాడు గాంధీమహాత్ముడే. సగం ఘనీభవించి, అపక్వ స్థితిలో ఉన్న కాంగ్రెసును చేపట్టి దానిని ఉక్కుముక్కలాంటి ఇటుకగా తయారుచేసిన మహా నిర్మాత గాంధీమహాత్ముడు. ఆ ఇటుకకు అచ్చును తయారుచేయటమే కాకుండా, అది ఘనీభవించేలోపుగా దానికి

తీర్పులు తీర్చి, రూపురేఖలు దిద్దాడు. సామాన్యదృష్టికి అసంభవంగా కనిపించే సత్యమూ, అహింస అను ఆదర్శాలమీద ప్రపంచంలోకెల్లా గొప్పదైన స్వచ్ఛంద సేవా సంస్థ కాకదాన్ని నిర్మించి పోషించడం అల్ప విషయం కాదు. ఆ ఆదర్శాలకతడు వివిధగతుల విస్తారరూపం కలగజేశాడు. వాటిలో ముఖ్యమైనది కాంగ్రెసు 'నిర్మాణకార్యక్రమం.' హిందూముస్లిం ఏకత్వం, భారతైకమత్యం, మహిళోద్ధరణ, గ్రామపునరుద్ధరణ — ఇంకా ఇలాంటి అనేక మహద్విషయాలనుగురించి మనందరికంటె ఎన్నో వత్సరాలు ముందే ఆలోచించాడు; నేటికీ ఆలోచిస్తున్నాడు. అతడు కొట్టిన ప్రతిదెబ్బకూ పాతసంకెళ్లు ఫెళ్లున రాలిపోతూ వున్నవి. ఒకవంక పరిపాలనాభవనాన్నించి వొక్కొక్కటిగా ఇటుకలన్నిటినీ లాగివేయటమే కాకుండా, వేరొకవంక మన భవిష్యదావాసమైన ఆ స్వరాజ్యభవనానికి ఒక్కొక్క ఇటుకను పేరుస్తున్నాడు. నిర్మూలనంతోబాటు నిర్మాణమూ, సంహారంతోబాటు సృష్టీ చేయుగల అదృష్టం ప్రపంచేతిహాసంలో ఏ కొద్దిమంది వ్యక్తులకోగాని లభించదు. గాంధీమహాత్ముడు మనకు స్వాతంత్ర్యాన్ని తెచ్చిపెట్టడమే కాక దానిని వినియోగించుకోడానికీ, సంరక్షించుకోటానికీ కూడా శక్తిసామర్థ్యాలను ప్రసాదించాడు. గాంధీ జీవితానికంతటికీ ఇది మకుటప్రాయమని భవిష్యచ్చరిత్రకారులు కీర్తిస్తారు. తరతరాలుగా భారత సంతతి అత్యంత కృతజ్ఞతాభావంతో సంస్మరించగలదు.

మనం కాంక్షించే విప్లవం మనమీదనూ, మనవెంటనూ, మనతోనూ ఉన్నదని తెలుసుకోలేక 'ఇంక్విలాబ్ జిందాబాద్' అని అరుస్తుంటాము. అలాగే, ధర్మసంస్థాపనార్థం అవతరించుతాడన్న ఆమహాపురుషుడు ఎన్నడో రాబోవడంలేదు; మనతోనే వున్నాడు. అట్టి యుగపురుషుని అడుగుదమ్ములలో నడవగల అవకాశాన్ని కోల్పోయే మందభాగ్యు డెవడుంటాడు ?





# శ్రీ రామ రక్ష

= శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి =

ఆమె కలకంఠ కవయిత్రి యయ్యెనేని;
తరుణకరుణావసంతగీతమ్ము నేను.
ఆమె శాసించు శేరాణి యయ్యెనేని;
నేను సహకారశాఖినై నిలుతు నచట

ఆమెయే శరచ్చంద్రిక యైనయెడల;
ఆహరింతు కళానిధి నగుచు నేను.
ఆమె తొలుకాఱుమెఱపు తానయ్యెనేని;
ఉఱుము లెఱుఁగని జలదమై యుందు నేను.

ఆమె పెనుభూతమైనచో; అంధకార
బంధుర దురంత దుర్దాంత భయద గహన
కుహరవిహారజ్జడీభూత ఘూకము నయి
ఇఱికికొందు సంసారంపు టిరులగముల.

ఆమెయెడఁద అయశ్శిలాకోమలంబు
నాయెడంద పన్నీటి చందనపుఁ గరడు.
ఎంచి వరియించికొన్నార మిరువురమును
ఆమెకును నాకుఁగూడ శ్రీరామరక్ష.

# Carrier

WEATHER MAKERS TO THE WORLD.

## ఎయిర్ కన్‌డిషనింగు

గృహములు,  ఆఫీసులు  బ్యాంకులు,

భోజనశాలలు,  పారిశ్రామిక భవనములు మున్నగువాటికి

---

## రెఫ్రిజరేషన్

చల్లదనముచేకూర్పు గదులకు - మంచుగడ్డ తయారు చేయుటకు-మంచినీటిని చల్లగా నుంచుటకు - అనుపత్రులకు-

ఫిల్ము డెవలపింగుచేయుటకు - ఫిల్ములను చెడిపోకుండ ఉంచుటకు - కాఫీహోటళ్లలో బాటిల్ కూలరులకు.

డిస్ట్రిబ్యూటర్లు :

## వాల్‌కార్టు బ్రదర్సు,

ఇంజనీరింగు డిపార్టుమెంటు—మదరాసు.

---

# అద్భుత విషయము

జనన తేదీగాని జననకాల ఘడియలుగాని లేని వారికి హస్తరేఖలనుబట్టి రాశి, అంశ, చక్రములు; దశాశేషము, జన్మలగ్నము, మొదలగునవి తయారుచేసి ద్వాదశభావఫలములు ప్రమాణములతో వ్రాయుటకు రు. 10 లు అగును. దీనికి అడ్వాన్సు రు. 5 లు పంపవలసి యుండును. అడ్వాన్సు చేరినవెంటనే జననతేదీ వగైరాలు తయారుచేసి దాఖలాకొరకు 1 కాపీ ముందుగా పంపబడును. పిమ్మట ఫలములు వ్రాయబడును. ఒక అచ్చాఫీసునకు బోయి కుడి, యెడమ అరచేతి ముద్రలు రెండున్ను; రేఖలు స్పష్టముగా కనబడునట్లు ముద్రలు తీయించి చేయి 1-కి రెండుముద్రలు చొ॥న సరిగా తీయించి పంపవలెను. సిరాముద్రలు పనికిరావు. కొంచెము యించుమించుగా ప్రస్తుతపు వయస్సుగూడ తెలుపవలెను.

## ఆకెళ్ల వేంకటశాస్త్రి,

గోపాలపురము పోష్టు, (వయా) తణుకు తా॥ గో॥ జిల్లా.

---

# ప్రమద



స్త్రీల పాలిటి వర ప్రసాదిని ప్రదరము, కుసుమరోగము (స్త్రీలు చీరెలువిడుచు వ్యాధులు) ఋతుశూల, దుర్బలత్వము, మేహఊడుకు, శగరోగము, బహిష్టు చక్కగా కాకపోవుట, వంధ్యాదోషము మొదలగువానిని హరించి సంతానవతులనుగా చేయుటలో శ్రేష్ఠమయినది. 8 ఔన్సుల సీసా రు. 1-8-0. 4 ఔ॥ సీసా రు. 0-14-0. పోస్టేజి ప్రత్యేకం. రు. 0-11-0. అగును. అన్నిఔషధముల కూ క్యాటలాగు ఉచితము.

## పి. శి. ఏ. అండు కంపెనీ,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

# గాంధీమతముయొక్క భవిష్యత్తు

= శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య =

I

మానవస్వభావముగా భూత వర్తమాన భవిష్యత్తులు మానవకోటికంటెకూడా ఎక్కువగా చింతాస్తుతులకు పాత్రము లయినవి. ప్రతివానికిని తన పూర్వు లెవరో, తా నెవరో, తన సంతతివా రెవరో తెలిసికోవలె నను కోరిక యుండుట సహజము. అంతే కాక తనయొక్క భూత వర్తమానములు తా నెరిగియున్నను తన భవిష్యత్తు ఎట్టిదగునో తెలిసికొనవలె నను ఆపేక్ష కలిగియుండును. ఎప్పుడో పుట్టినప్పుడు తన జాతకమును జ్యోతిష్కునికి గాని, తన అరచేయి సాముద్రికునికి గాని చూపించనివారు లేరు. ఏప్రకారముగా నాస్తికు లప్రస్తుతమను దైవము పేరు వినగానే ఉలిక్కిపడుదురో జ్యోతిషమునందు నమ్మకము లేదని చాటించువారును నాకి అంత ఎక్కువగా లొంగి పోవుట కలిగించును. గాంధీ మహాత్మునికి మాత్రము తన జ్యోతిషము తెలిసికోవలె నను ఇచ్ఛ యున్నట్లు ఎందును నిదర్శనము కానరాదు. కాని వీరియొక్కయు, వీరి ఉద్యమముయొక్కయు భవిష్యత్తు ఎట్టిదిగా నుండునని పత్రికా సంపాదకు లయినను ప్రశ్నింపక పోరు. ఆంధ్రపత్రికా సంపాదకులవారి అట్టి ప్రశ్నకే ఈవ్యాసము జవాబుగా వ్రాయబడుచున్నది. ఇట్టి జవాబును సమగ్రము చేయవలెనన్న యెడల మహాపురుషులు ఎటువంటివారో, గాంధీ మహాత్మునకును వారికిని ఏమైన తారతమ్యము గలదో, మహాత్ముని బోధలు, తత్వములు, సిద్ధాంతములు చిరస్థాయిగ నుండగలవో, లేక తాత్కాలికపు వెలుగు వెలిగి చల్లారిపోనై యున్నవో మనము విచారించ వలసియున్నది.



మన దేశమందు అనేకులు గొప్పవారు పుట్టియున్నారు, గతించినారు. కొందరి పేళ్లు నూర్లకొలది సంవత్సరములు నిలిచియున్నవి. మరికొందరివి వారి పరిమితకాలము ఎంతో అంతవరకే ప్రకాశించి పిమ్మట మరుపుపాలయినవి. శంకరుడు యోగుడు కాడు; వీరుడు కాడు— మతసంస్కర్త. ఇప్పటికి ఈయన లేరు. కాని 1200 సంవత్సరములు ప్రఖ్యాతిపూర్వకముగ నిలిచియుండుట యేకాక రానురాను దైవతుల్యుడుగ పూజింపబడు చున్నాడు. రామానుజులు, మధ్వులు, అంత కాకపోయినను గొప్ప కీర్తినే సంపాదించినారు. గాంధీగారి పేరు 700 సం.లు నిలిచియుండు నని ఒక జ్యోతిష్కుడు చెప్పియున్నాడు. 700 సం.లు నిలుచునో, 7000 సం.లు నిలుచునో ఎవరు చెప్పగలరు? ఒక్క సంగతి మాత్రము సులభముగా గ్రహింపదగును. ఈయన చేసిన బోధలు మానవకోటియొక్క ఐహికాముష్మిక సుఖములకు చిరస్థాయియగు ఆధారము లగుననుటలో అభిప్రాయభేద మెంతమాత్రమును లేదు; అతిశయోక్తియు లేదు.

ప్రపంచము ప్రేమమీదనే ఆధారపడియున్నచో, అట్టి ప్రేమ మానవజీవితమునకు పునాదియగు యత్నమును గావించిన గాంధీ మార్కండేయులు, హనుమంతుడు, జాంబవంతుడు మున్నగు అష్ట చిరంజీవుల తుల్యుడగును.

వీరి సిద్ధాంతములను ఈరోజున ప్రజలు ఉపేక్ష చేయవచ్చును, హేళన చేయవచ్చును, ధిక్కరింపవచ్చును. కాని, వానికి ఎన్నటికైనా లొంగిపోక తప్పదు.

II

సిద్ధాంతకర్తలు ఏసిద్ధాంతమునైనను ఉపక్రమించినచో తమ సిద్ధాంతమును ఆచరణలోనికి ఎట్లు తీసుకొనిరావలెనను సమస్యను ఎదుర్కొనుట వారి పనికాదు. వారిపని అల్లా సమస్యయొక్క ప్రాతిపదిక విషయమును కనిపెట్టి దానిని తేల్చు విధానమును నిర్ణయించుటయే కాని తేల్చు సాధనములను నిర్ణయించుట వారి పని కాదు. ముఖ్యమైన విషయ మేమంటే, ప్రాతిపదికరీత్యా ఏగుణమైనను సక్రమమయినదా, కాదా అనియే. ఆ భావన క్రియాచరణలోనికి తెచ్చుట కష్టము కావచ్చును; కాకపోవచ్చును. ఎప్పుడైతే సిద్ధాంతముయొక్క సాధ్యాసాధ్యములను గూర్చి సిద్ధాంతకర్త యోచించుతాడో అప్పుడే సిద్ధాంతమునందలి సత్యమును మరుగుపరచినవాడగును. ద్రష్టల కంటికి తాను తారామండలములోని నక్షత్రములవలె ప్రకాశింపజాలడు. ఏరోజు కారోజు కనిపించు రోగనిదానము చేయగల్గిన భిషజ్మణి కాజాలడు. కాని ఏగుణమున కాగుణము కుదిర్చే వైద్యుడు కాగలడు. ఈ తత్వమునకు సంబంధించిన కార్యక్రమమును విపులీకృతము చేయువాడు తన గమ్యస్థానమును మాత్రమే దృష్టియందుంచుకొనవలెను. రాజకీయ నాయకుడు గమ్యస్థానమును అన్వేషించి నిర్ణయించవలసిన కర్త. సిద్ధాంతకర్తయొక్క మనస్సు ఏదైనను శాశ్వతమైన సత్యాన్వేషణయందే వినియోగపడును (సంచాలనముచేయును). కాని రాజకీయ నాయకుని యొక్క దృష్టి ఆ సిద్ధాంతములను సాధింపజేయు కార్యసాధనమును వెదకుచుండును. మొదటనున్న ఈగణ్యత, ఉత్కృష్టత, మహత్తు సిద్ధాంతముయొక్క నిరంతరసత్యముమీదనే ఆధారపడియుండును. రెండవ వారియొక్క గొప్ప, ఉత్కృష్టత, మహత్తు వారి యెదుట వుంచబడిన సత్యమును ఆచరణలోనికి తెచ్చు మార్గమును సక్రమముగ యోచించినారా, లేదా అనే అంశముపై ఆధారపడివుండును. వీరిమహత్తు తమ కార్యప్రణాళికయొక్క జయాపజయములపై ఆధారపడియుండును. అనగా గమ్యస్థానమును పొందగల్గుటా, లేదా అనే అంశముపై ఆధారపడివుండును. సిద్ధాంతకర్తలును, తత్వవేత్తలును నిర్ణయించిన గమ్యస్థానమెప్పటికిని పొందబడజాలదుకదా! మన మనస్సు, దృష్టి, మన భావములు, యోజనలు సిద్ధాంతము వెళ్లినంతదూరము వెళ్లజాలవు. అందుచేతనే గమ్యస్థానము పరిపూర్ణముగా పొందబడదు. కారణము మన స్వభావముయొక్క దౌర్బల్యమే, అసంపూర్ణతయే. ఆకారణముచేతనే సిద్ధాంతము యెంత శక్తివంతమో అంత అనాచరణీయము. రాజకీయ సిద్ధాంతియొక్క జయాపజయములు కార్యాచరణనుబట్టి నిర్ణయింపబడజాలవు. ఇందుకు భిన్నముగ సందర్భము లున్నపుడు అట్టి సిద్ధాంతులయొక్కయు, మత స్థాపకులయొక్కయు మహత్తు అత్యున్నతమైనట్టు ఎన్నడును అంగీకరింపబడజాలదు. ఏలయన, వారియొక్క నైతికబోధలు ఎప్పటికిని పూర్ణముగ కార్యాచరణములో సాఫల్యమును చెందజాలవు. ప్రేమమీద ఆధారపడివుండే మతమును, ధర్మమును ఏతద్ధర్మస్థాపకుల నిశిత (Sublime) బుద్ధియొక్క ప్రతిబింబములే. వాని అర్థము గ్రహింపవలెనని జీవితములో మన సభ్యతకును, సుగుణములకును, నీతికిని ఎంతవరకు అవి మార్గము చూపగలవో దాని మీదనే ఆయర్థము ఆధారపడివుండును. కావుననే సిద్ధాంతికిని, కార్యధురంధరునికిని వలయు గుణపుంజము ఒక్కరీతిగా వుండజాలదు. సామాన్యముగా మనము చేయదగ్గ కార్యములను, మనము ఆచరించదగ్గ నీతిని నిరూపించుటయే రాజకీయవేత్తయొక్క కర్తవ్యము. రాజకీయవేత్త తనకు సాధ్యమైన కార్యాచరణ చేయువాడే కాని అందుకు మించిపోవువాడు కాదు. అందువలననే ఏతరమున కాతరమునకు రాజ

కీయనాయకులు మారుచుందురు. ఒకతరములో పొందిన జయము తరువాతితరమునకు పనికిరాదు. వీరల జయము కేవలము తాత్కాలికమని చెప్పవలెను. అట్టి తాత్కాలిక జయము పొందగల సాధనముల కలవడి శాశ్వతమైన సమస్యలను, భావములను నిర్ణయించుట కష్టమని ఎంచి, రాజకీయవేత్తలు వానినుండి తప్పించుకొని, తాము జయముపొందినవారగుదురు. ఇది శాశ్వతముగ లాభకరము కాకపోవచ్చును. అట్టి కార్యమునకు పూనుకొనువారు సామాన్యజనులచే ఆకర్షింపబడజాలరు.

అజ్ఞానమునకు రక్తబంధువు అహంకారము. రాజకీయనాయకునియొక్క అజ్ఞానము హెచ్చినకొద్దీ డంబముకూడ హెచ్చుచుండును. జనసామాన్యము నిజముగా చేయు కార్యక్రమముమాత్రమే వారు అవలంబింతురు. వీరి జయము యావత్తూ సద్యఃఫలితము; భవిష్యత్తునకు వినియోగించదు. వీరు తాత్కాలిక ఫలితములతో పరిపూర్ణ సంతృప్తిని చెందుదురు. పునర్నిర్మాతలను రాజకీయ సిద్ధాంతులన్నచో అట్లు కాదు. వారు గావించు కార్యముయొక్క జయాపజయములు కేవలము భవిష్యత్తునుబట్టి నిర్ణయింపబడవలసి యున్నవి. అనగా వారిని స్వాప్నికులందురు. జనసామాన్యమును సంతోషపెట్టు నీతి వారిది కాదు. పైనున్న 33 కోట్ల దేవతలను సంతృప్తిపరచవలెనని వారు యత్నింతురు. ఏది సాధ్యమో దానిని మాత్రమే అవలంబింపరు; ఏది దుస్సాధ్యమో దానిని కోరుచుందురు. తత్కాల ప్రతిష్ఠను వారు విసర్జింతురు. కాన వారు బోధించు బోధనలను, వారు ఉపక్రమించు సిద్ధాంతములను, వీటివలన వారికి గలుగు ఉత్కృష్టతను వీరి తరువాతి తరమువారు మాత్రమే గ్రహింప గలుగుదురు. చిరకాలముమీద పరిశోధించినచో రాజకీయ సిద్ధాంతియు, కార్యాచరణధురంధరుడునుకూడ ఒకరే అయి యుండవచ్చును. ఈ ఉభయపదవులును ఏకీభవించిన కొలది ఇట్టివారు ఎదుర్కొనవలసిన అభ్యంతరములు కూడ హెచ్చుచుండును. వీరి భావములను కొలదిమంది మాత్రమే గ్రహింపగలరు. వీరి జీవితము యావత్తూ ప్రేమ, అసూయ అను విరోధగుణముల మధ్య నోలాడుచుండును. వీరి సహచరులు వీరిని గ్రహింపక వీరి కార్యక్రమమును నిరోధించుచుందురు. వీరి తరువాత వచ్చువారు వీరి కార్యమును క్రమముగా గ్రహించి వీరి బోధనలను ఆచరింతురు.

ప్రపంచములో ధర్మము చెడిపోయినప్పుడెల్ల తాను అవతరించి దుష్టులను శిక్షించియు, శిష్టులను రక్షించియు లోకపవిత్రతను గావింతునని చెప్పియున్న శ్రీకృష్ణుని వాక్యము కేవలము మన బుద్ధికి ద్యోతకము కానట్టియు, భౌతికప్రపంచమునకు దురవగాహమైనట్టియు సిద్ధాంతముకాదు. ఇది మన అనుభవములో మనము చూచుచున్న నిరంతర సత్యమే. సృష్ట్యాదినుండి అవతారపురుషు లుద్భవించి ఎప్పటికప్పుడు ప్రపంచమునందు పేరుకొనియున్న దుష్టగుణములను పారద్రోలుటకు యత్నించిరి. వీరందరును కేవలము తత్వవేత్తలుగాక కార్యాచరణమందు నిమగ్నులై వున్నవారని కూడ తెలుసుకొనగలము. బుద్ధావతారము తప్ప తక్కిన అవతారములన్నియు ప్రాపంచిక ప్రవృత్తియందు నిమగ్నులై వున్నవారే కాని, నివృత్తి నవలంబించినవారు కాదు. కేవలము బుద్ధుడు మాత్రము తన రాజ్యమును, భార్య బిడ్డలను, సంసారమును వదలి తత్వాన్వేషణముకొరకు దేశదేశములు తిరిగి చివరికి జ్ఞానసిద్ధి పొందెనని వినుచున్నాము. తరువాత అవతరించిన మహాపురుషులలో గాంధీమహాత్ముడు ఎన్నతగ్గ పురుషుడని ఒప్పుకొనక తప్పదు. వీరి సిద్ధాంతములు అనాచరణీయము లనవచ్చును; ప్రాపంచిక విషయములకు దూరము లని విమర్శింపవచ్చును. కాని ఈయన యందు ఒక గుణవిశేషము మాత్రము కనబడుచున్నది. అట్టి విషయము జనసామాన్యమునకు తెలిసిన విషయమే కాని దైవికదృష్టివల్ల గోచరము చేసుకొనగలిగే యోగులకుమాత్రము తెలిసెడి విషయముకాదు. గాంధీ నాలుగు ధర్మములను, నాలుగువర్ణములను సమన్వయము చేసిన మహాసంధానకర్త. తాను బ్రహ్మచారిగావుండి విద్య నభ్యసించి, గృహస్థుడై పిల్లలను కని సంసారగోష్ఠిలో వుండి ధనార్జనచేసి పిమ్మట వానప్రస్థమును అవలంబించి భార్యాసమేతుడై వుండి, దేశసేవపేర తాను ఆర్జించిన సర్వమును త్యజించి సన్యా

సిద్ధిని ప్రపంచ సంస్కరణకు పూనుకున్న మహాత్ముడని అందరును ఒప్పుకొనెదరు. మరియు వీరు వైశ్యకులము నందు పుట్టి చివరకి పూర్వపు బ్రహ్మర్షులవలె సర్వ ప్రాణులకును సత్యమును బోధించుచు, దేశమంతకును ఏకైకవీరుడైన రక్షకునివలె మిత్రులయొక్కయు, శత్రువులయొక్కయు ప్రాణములను అహింసాయుతమగు నూతనక్షాత్రధర్మముచే రక్షించుచు దేశముయొక్క బలమును పెంపొందించి బీదవానికి అన్నవస్త్రములు అందజేయవలెనను ప్రేమధర్మమును దేశమున కార్యాచరణలోనికి తెచ్చిన మహానాయకుడనికూడ లోకవిదితము. మన సన్యాసులవలె గిరి, పురి, తీర్థ, సాగర, ఆశ్రమ, భారతి, వన, అరణ్య, పర్వత, సరస్వతి అను బిరుదములను ధరించక గాంధీమహాత్ముడు సంసారమనే సుడిగుండములో మునుగుతూ! తేలుతూ, ఈదుతూ తానును ఇతరులను మునిగిపోతున్నవారిని తేల్చుమార్గము యోచించు అవతారపురుషుడు. పూర్ణపురుషుడు కాకపోవచ్చును కాని ధర్మమును సంరక్షించు మహానాయకుడని చెప్పగలము. గాంధీగారి మతము ఏవిధమైనదని మనము యోచించునప్పుడు ఆ మతముయొక్క వివరములు ముందుగా తెలుసుకొనుట వుచితము; ఆవశ్యకముకూడాను. భవిష్యత్తు ఎంతో దూరమున వుండి అగమ్యగోచరమగు కాలము గాదు. నేటికి రేపు భవిష్యత్తు; నేడు వర్తమానము. రేపు భవిష్యత్తు అయితే తెల్లవారేసరికి రేపు వర్తమానము అగును. మరునాడు ఏమి జరుగునో మనకు తెలియదు. కనుక ఉత్తరక్షణము భవిష్యత్తు అని భావించుట వుచితము. దేశమునందలి పరిస్థితులు ఎట్లు పరిణమించునో గోచరమగుటకు కొన్ని తార్కాణములు సన్నిహితములైనవి కలవు. గాంధీగారియొక్క నాయకత్వమును శిరసావహించిన కాలమును చూచినాము; శిథిలముచేయ యత్నించిన కాలమునుకూడ చూచినాము. 21 సం. ల నుండి వారియొక్క కీర్తి, యశస్సులు దేదీప్యమానముగా వెలుగుచుండెను. 1922-వ సం. ఫిబ్రవరి నెలలో బార్డోలీ తీర్మానానంతరము ఉద్యమము ఉపసంహరింపబడిన తరువాత ప్రభుత్వమువారు వారికి 6 సం.ల ఖయిదువేసి 2 సం. లు అయినపిమ్మట విడుదలచేయునప్పటికి మబ్బు కప్పిన సూర్యుడు మబ్బునుంచి తిరిగి బయటకు వచ్చినప్పుడు వుండుమాదిరి వారి తేజస్సు వెలుగుచుండెను. కాని 1924- సం.లో వ్యతిరేకబలములు వృద్ధియై, తమ సిద్ధాంతములకు ప్రతిఘటన గాఢముగా వుండుట చూచి మొదట్లో తన సిద్ధాంతములను పునఃస్థాపన చేయుటకు యత్నించియు పిమ్మట ఆయత్నమును వదులుకొని దాసు, నెహ్రూలతో రాజీపడి, కాంగ్రెసు కర్తవ్యములను విభజించి నిర్మాణకార్యక్రమమును తాను చేతబట్టి, పార్లమెంటరీ కార్యక్రమమును వారికి వదలివేసెను. పిమ్మట పార్లమెంటరీకార్యక్రమము నిష్ప్రయోజనమని 1929 లో నెహ్రూగారు గమనించుటచేత సత్యాగ్రహమును పునరుద్ధారణ చేసి యిర్విన్‌తో రాజీపడి గాంధీ - ఇర్విన్ ఒడంబడికవల్ల తన యశస్సును అప్రతిమాన ప్రతిభగలదానినిగా చేసుకొనగల్గెను. కాని 1932-33 లో మరల కారుమబ్బులు గ్రమ్మి తిరిగి ప్రచ్ఛన్న యశస్కులు కావలసివచ్చెను. 1937 లో జరిగిన ఎన్నికల ఫలితముగా కాంగ్రెసుయొక్క అంతరంగిక శక్తి ప్రపంచమునకు వెల్లడికాగా గాంధీగారి నాయకత్వము తిరిగి ప్రకాశింపదొడగెను. 1940-41 సంవత్సర వృత్తాంతములు మన కళ్లయెదుట నున్నవే. ఈ స్వల్ప కాలములోనే పూనాసభలో సత్యాగ్రహోద్యమము సంక్షేపించదలచుట, బొంబాయిసభలో తిరిగి పునరుద్ధరణచేయుట, మొన్న వార్ధాసభలో తిరిగి ఉపసంహరింపజేయుట మొదలైన నిమ్నోన్నతములు కనబడుచుండెను. ఇప్పుడు పలువురు ప్రశ్నించుచున్నది ఏమనగా, గాంధీ మతముయొక్క భవిష్యత్తు ఎట్లుండును అని. ఇది ఊహచేత కల్పింపవలసినట్టి గాని, జ్యోతిషముచేత సూచనచేయగలిగినట్టిగాని విషయముకాదు. కావున చరిత్రాంశము లైన, వివిధావతారపురుషుల యొక్క జీవితములు వారియనంతరము ఏ విధముగా ప్రాపంచికచరిత్రలో ప్రధానమైనవో ఒకసారి సింహావలోకనము చేసిచూచినచో గాంధీగారి భవిష్యత్తుకూడ ఈ విధముగానే వుండెదని గ్రహించవచ్చును.

శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, బుద్ధుడు మొదలైనవారు తమతమ కాలములందు చరిత్రను నూతనవిధానముగా మార్చి ధర్మగ్లాని గలిగినప్పుడు ధర్మస్థాపన పునః చేయ యత్నించి తాము ప్రపంచములోనికి వచ్చి

నప్పుడు వున్న స్థితికంటె ప్రపంచస్థితిని ఎక్కువ సౌభాగ్యవంతముగను, నీతివంతముగను చేసి వారు అవతారములు చాలించినారని మనము చదువుతున్నాము. ఇంకను శ్రీరాముడు కేవలము భగవత్స్వరూపుడని భారతదేశములో హిమాచలము మొదలు కన్యాకుమారివరకును అందరును ఆరాధించుట మనము చూచుచున్నాము. ఉత్తర హిందూస్థానమునందు శ్రీరాముని పేరు విని ఆవేశపూరితులగుదురు. అయోధ్యలో రామునియొక్క నామోచ్చారణ నిరంతరము జరుగుచున్నది. గాంధీగారి ప్రార్థనలో "జయ జయ రాం, సీతారాం" అనే పలుకులను వినుచుందుము. వీనియొక్క ప్రభావము నేటికిని నిర్మలముగ ప్రపంచ చరిత్రయందు ప్రకాశించుచున్న విషయము ఎల్లరును ఎరిగినదే. బుద్ధుడు ఏ 2500 సంవత్సరముల క్రిందటనో జీవించి రాజ్యమును, కుటుంబమును త్యజించి జ్ఞానము సంపాదించిన సన్యాసియైనను ఈ రోజువరకు ఆయనకీర్తి నిష్కళంకముగ వెలుగుచున్నది. గాంధీగారి కీర్తికూడ భారతదేశపు చరిత్రయందు చిరస్థాయిగ వుండునట్టి కీర్తిగాని తత్కాలపుది కాదు.

ఈ విషయమును యింకను విపులముగా చర్చించేముందు మనము వారియొక్క మతమును, సిద్ధాంతములను కొంచెము పరిశోధింతము. వీరిమతము ప్రకారము స్వాతంత్ర్యము జాతికిభిన్నమైనటువంటి విషయములను తెచ్చి కూర్చుటచే జరిగిన నిర్మాణముగాక లోపలనుండి పుట్టుకొనివచ్చిన ఆత్మవికాసముగా వుండవలెను. ఇదియే వీరి ప్రథమసిద్ధాంతము. రెండవది: ప్రతివారును వారి ఒక కార్యక్రమమునందు నిమగ్నులై వుండవలెను. స్వాతంత్ర్య మనగా యితరులయొక్క మెరుగును భంగపరచునట్టి ప్రవృత్తి కాదు. కేవలము తనయొక్క బాగు కొరకే పాటుపడెడునేది ఒకవిధమైన దొంగతనము, [illegible], [illegible]న్నప్రుచోరే యని వారినమ్మిక. ప్రజాసామాన్యము వీరియొక్క నీతిని ప్రయోగములుగా (Experiments) పరిగణించుచున్నారు. రేగడిమట్టి కుమ్మరిచేతిలో ఎన్ని స్వరూపములు దాల్చగలదో అన్ని స్వరూపములను అతిసౌందర్యముగను, అతి సమర్థతతోను ప్రజాసామాన్యమను మట్టితో కూర్చుటకు వీరికి శక్తిగలదు. ఇట్టి ప్రజల సేవ చేయుటకు ఎట్టి త్యాగమైనను అనవసరము కాజాలదు. ప్రజలకు, ప్రజాసామాన్యమునకు విద్యావ్యాపకము గావింపవలెనన్న వారి సాంఘిక పరిస్థితులను బాగు చేయుట వలననే అట్టి విద్యావ్యాపకము చేయగలము గాని మరొకవిధముగా, అనగా కేవలము చక్షురక్షరసంయోగముకల్ల చేయజాలము. ఇట్టి సేవాతత్పరతవలననే వారియొక్క ఆర్థికపరిస్థితులు బాగుపడి వారియొక్క జాతీయ విజ్ఞానము పెంపొందింపబడగలదు. యిట్టి జాతీయసంస్కారము సగము పనులవలన నెరవేరదు. ప్రజాసామాన్యముయొక్క ఆత్మను రక్షించవలెనన్న యిందుకు విరుద్ధకరముగ ఏయేఅజ్ఞానములు వారిని అవరించుకొనివున్నవో వాటి నన్నిటిని నిర్మూలనము చేయవలెను. ఇందుకు పరాయి ప్రభువులచే స్థాపింపబడిన పార్లమెంటరీ పద్ధతులు విరోధకరములు. అందుచేత అట్టి పార్లమెంటరీపద్ధతులను కొంతకాలము నిలిపివేయవలెను. పరాయి రాజ్యమువలన ఏర్పాటైన కోర్టులను, కవున్సిళ్లను, కాలేజీలను, స్థానిక సంస్థలను బహిష్కారము చేసి జాతీయ ఆత్మగౌరవము పెంపొందింపవలెను. కేవలము మతసంస్కారము చేయుట వీరి యుద్దేశ్యము కాదు. మతవిషయ మనగా ఉదారభావములను, నీతిభావములను కేవలము మతవిషయమునందే కాక అనుదినాచరణయందును, రాజకీయ జీవితమునందును, ఆర్థిక సందర్భములందును, సాంఘిక జీవనమునందును వర్తింపజేసి జాతియొక్క సమష్టిజీవితమును ఉత్కృష్టము చేయుట వీరియొక్క ప్రధాన లక్ష్యము. ఇట్టి ఉద్యమమును జయప్రదముగా జరుపుటకు లక్షలకొలది జనము వీరికి అనావశ్యకము. వేలకొలదికూడ అవసరము లేదు. నూర్లకొలది వున్నచో చాలును. కాబట్టి వారు చెప్పిన విషయమునుబట్టి నిర్దుష్టమైనట్టి, నిష్కళంకమైనట్టి త్యాగశీలురు వచ్చుచో తమ ఉద్యమము ఎక్కువ జయప్రదమై వుండెడి దని వారు చెప్పెదరు. సంఖ్యలు నాకు బరువుగా వున్నవి, గుంపులు జాస్తియైనకొద్ది నా యుద్యమముయొక్క పరిశుద్ధత తగ్గుచున్నదని ఆయన మొర. గాంధీగారి పద్ధతులలో తాత్కాలికమైన విషయ మేది? అహింసా పద్ధతులమీద వివాదములన్ను పరిష్కరించవలె ననుట

తాత్కాలికమా? అట్టిచో హింసాపద్ధతులు శాశ్వతములా? హింసమీద ఆధారపడిన అంతర్జాతీయవిషయములు బీజమునుండి వృక్షమూ, వృక్షమునుండి బీజమూ ఎవరి పోషణా లేకయే అరణ్యమునందు నిరంతరము వ్యాపించుచున్నట్లు అక్కడి వాతావరణపరిస్థితులవలన తమంతట తామే కార్యకారణ సంబంధము గలిగి యుద్ధమువిమ్మట శాంతి, శాంతినుండి యుద్ధము ఒకదానికొకటి కారణమై తన తోకను తను వేటాడు నక్కవలె గిర్రున తిరుగుచున్నవిగాని గమ్యస్థానమెన్నడును నిర్ణయించుకొననూ లేవు, పొందనూ జాలవు.

కాబట్టి ఏనాటికైనా ప్రపంచములోని అంతర్జాతీయవివాదములనండి, లేక ఒకజాతిలోని అంతశ్శాఖావిభేదము లనండి యివన్నియు అహింసాపద్ధతులవలన, క్షమవలన, సహనమువలన కోపమును, కక్షను, అక్కసును చంపుకొనుటవలనను, దయా ప్రేమలను పెంపొందించుటవలనను నిర్ణయింపబడగలవు. వీటిమీద ఆధారపడినటువంటి గాంధీ మతము చిరస్థాయిగా వెలుగు తారాజ్యోతి కలిగియుండునుగాని తాత్కాలికముగా వెలుగు చమురుదీపమువంటిది గాదు.

పోనీ, సిద్ధాంతములను వదలివేద్దాము. భౌతిక ప్రపంచములోని కార్యాచరణకు దిగుదాము. వీరి పనులలో ఏది తాత్కాలపుది? ఏది చిరస్థాయి కాజాలనిది? ఏదేశమువారికి కావలసిన అన్నము, బట్ట ఆ దేశమువారే నిర్మించుకొనవలెననుట తాత్కాలపు విషయమా? మనము పర దేశములమీద ఆధారపడివుందమని చెప్పువారెవరైనా కలరా? అట్లు ఆధారపడినంతకాలము మనము మన సప్లైదారులకు విపత్తు వచ్చినప్పుడల్లా ఆ విపత్తుయొక్క దెబ్బ తింటూనేయున్నాము. ఈనాటి స్థితి చూడండి. బట్ట, నూలుయొక్క గతి ఏమైనది? ప్రత్తి కొనువారు లేక, నూలుబట్ట పంపువారు లేక మన దేశీయులు దిగంబరులుగా వుండవలసినదేనా, లేక వారు పెట్టిన ధరకు కొనవలసినదేనా? మన దేశము స్వయంసంపూర్ణము, స్వావలంబనము ఎందుకు కాకూడదు? స్వయం సంపూర్ణ మనగా యావత్తురాజ్యమునకూ సరిపోయే వస్తుసామగ్రి దేశములోనే ఉత్పత్తి అగుచున్నదన్నమాట. స్వావలంబనము ఏకుటుంబమున కాకుటుంబము తమకు వలయు అన్నవస్త్రములను తాము పొందు ఏర్పాటు చేసుకొనివుండుట. ప్రతిమనిషికిని, ప్రతికుటుంబమునకును 4 యకరముల భూమి, 4 రాటములు వుండి కవ్వము, రాటము నిరంతరము యింట్లో ఆడుతున్నచో దారిద్ర్యమన్న వస్తువు లేదుకదా. ఇంక కావలసిన దేమిటి ప్రజలకు? వసతి ఒకటి మిగిలియుండును. వసతిని ఉష్ణదేశములో ఎక్కడపడితే అక్కడ చేసుకొనవచ్చును. నాలుగు ఆకులు, రెండు కొమ్మలు ఏర్పాటు చేస్తే వసతి యగును. కాబట్టి, సర్వజనులకును అన్నము, బట్ట, వసతి వుండవలెనని చెప్పుసిద్ధాంతము తాత్కాలికము కాదుగదా!

అటులనే చేతిపనులను పెంపొందించి సాధ్యమైనంతవరకూ ప్రతిమనిషికిని పని కల్పించి యంత్రసామగ్రిని తగ్గించవలెనని గాంధీగారు చెప్పుటలో ఉద్దేశ మేమి? ఒక బియ్యపుమర పెట్టినట్టయితే రోజుకు 600 బస్తాలు దిగుబడి యగుననుకొనుడు. ప్రతి బస్తాబియ్యము దంచుటకు ముగ్గురు ఆడవాండ్రు కూలి చేయుటవలన 12 మందిని పోషించవచ్చు ననే లెక్కనుబట్టి 600 × 12 = 7200 మందికి కలుగవలసిన పోషణ ఏ యాభైమంది కూలీలకో మాత్రము కలిగి ఏ 200 వందల మందికో మాత్రము అన్నము ఏర్పడి మిగిలిన 7000 మందికి ఉపవాసము గలుగచేయుట జరుగుచున్నది. ఒక ఊరు వెళ్లినప్పుడు ఒక హరిజనుడు ఒక ప్రశ్న అడిగినాడు: "ఏమయ్యా, కొందరికి మేడ లున్నాయి, కొందరికి గుడిసెలుగూడ లేవు. వీటికి కారణము ఏమి" అని. "ఏమిటి కారణము? మీరే కారణ" మని చెప్పినాను. "మీరు మర బియ్యం తింటూవున్నంతకాలము, మరపంచదార, మరపిండి, మరపప్పు, మిల్లుబట్ట ఉపయోగించుచున్నంతకాలము యిప్పటి వసతులకు ఎక్కువగా మేడలు మిద్దెలు కట్టించుటకు అవకాశములు బొత్తిగా లేవు. మీరు మీకు బియ్యము దంచటమువలన, పిండి విసరుటవలన, బెల్లము వండుటవలన, పప్పు ఆడుటవలన, కాగితము చేయుటవలన, బట్ట నేయుటవలన వచ్చు కూలినంతను బుద్ధిపూర్వకముగా,

చేతులారా పోగొట్టుకొని సుడిసెలకుకూడ గతిలేకుండా వున్నారు గదా. ఈస్థితికి మీరే కారకులు కాకపోతే ఎవరు కారకులు ? తెలియక చేసినా మనవచ్చును. దూరదృష్టి లేక చేసినా మని అనవచ్చును. కాని కారకులు మీరే" యని నేను చెప్పవలసివచ్చినది. గ్రామోద్యోగములను పెంపొందించుటవలన గ్రామములలో పనిపాటులు ఏర్పడి గ్రామస్థుల దారిద్ర్యము తగ్గనుటకు సందేహము లేదు.

ఇంక గాంధీమతములో ఇతరభాగము లేమి ? హిందూ మహమ్మదీయఐక్యత, సంఘసంస్కరణము. మహమ్మదీయులు మన దేశమునకు వచ్చినారు. 1000 సం. లైనది. వారియందు మనకు, మనయందు వారికి పరస్పరద్వేషము పోయి పరస్పరసహనము, పరస్పర మిత్రత ఏర్పడినట్టయితే దేశములో ఐక్యత పెంపొంది ఉభయులకును శత్రువైన మూడవవారిని మనము స్వాధీనము చేసుకొని వుండడనుదుముగదా ! ఈ విషయమై మనము కొంతత్యాగమునకు సంసిద్ధముగా నుండవలెనని గాంధీగారు చెప్పినచో అందులో పొరబాటు ఏమైనా వున్నదా ? ఉభయులకును అభిప్రాయ భేదములు, వైమనస్యములు సమసిపోయినప్పుడు అట్టి త్యాగమునకే ఆవశ్యకమేమీ వుండజాలదు. కాబట్టి శాశ్వతమైన పొత్తుగా, పొందుగా వుండు కార్యమనుచున్నది.

ఇంక అస్పృశ్యతా నివారణ. అది చేయకున్నచో మన జాతి ఎటులు జాతీయతను పొందగలదు ? గాంధీగారి ఈ తత్వమంతయు ఆర్థిక, సాంఘిక, నైతిక, ఆధ్యాత్మిక సంస్కరణలను చేయుటకు ఉద్దేశింపబడినది. ఆర్థికముగా ఖద్దరుద్యమమును ఏర్పాటుచేసినారు. సాంఘికముగా హిందూ మహమ్మదీయ సమస్య, మరియు అస్పృశ్యతా నివారణ. నైతికముగా మద్యపాన నిషేధము. ఆధ్యాత్మికముగా సత్య అహింసల వ్యాపకము. అస్పృశ్యతావిషయమై యిది శాశ్వతమైన సంస్కరణ యని వేరే చెప్పనక్కరలేదు. ఇంక మిగిలిన విషయము మద్యపాన విషయము. దానినిగూర్చి యిచ్చట ముచ్చటించవలసిన జరూరు ఎంతమాత్రమును లేదు. ఇది మంత్రివర్గముద్వారా కార్యాచరణలోనికి వచ్చినది. ఇది వివాదప్రపంచము నుండి తొలగి కార్య ప్రపంచములోనికి వచ్చిన సంస్కరణము.

కాబట్టి గాంధీమతముయొక్క భవిష్యత్తు ఎంతకాలము వుండునని ప్రశ్నించుట అనావశ్యకపు చర్చ.

ఇంక నొక విషయముమాత్రము గలదు. అహింసా తత్వము రాజకీయపరిపాలనయందు ఎంతవరకు అవలంబింపగలము?

## III

రాబోవు స్వరాజ్యమునందు సేన లుండునా, ఉండవా ? రాజధాని పరిపాలనయందు పోలీసువారుందురా, ఉండరా ? ఈ ప్రశ్నలు సామాన్యముగా గాంధీగారి అహింసాతత్వయుతమగు నూతన రాజ్యాంగ విధానమును గూర్చి లోకులు—ముఖ్యముగా విమర్శకులు—ప్రశ్నించుచున్నారు. ఈ రెండు ప్రశ్నలు మాత్రమే ఏల వేసెదరు ? నేరముచేసినవారిని శిక్షించడ మనగా అర్థమేమి ? బలవంతముగా పట్టుకుని, కాళ్లుచేతులు విరిచికట్టి, లేదా సంకెళ్లు వేసి, ఇద్దరు కానిస్టేబిల్సుచేత వారిని ఖైదుకుపంపి, అక్కడి వార్డర్ల లాటీల పాలు చేసి సాయంత్రం 4½ గంటలకే తిండి పెట్టి 5½ మొదలు ఉదయం 6 వరకు బందిఖానాలో ఉంచడము హింసయా, అహింసయా? కోర్టులో వ్యాజ్యము వేసి సాక్షిసమన్లు పంపి, తెమ్మన్న కాకితములు తేకపోయినా, రమ్మన్న వేళకు రాకపోయినా ఖైదు, జరిమానా శిక్షలు విధించడమూ, డిక్రీ అయిన తరువాత బాకీదార్లు సొమ్ము ఇయ్యకపోతే ఖైదులో పెట్టడమూ, స్థిరఆస్తి పట్టుకుని, లేక చెంబు చాట బయట వేసి అమ్మివేయడమూ హింసయా, అహింసయా ? ఈవిషయమనసే రాజ్యాంగ పరిపాలనలో అన్నిశాఖలున్ను— ఒక్క పోలీసుశాఖ అన నేల, ఒక్క సైనికదళ మననేల— హింసాయుతమగు దండనము మీద ఆధారపడియున్నవి. ఇట్లుగా గాంధీగారి తత్వమును, మతమును రాజ్యాంగముయొక్క అనుదిన చర్యలతో పోల్చి పరిశోధించినచో రేణువంత అయినా ఆయనతత్వమున్ను, మన రాజ్యాంగ పద్ధతులున్ను కలి

యవు. అందుచేతనే ఆయన ఆస్తిని కూర్చుట దొంగతనమనిన్ని, అపరిగ్రహధర్మమెల్లరును అవలంబింపవలెననిన్ని, సాయంత్రము భోజనమునకై పావుసేరుబియ్యము దాచుకొనువాడు దొంగతనము చేయుచున్నాడనిన్ని, స్వార్థముకొఱకు పాటుపడుట దొంగతనము, దారిదోపిడీలతో సమానమనిన్నీ చెప్పుతారు. 1908-వ సం॥లో వ్రాసిన 'హింద్ స్వరాజ్య'మందు ఈవిషయములన్నీ విపులముగ చర్చింపబడ్డవి. ఈరోజున క్రొత్తగా తెలియచేయబడు విషయ మెద్దియు లేదు. ఆబోధనలు కేవలము తత్త్వవేత్తయొక్క హితబోధనలు. ఈరాజీలు భౌతికప్రపంచమునందు అనుదినమూ నిర్వహింపబడు కార్యక్రమమునకు అనివార్యలక్షణమగు ఇచ్చిపుచ్చుకోవడము లని గ్రహింపదగును. రోగమునకు మందు ఇచ్చినపుడు ఎక్కువ బాధాకరమగు లక్షణమును నివారింపవలెనని రోగి కోరును. వైద్యుడు రోగనిదానముగావించి మూలసూత్రముల ననుసరించి యథావిధిగా చికిత్సజరుపును. రోగము అచిరముగా గాని, అసలేగాని కుదుర్చుటకు వీలు లేనిచో, పైపైలక్షణములకు ఉపశాంతిమార్గములను వెదుకును; అవలంబించును. రాజకీయవైద్యుని కర్తవ్యము కూడ నిట్టిదే. ఏవైద్యునినైనను లాయర్లు వచ్చి క్రాసుపరీక్ష (అడ్డసవాళ్లు) వేస్తే ఒక్కనిమిషమైనా ఆవైద్యుడు తాళుకోజాలడు. రాజకీయవైద్యునిగతికూడ అట్టిదే. అహింసనుండి హింసామార్గము ఒకసారి ఆశించుటవల్ల రంగులఅద్దముల గొట్టములోని నమోనాలు మారినట్లు మారజాలదు. క్రమముగా లక్షణములు మారవలసియుండును. అహింస ఒక పరమావధి కాదు—ఒక మార్గము, ఒక దిక్కు. అహింస ఒక గమ్యస్థానము కాదు— ఒక గతి. అహింస ఒక సిద్ధి కాదు—ఒక సాధనము. అహింస ఒక ఫలితము గాదు—ఒక యత్నము. ఇట్టి దిక్కు, మార్గము, గతి, సాధనము, యత్నములను బోధించు బోధ గాంధీమతము. ఇది చిరస్థాయిగ నుండునది. కాని నేటి వర్తమానములోను, రేపటి భవిష్యత్తులోను అంత్యముకనదికాదు. ఇది ఒక అక్షరాభ్యాసము. ఒక నూతిలోని బురదను పూడిక తీయడమువంటిది. ఇంటి మరమ్మతు. ఏటేటా వల్లె వేయుటవంటిది. పొలమునకు మూడేండ్లు కొకసారి పెంట కట్టడమువంటిది. విశ్వవిద్యాలయములలోని విద్యాధ్యాపకమువంటిది. దేవాలయములలోని వేదఘోషవంటిది. దీని ఆద్యంతములు మానవునకు అగోచరములు. దీనికి భూతభవిష్యత్తులు లేవు. వర్తమానము మాత్రమే కలదు.





[కథానిక]

# [illegible]

= శ్రీ 'కరుణకుమార' =

౧

రెండువేల రూపాయలు !

వంద కాదు, రెండు వందలు కాదు - ఇరవై వందల రూపాయలు !!

రెండువందల పదిరూపాయల నోట్లు!!!

అన్నీ సరికొత్తనోట్లు. వందేసి వందేసిగా కట్టిన రెండు కట్టలూ ముడి అయినా విప్పలేదు. బైండు చేసిన పుస్తకాల్లాగు — అబ్బా! — ఆ రెండు కట్టలూ చేతిలో పెట్టుకుని చూచుకుంటే ఎంత ముచ్చటగా వున్నాయని చెప్పను. అన్నివందల సరికొత్తనోట్లు ఒక్కసారి నేనెన్నడూ నాచేతుల్లో పెట్టుకున్న భాగ్యం నాకు కలగలేదు. బ్యాంకినుండి యింటికి వచ్చేవరకూ దారిపొడుగునా ఆ నోట్లవైభవం చూసి మురిసిపోవడంతోనే సరిపోయింది నా బ్రతుకు. నోటు అంటే ఒట్టి కాగితంముక్క అని యీసడిస్తారు కాని, కాగితం అయితే ఏం? ఆనోటుకాగితానికి పట్టిన దశ యితర కాగితాలకి పట్టుతుందా? మనుష్యులలో భాగ్యవంతుడి ముఖాన్న ఉండే కళ దరిద్రుని ముఖంలో వుంటుందా? పశువుల్లో ఆంబోతుకు పట్టిన దశ దుక్కిటెద్దుకి యెక్కడినుంచి వస్తుంది? భగవంతుని సృష్టిలో ఈ తారతమ్యభేదం, యీ హెచ్చు తగ్గులు, యీ ఎగుడు దిగుడులు జీవంకలిగిన చరాచర ప్రాణికోటిలోనే వున్నాయని అనుకొనేవాణ్ణి. కాని ఆసరికొత్తనోట్లు — అచ్చుకొట్టిన నోట్లు అచ్చుకొట్టినట్లుగా ఆ రెండు కట్టలూ చూచే సరికి, కాగితప్రపంచంలో యీ నోటు కాగితం మానవప్రపంచంలో కనిపించే జమీందారు వంటిది కాబోలు ననిపించింది నాకు. పదిరూపాయల కాగితానికే యింత శోభ, ఇంత కాంతి, ఇంత సౌందర్యం, ఇంత జమీందారీఠీవి వుంటే ఇక యాభై రూపాయల కాగితానికీ, వందరూపాయల కాగితానికీ, వెయ్యి, పదివేల రూపాయల కాగితానికీ యెంతకళా, ఎంత కాంతీ వుండివుండాలి! ఎప్పుడైనా—నా చేతుల్లో లేకపోతే పోయింది – యితరులచేతుల్లో నైనా సరే వెయ్యిరూపాయల కరెన్సీనోటు యెట్లా వుంటుందో ఒకసారి చూడాలని నాకు యెన్నాళ్ల నుండో కోరిక వుండేది. కాని మహారాజుల దర్శనంలాగే దాని దర్శనం కూడా నా కళ్లకు కరువైపోయింది. అటువంటిది రెండు వేలరూపాయల విలువగల రెండు వందల పదిరూపాయల నోట్లు ఒక్కసారి నా చేతుల్లో పడినప్పుడు యిక నా సంతోషం ఎట్లా వుండాలి ?

అబ్బా! ఒకటవ తేదీ వచ్చి, నెల తిరిగి మళ్లీ నెల పెట్టేసరికి రెండువేల రూపాయలా! అట్లాటి నెలలు పండ్రెండు గడిచి, జనవరినెల ఒకటవ తేదీ వైపు వెనక్కి తిరిగి చూసుకుంటే 12 రెండ్లు 24 వేల రూపాయలా! ఓ, వీటమ్మకడుపు కాల! ఇట్లా పది ఏళ్లు కళ్లు మూసుకుని, ఒక్కసారి కళ్లు తెరిచేసరికి పది 24 లు 240 వేల రూపాయలా! నానాకాలం ముందు బయలు దేరే మిడతలదండులా వృద్ధిపొందుతుంది కాబోలు యీరూపాయల దండు! భగవంతు డిచ్చిన ఆయుర్దాయం సరిగావుండి ఒక పదకి యింకోపదేళ్లు బ్రతికి బాగుంటే మరో రెండున్నర లక్షరూపాయలూ కళ్లచూశా డన్నమాటేకదూ.

ఎందుకూ-ఆయనా సంపాదిస్తున్నాడు, నేనూ సంపాదిస్తున్నాను. చెప్పుకుంటే సిగ్గు! ఆయనా బి. ఏ. ప్యాసయినాడు, నేనూ బి.ఏ. ప్యాసయినాను. ఆయనా

పదిఏళ్లనుంచి ఉద్యోగం చేస్తున్నాడు, నేనూ పదిఏళ్లనుంచి ఉద్యోగం చేస్తున్నాను. ఎంతచదువు చదివి, ఎన్నాళ్లు ఉద్యోగం చేసి ఏం క్రియ? యిప్పటి కింకా 48½ రూపాయల జీతమే కాని 50 అని అయినా చెప్పుకోతగిన యోగ్యత పట్టలేదు యీ జాతకానికి. "మీ కేమిస్తారండీ" అని ఎవరన్నా అడిగితే అటు నలభైకాక, యిటు ఏభై కాక నలభై ఎనిమిది రూపాయల ఎనిమిది అణాలని చెప్పుకోడానికి ప్రాణం చచ్చిపోతుంది.

అయినా ఆయనగారికి నెలకి రెండు వేల రూపాయల జీతమని చెప్పుకోగా వినడమే కాని ఒక్కనెలైనా ఆయనకి వచ్చే జీతంరాళ్లు నా చేతులతో నేను బ్యాంకిలో బిల్లు మార్చి తీసుకుని వచ్చిన భాగ్యం కలగలేదు. ఏ విషయమైనా చెవులతో వినడందారి వేరూ, దాన్నే ప్రత్యక్షంగా కళ్లతో చూడడందారి వేరూను.

నేను యీ హెడ్డాఫీసుకు ట్రాన్సుఫరు అయి వచ్చిన ఈ ఏడెనిమిది నెలలుగా నెలతిరిగి ఒకటవ తేదీ వచ్చే సరికి పదిమంది గుమాస్తాలలో ఎవరో వొకరు జీతాల బిల్లులు బ్యాంకికి తీసుకుని పోవడం, బిల్లు మార్చి డబ్బు తీసుకుని రావడం జరుగుతూ వచ్చింది. ఈ నెల ఎట్లా తగిలిందో, బిల్లులుమార్చే డ్యూటీ నాకు తగిలింది. బ్యాంకికి పోయి ఆఫీసరుజీతాల బిల్లూ, ఆఫీసులో పని చేసే పదిమంది గుమాస్తాలూ, పన్నెండుగురు జవాన్ల బిల్లూ—ఈ రెండు బిల్లులూ మార్చి పైకం చేతులో వేసుకుందును గదా, ఆఫీసరు బిల్లు రెండువేలరూపాయలకీ రెండు సరికొత్తనోట్ల కట్టలు చేతి కందిచ్చి, గుమాస్తాలబిల్లు ఏడువందల యిరవై అయిదురూపాయల పది అణాలకీ ఖింజువలె ఎక్కడో పాతవీ, నలిగినవీ, చిరిగిపోయినవీ, అయిదేసి రూపాయల నోట్లూ, రూపాయనోట్లూ లెక్కపెట్టి నా మొఖాన్నకొట్టాడు ఆ బ్యాంకు షరాబు. ఆఫీసులో పనిచేసే గుమాస్తాల దరిద్రమంతా ఆ నోట్ల మొఖాన్నే తాండవిస్తోంది. వాటిని ఎంచనైనా ఎంచకుండా లుంగచుట్టి, ఎకానమీ లేబిలు ఊడబెరికిన ఒక పాత కవరులో కుక్కి నాకోటు ఎడమతట్టు జేబులో పారేసుకున్నాను. ఆఫీసరు రెండువేలరూపాయల నోట్ల కట్టలూ నా మురికిచేతులతో ముట్టుకుంటే మైలపడిపోతాయని, జేబురుమాలు చేతులకి కప్పుకుని దానిలో నోట్ల కట్టలు కట్టి కళ్ల కద్దుకుని, దారిపొడుగునా వాటి శోభ చూసి ఆనందించుకుంటూ ఆఫీసుకొచ్చాను. వచ్చి ఆఫీసరు చేతుల్లో ఆకట్టలు నా చేతులారా పోయవలసివచ్చే సరికి ప్రాణం కటకటలాడింది నాకు.

ఎర్రటి ఎండలో కాలికి చెప్పులూ, నెత్తికి గొడుగూ అయినా లేకుండా నడిచివెళ్లి తెచ్చాను కదా! తెచ్చినందుకు థాంక్సు అయినా చెప్పకుండా—ఆకలి భరించలేక కట్టల్లో నోట్లు నేను ఏమయినా తిని దిగ మ్రింగా ననుకున్నాడు కాబోలు ఆమహారాజు—నన్ను దీపం శెమ్మెలాగ అట్టనే నిలబెట్టి, నోటిలోని వుమ్మి వేలికి తడిచేసుకుంటూ రెండు వందల నోట్లూ ఒక్కొక్కటే ఎంచుకోడం పూర్తి అయిన తరువాత నన్ను పొమ్మని తలవూపాడు ఆ ఆఫీసరు.

సాయంత్రం నాలుగున్నర కొట్టేసరికి నా నలభైఎనిమిది రూపాయల ఎనిమిదణాలలో రవిన్యూ స్టాంపు క్రింద ఒకణా, ఆఫీసులో మంచినీళ్లు పోసిన బ్రాహ్మడి కిచ్చే జీతంకింద రెండణాలూ, క్లబ్బుచందాకింద పావలా, తురకజవాన్ల పీర్లపండగ మామూలుకింద రూపాయీ—మొత్తం రూ. 1-7-0 లు ఒగపట్టుకుని మిగిలిన రూ. 47-1-0 లు నా చేతిలో పెట్టాడు మానేజరు. ఆఫీసుకు వచ్చిన రోజు సాయంత్రం 6 గంటల వరకూ కుర్చీకి అంటి పెట్టుకుని కూర్చుని పనిచేసే ఆఫీసరు జీతంరాళ్లు చేతిలో పడేసరికి, ఆమొత్తం బ్యాంకిలో తన పేర డిపాజిటుచేసి భద్రపరచుకోడానికో, లేక వెంటనే వెళ్లి తన రెండువేలరూపాయల ప్రమోజకత్వమూ భార్యచేతుల్లో సమర్పించుకోడానికో గాని ఆరోజుమాత్రం 3 గంటలకే లేచి యింటికి చక్కా పోయాడు. ఆఫీసుగంట ఎప్పుడౌతుందా అని గడియారంవంక చూసుకుంటూ కూచుని పెద్దముల్లు 12 మీదా, చిన్నముల్లు 5 మీదా నిలిచిపోగానే నేనూ ఆఫీసుపని నిలిపి యింటికి బయలుదేరాను.

రోజూ తిరిగే మనిషినే నేను ఆరోజు కూడాను. రోజూ వేసుకునే చొక్కాలే ఆరోజుకూడా





వేసుకున్నాను. కాని ఆఫీసు విడిచి బయటకి వత్తును కదా, నన్ను చూసుకుంటే నాకే అసహ్యమయింది. మెషిను చెమటకి చినిగిపోయిన ఓపెన్ కాలరు కోటూ, చేతిమణికట్టుదగ్గిర కుట్టు విడిపోయి కోటు చేతుల్లోనుంచి బయటికి తొంగిచూసే - వుండిపోయిన నాలుగు కల తెల్లషర్టూ, రోడ్డుదుమ్ముకి మాసిపోయిన ధోవతీ, మెడలో మాసికలుపడ్డ పెద్దాపురం పాత కిఖ్కా, కాళ్లకు మూడుసార్లు రిపేరు చేయించిన పడమటి దేశపు మోటురకం చెప్పులూ-ఏమిటి యీ అవతారం! నాకే వెగటు పుట్టిస్తుంటే యిక యితరుల కెట్లా వుంటుంది? జేబులో పెట్టిన నల్భై ఏడురూపాయల ఒకఅణా ఎంతమంది కని పంచిపెట్టడం? దినవెచ్చం తెచ్చుకొనే ప్రావిజను స్టోరుదగ్గిరనుంచి, సుబ్బలింగశెట్టి దగ్గిరనుంచి యింటి అద్దె, మందులషాపు, డాక్టరు బిల్లు, కాఫీహోటలు, చాకలి, మంగలి, అబ్బాయి చదువుకోసం తెచ్చుకున్న పుస్తకాల మొత్తం అందుకో వగైరాల వరకూ నాలో నేను నోటిలెక్క వేసుకుంటే బకాయి బాకీలతో కూడా తేలిన నూట పది రూపాయల బాకీ పట్టీలోనూ నా రూ. 47 లు ఏవిధంగా రేషనింగు పెట్టడం? యింకా కోఆపరేటివు సొసైటీ బాకీ అట్లాగే నిలిచిపోయింది. వాళ్లు దావా చేస్తామని నోటీసులు కూడా పంపించారు. 15-వ తేదీ వచ్చేసరికి పిల్లవాడికి కట్టవలసిన స్కూలు ఫీజు డబ్బులు వెతుక్కునేటప్పటికి తలప్రాణం తోకకి వస్తోంది. పైగా పొదుపిల్లలు - కుచేలుని సంతానం లాగ! ముప్పై ఏళ్లు నిండని నాకు యీ దరిద్ర గొట్టు సంపదకూడా ఏల? ఎడపిల్లకి కడుపులో లీవరం? తల్లిదగ్గర శరీరంలోని రక్తమాంసాలతోపాటు పాలు కూడా ఎండిపోతే కడసారిపిల్లని బ్రతికించడానికి నోతవాలసొచ్చేలా? ఏమిటబ్బా యీ జీవనం? ఎన్నాళ్లబ్బా యీ బ్రతుకు? మున్నూట అరవై రోజులూ అహోరాత్రిళ్లు చెమట వూడ్చి పనిచేస్తే ఏడాదికి రూపాయో, రూపాయిన్నరో జీతం ప్రమోషన్ చేయడానికి కంట నీ రెట్టుకుంటారీ అధికారులు. నత్తనుల్లి నడకలా నాజీతం కాళ్లీడ్చుకుంటూ ఎప్పటికి ఓ వంద రూపాయల వరకూ డేకడం? నూరోనంబర్ల అంకె గమ్య స్థానం చేరేలోపల ఈఘటానికి నూరేళ్లూ నిండిపోతే ఎట్లా? దినగండం నూరేళ్లాయుర్దాయంలాంటి యీ ఒడుదుడుకు రోజుల్లో ఏ ప్రమాదంవల్ల యీ కొస్త వూపిరి వూడిపోకూడదు? హఠాత్తుగా యీ ఒక్క ఆధారమూ పడిపోతే వెనక భార్యా బిడ్డల గతి ఏంగాను?

రోజూ మామూలుగా ఇంటికి పోయేదారి, పరధ్యానంలో తప్పి, మనసు మనసులో లేక, నల్లత్రాచువంటి తారురోడ్డున తారట్లాడుతూ, వెనకతట్టు హారన్ చప్పుడు చేస్తున్నప్పటికీ, నేను నడిచే చోటు నుంచి తప్పుకోవడం మరచిన కారణంచేత, మోటారు కార్లు వాటి అంతట అవే నన్ను తప్పించుకొని విసురు మీద వెళ్లిపోతున్నవి. మైలూ, మైలున్నరా నడచివచ్చి ఉంటానుగాబోలు. ముందు ఎదురుగ్గా కార్పొరేషన్ కుప్ప లెత్తిన మోటారులార్రీ, వెనకతట్టు పరిగెత్తే రాయల్ మెయిలు ఎర్ర మోటారుబండీ, ఇరుకురోడ్డులో ఒకటికొకటి ఎదురై నన్ను ఇరుకున పెట్టేసరికి, లైఫ్ ఇన్సూర్యెన్సులో భీమా చేయని ప్రాణాలతో జీవించే నేను, నలిగి చక్కాపోతానన్న భయంచేత తటాలున ప్లాటుఫారం ఎక్కి తప్పించుకొన్నా, తలెత్తి చూస్తును గదా — పక్కనే ఉంది మునిసిపల్ పార్కు. శీతకాలంపొద్దు. అయిదున్నర దాటిందో లేదో, వృద్ధాప్య దశలో పచ్చగా పండిపోయిన సూర్యుడు, చలికి తాళకోలేక, అప్పుడే పడమటింట్లో దూరి కాళ్లూ చేతులూ ముడుచుకొని ముసుగుతన్నాడు. సాయంత్రంపూట ఆరుబయట తిరగడం భరించుకోలేని సుకుమార గాత్రులు - పార్కుదగ్గర చేరిన జనం అప్పటికప్పుడే చెవులకు గుడ్డలు కట్టుకొని ఇంటిముఖం పట్టించారు. యుద్ధంలో దిగిన శత్రువుని పాపపంకిలంలాంటి నల్లటి తొడుగు కప్పిన పవిత్రమైన విద్యుద్దీపం, కాంతి తగ్గి, శోభని ముడుచుకుని తనకింద తానే వలవెళ్లాడుతోంది. దీపంక్రీనీడని చెట్టు. చెట్టుఆకులకింద రీయిన్ ఫోర్సుడ్ కాంక్రీటుబెంచి — ఏమిటో అనుకుతీసి అడుగు పెట్టలేని నిస్సత్తువ కలిగి బెంచీమీద కూలబడ్డాను. వంటికి చలీ తెలియటంలేదు, వేడీ తెలియటం లేదు. మెడ మీద సిల్కుచుట్ట చుట్టి తలకింద పెట్టుకుని శంకరా అంటూ కాళ్లు చాపి వెల్లికిలా పండుకున్నాను.

చెట్లఆకుల సందులోనుండి తెల్లటి మబ్బుతెర క్రమ్మిన ఆకాశం మైదానంలా కనుపిస్తోంది. దాహశాంతి చేసే చంద్రికాసరోవరాలు ఆమైదానంలో యింకా పొడ గట్టలేదు. రెండువేల రూపాయల నోట్లూ నాప్రాణా లను దెయ్యంలా పట్టుకుని వేధించివేస్తున్నయి.

రెండువేలు అక్కరలేదు, వెయ్యికూడా అక్కర లేదు, అయిదు వందలుకూడా వద్దనుకొందాం. 2000 లలో ఖరీదుచేస్తున్నా తీసివేసిన మొత్తమైనా నెలకి నే నీజన్మలో సంపాయించగలనా? నాతో సమంగా చదువుకొని నాకంటె ఎక్కువ ప్రయోజకత్వము లేని తోడి బి. ఏ. నా కాఫీసరయి నెలకి రెండువేలు సంపా యిస్తుంటే, నేను నలభైఎనిమిది రూపాయల సమా ప్తానై ఆయనకింద చేతులు ముడుచుకుని నౌకరీ చేసు కోనా? మరి ఆయన ఆనిశంగా పైకిరావడానికీ, నే నీక్రీనీడచీకట్లో చిక్కిపోవడానికి కారణమేమిటి? దినానికి పంచి పెట్టిన 24 గంటలలోనూ ఆఫీసుపని చేయ వలసిన గంటలు ఆఫీసరుకంటె నాకే యింకో రెండు గంటలు అదనంగా పంచిపెట్టారే. నేను చేసే పని పని కాదా? నా చేసిన పనికి విలువ లేదా? నా తెలివికీ, నాశక్తికీ, నారక్తానికీ విలలేదా?

ఈతారతమ్యాలు అదృష్టమనే అగోచరశక్తి కల్పిం చిన వైపరీత్యాలా? మనకి అదృష్టంలేదని వున్న దానితోనే తృప్తిపడి వూరుకోనా? తృప్తిపడి యిక వృద్ధికి స్వస్తి చెప్పకోనా? యింకా వృద్ధిలోకి రావా లని పడి దొర్లాడనా? అయితే కర్మ అనీ, పురుష ప్రయత్న మనీ, నిష్కామకర్మ అనీ అంటారేమిటి పెద్దలు? చేసినపనికి ఫలితం నాకు అందుబాటులో లేనప్పుడు యిక నా కీపని ఎందుకు? ఫలితం లభించక పోతే దుఃఖించడం మాత్రం ఒద్దంటారు. దుఃఖిస్తే వీళ్ల సొమ్మేం పోయింది?

మనస్సుకు ఊరట కలగలేదు. వేదాంతం తృప్తిని చేకూర్చలేకపోయింది. అమూల్యమైన జీవితాన్ని అదృష్టమనే సిద్ధాంతానికి అర్పణచేసి వూరుకో బుద్ధి కాలేదు యీఘటానికి. మానవశక్తిలో సాధ్యమైనంత పురుషకారం చేసి మా ఆఫీసరులాగే నేనుకూడా పైకి రావాలన్న ఆవేశం బయలుదేరింది. ఆయన్ని ఆద ర్శంగా పెట్టుకుని ఘట్టిగా కృషిచేసి కష్టపడి పని చేసినట్లయితే ధ్రువుడు వుత్తరలోకాన్ని సాధించినట్టు మనము రెండువేలరూపాయల స్థానాన్ని సాధించగల మనే విశ్వాసం బయలుదేరింది.

తటాలున లేచి కూచున్నాను. పార్కు చివర రేడి యో యింకా పాడుతూనేవుంది. చెట్లపైన చేరిన మబ్బుతునకలు మాయమై తళతళలాడే నక్షత్రాలు కని పిస్తున్నాయి. పొద్దుపోయింది. నాన్న యింకా రాలే దని యింటిదగ్గిర పిల్లలు దిగులుపడతారు. దారితప్పి దూరం వచ్చాను. తిరిగీ నడిచి యింటికి చేరేసరికి ఆల స్యమైపోయేలాగున్నది. ఒకటో తేదీ కాబట్టి బస్సు డబ్బులకోసం వెతుక్కోవలసిన పని లేకుండాపోయింది. అమాంతికరై బస్సు స్టాండువద్దగ్గర నాకోసమే అన్నట్టు హఠాత్తుగా నిలిచింది. ఇక డబ్బుకోసరం కక్కూర్తి పడటం పెద్దమనిషితరహా కాదని తలూపులున బస్సెక్కి లోపలికి మారాను. సీట్లన్నీ భర్తీ అయిపోయినందు వల్ల బస్సులో అదనంగా నిలబడ్డానికి పోలీసువారు లైసెన్సుయిచ్చిన ముగ్గురు మనుష్యులలో నే నొకణ్ణయి, బస్సు కదిలినప్పుడు తూలి మనుష్యులమీద పడకుండా, టాపుకు తగిలించిన తోలుబెల్టు పట్టుకుని, బస్సుచార్జి కట్టికూడా యింటికి చేరేవరకూ నిలబడటం తప్పింది కాదు నాకు. యింతేసూరయూ కూర్చోవడానికి చోటు దొరకనందుకు చింతించనా, లేక నడవడం తప్పినందుకు సంతోషించనా? ఏదీ నిర్ధారణచేసుకోలేని స్థితిలో బస్సు నిలిచేసరికి దిగి యిల్లు చేరుకున్నాను.

౨

ఆఫీసుపనిలో ఇదివరకుకంటె ఎక్కువశ్రద్ధా, దీక్షా చూపి, ఒళ్లువిరిచి పని చేయవలెనని ఒకవిధ మైన తీవ్రత లోపల బయలుదేరింది నాలో. ఆరు మూడ యినా, మూడు ఆరయినా ప్రమోషన్ సాధించి, సంపాదించితీరాలన్న పట్టుదల బలపడింది. అదివరకు రోజూ పదిన్నరగంటలకు ఆఫీసులో హాజరయి, సాయంత్రం అయిదు గంటలవరకూ పనిచేసి ఇంటికి వచ్చే అలవాటు తప్పించి, ఏరోజుపని ఆరోజు నిల

మొండా పూర్తిచేయాలన్న లక్ష్యంతో ఆరోజులాగా యథా ఉదయం కాఫీతీసుకోవడం తడవుగా ఆఫీసుకు పరిగెత్తి బల్లదగ్గర కూర్చునేవాణ్ణి. పొద్దున్నే, నేను వ్రాసుకొనే బల్లకీ, నా రికార్డు బీరువాకీ, తాళంచెవు లకీ, పిరాయిడ్డికీ, కలానికీ దణ్ణం పెట్టుకొని, అంగట్లో కోమటి గల్లా పెట్టె తెరచినట్లు, నాఆఫీసు తెరచేవాణ్ణి. నెలకి యాభైయిన్నర కూలిచ్చి మధ్యాహ్నం కారియరు భోజనం మనిషిచేత ఆఫీసుకే తెప్పించుకొని, సాయం త్రం 5 కొడుగదా, 6, 7 కొట్టి, గుమాస్తాలందరూ లేచి ఇళ్లకు చక్కా పోయిన తర్వాతకూడా, వాచరు వచ్చి తలుపులు వేసుకోవడం ఆరంభించేవరకూ కుర్చీని అంటిపెట్టుకొని అట్లనే తపస్సు చేసినట్టు చేస్తుండేవాణ్ణి. ఏరోజైనయినా, మాఆఫీసరు కాకపోయినా ఆఫీసు మానేజరయినా నేను ఆఫీసులో ఒంటరిగా కూర్చుని పనిచేయడం కళ్లారా చూస్తే చాలు—అనాడు నా కష్టం గమనించిన దేవత ప్రత్యక్షమైనట్టు గర్వపడి పోయేవాణ్ణి.

నెలలు గడిచిపోతున్నవి. సంవత్సరం గిర్రున తిరిగి వచ్చింది. బ్యాంకిలో వేసిన డిపాజిట్లకు వడ్డీలెక్క లూ, తాను సర్కారుకు కట్టిన ఇన్‌కంటాక్సుపద్దులూ సరిచూసుకొనే రోజులు ఆఫీసరుకి. ఈ పన్నెండు నెలలకీ అయిన అప్పు తేల్చుకొని గుండెలు బేజారెత్తే రోజులు నాకు. కాని మాఆఫీసులో నూరురూపాయల పోస్టులో పనిచేసే పాతగుమాస్తా ఒకడు ఏళ్లునిండి [illegible]సు అయిపోయి, రిటైరుకావలసిన తేదీ సమీపిస్తూ ఉండేసరికి ఆఖాళీలో నన్ను ప్రమోషన్ చేయకుండా అన్యాయం చేస్తాడా ఆఫీసరన్న ధీమాతో నేను పడు తున్న కష్టం కష్టంగానూ తోచలేదు, చేసిన అప్పులు అప్పులుగానూ కనిపించడంలేదు నాకు. క్రింది ఆఫీ సుల్లో ఇదివరకు పనిచేస్తుండినప్పుడు ఏవిధంగా పని చేసినా, ఏగుడ్డ వేసుకొన్నా, ఏవేషం వేసుకొన్నా సరి పోతూ ఉండేది. ఇప్పుడు సిటీలో హెడ్డాఫీసుకు ట్రాన్స్‌ఫరయి వచ్చిన తర్వాత పెద్ద ఆఫీసరుదగ్గర ఉద్యోగం కాబట్టి, పైకి వృద్ధిలోకి రాదలచిన గుమాస్తా అయినవాడు చిరిగిపోయిన చొక్కాలూ, కోట్లూ వేసుకొని ప్లీడరు గుమాస్తాలాగా తిరగడం దరిద్రపు తువు. అందువల్ల కొత్త బస్తీవేషం అనిపించేలాగు సూటూ, బూటూ, టై, కాలర్ వగైరాలు తగిలించి తిరగడం శ్రేయోదాయకమని నా శ్రేయఃకాములు కొందరు హితబోధ చేయడం మొదలుపెట్టారు. మరి, బి. ఏ. డిగ్రీని సాధించడానికైతే శరీరకష్టం ధారపోసి సాధించగలిగాను కాని ఈ నూతనవేషం సాధించ డానికి డబ్బెక్కడనుండి తేగలను? నేను కాలేజీలో చదువుకొన్నరోజుల్లో కట్టుకొనే గుడ్డలు లేకపోతే, తోడి స్నేహితుల దగ్గర పంచెలూ, చొక్కాలూ ఎరువు తీసుకొని కాలక్షేపం చేస్తుండేవాణ్ణి. అవి చిన్న తనంరోజులు కాబట్టి ఎట్లా సరిపెట్టుకొన్నా సరి పోయింది. ఇప్పుడు పెద్దవాణ్ణయి, కాస్తో కూస్తో ఉద్యోగం అంటూ చేస్తూ, బూటుకోసమూ, సూటు కోసమూ ఎవర్ని ముష్టెత్తడం? వేషం మార్చడంలో కూడా కొంత లాభం ఉండకపోదని నాకూ తెలుసు. అయితే అయింది, అయిన అప్పుల్లో ఇదొకటి అనుకొని, ముప్ఫయి రూపాయలు అప్పుచేసి మూడుసూట్లు కుట్టించి, ఆరు నెలలుగా సూట్లతోనే ఆఫీసుకు వెళ్లడం అలవాటు చేసుకొన్నాను.

కాని, నాకష్టం, నా తెలివి, నా వేషం ఆఫీసరుకు తెలియరావడం ఎట్లా? ఎంతకష్టపడి పనిచేసినా పదిమంది గుమాస్తాలలో నేను పదకొండోవాణ్ణయి పోతున్నానే కాని, ఆఫీసరుదగ్గరకు తరచు పోతూ వస్తూ ఉండడం, ఆయనతో చకాపికీగా నాలుగు ఇంగ్లీషు ముక్కలు మాట్లాడుతూ ఉండడం, ఎన్నడ యినా ఆయన సుముఖంగా కనిపించినప్పుడు మన ప్రమోషన్ సంగతి ప్రస్తావనలోకి తీసుకొనిరావడం— ఇట్లాంటి వేమీ జరగడంలేదు. మా ఆఫీసరుకు ప్రతి దినమూ ఆఫీసుకు వచ్చితీరాలన్న బదనాయమూ లేదు, అట్లా వచ్చే అలవాటూ లేదు. ఇక ఆయనకీ, మనకీ భేటీ జరగడం ఎప్పుడు? భేటీ జరక్కపోతే, ఈ నూరురూపాయల ఖాళీ ఎవరన్నా గద్దతన్నుకుపో యినట్టు తన్నుకుపోతే మనగతి ఏంకాను? అసలు మనలాంటి బి. ఏ. తన ఆఫీసులో కష్టపడిపనిచేస్తు న్నట్టు ఆయనగారికి తెలుసునో తెలియదో, మన సం గతి మానేజరయినా ఆయనతో ఎన్నడయినా ప్రస్తా

వనలోకి తెచ్చాడో, తేనేలేదో. నేను ఆఫీసరు దర్శనానికి వెళ్లితే అసలు నువ్వెవరని అడిగే స్థితిలోనే ఆయన ఉన్నట్టయితే, ఆయన్ని, మనం ఇంతగొప్పవాళ్లం అని తెలుసుకొనే స్థితిలోనికి తీసుకొనిరావడానికి ఇంకా ఎంతకాలం పట్టుతుంది? అంతకాలం వరకూ ఈఖాళీలూ, ఈ ప్రమోషన్‌లూ అట్టే కూర్చుంటాయా? అయ్య వచ్చేదాకా అమావాస్య నిలుస్తుందా? పోనీ, ఒకసారి ఆఫీసరు బంగాళాకు వెళ్లి నేను ఫలానా ఫలానా వాణ్ణనీ, చాలాకాలం ప్రమోషన్ లేక కిందపడి ఉన్నాననీ విశదంగా మన ప్రవర అంతా ఆయనతో మనవి చేసుకొంటే?

మనవి చేసుకోవడంలో తప్పూ లేదు, కష్టమూ లేదు. కాని మా ఆఫీసరుకీ, నాకూ నడుంగా మానేజరు ఒకడు వచ్చిపడ్డాడు. మానేజరు అనేవాడు ఆఫీసరుకీ, గుమాస్తాలకీ మధ్య—రెండుచేలకిమధ్య నీళ్లుపోయేటందుకు ఏర్పరచిన—తూరవంటివాడు. ఆచేలోనీళ్లు ఈచేలోకి రావాలన్నా, ఈచేలోవి ఆచేలోకి పోవాలన్నా ఈ తూరగుండానే పోవాలి. పక్కపక్కలుగా గాని, పైనుండిగాని త్రుళ్లిపడి వెళ్లినట్టాయెనా, ఆతూరకి ఆగ్రహం కలిగి, పట్ట పగ్గాలులేక పటాలున పగిలి చక్కాపోతుంది. దానితో మన అదృష్టభాండం కొస్తా బద్దలై ఊరుకొంటుంది. అందువల్ల గుమాస్తా లెవరయినా ఆఫీసరుని చూడాలనుకొంటే, మానేజరుగారితో ముందుగా మనవిచేసి మరీ చూడాలి. ఆయనకు తెలియకుండా నేరుగా ఆఫీసరుదగ్గరకు పోయినట్టు తెలిసెనా, ఇక ఆ గుమాస్తాకి మానేజరుచేతుల్లో ఆయువు మూడిందన్నమాటే! పరిస్థితులన్నీ పరిశీలించుకొంటే, అసలు మూలవిరాట్టు ఆఫీసరుకంటెకూడా ఈ ఉత్సవవిగ్రహం మానేజరువిషయమే గడ్డు ప్రశ్నగా తోచింది నాకు.

మరి మానేజరుని ప్రసన్నముఖుని చేయడం ఎల్లాగ? ఆయనప్రసాదం, ఆయనకరుణాకటాక్షం సంపాదించుకోలేకపోతే, తీరా ప్రమోషన్ కాలంలో మన సంగతి ఆయన సిఫార్సుచేస్తాడో చేయడో! ఇంట గెలిచి రచ్చగెలువుమన్నారు పెద్దలు. ముందు మానేజరు మెప్పు పొందడం చాలా అవసరంగా కనపడుతూంది. అవసరం మాత్రమే కాదు, అది చాలా కష్టమైన పనిగాకూడా కనిపించింది నాకు.

ఆ మానేజరు నాకు కొత్తవాడు. పాతపరిచయం నాకు లేదు. ఆయన అసలు గుమాస్తా పొజిషన్‌నుండే ఇంతకాలానికి మానేజరయి నెలకి రెండు వందల ఏభయి రూపాయల జీతం పుచ్చుకొంటున్నాడు. ఆయన్ని గురించి అనేకులు అనేకరకాలయిన వార్తలు చెప్పుతూ ఉంటారు. ఆయన అసలు ఆఫీసుపనికోసం కంటె, తన తెలివినీ, తన చాకచక్యాన్నీ ఆఫీసరు ప్రయివేటు పనులన్నీ తానే స్వయంగా చక్కజేసి ఆయన మెప్పు సంపాదించడంలోనే చూపుతాడని అంటుంటారు. పాత ఆఫీసరు మారి కొత్త ఆఫీసరు వస్తున్నాడనడంతోనే ఆయన ఆవచ్చే ఆఫీసరుకి బంగళా చూచిపెట్టడంలోనూ, ఆయనసామాను రైలుస్టేషనునుండి బంగళాకు చేర్పించడంలోనూ, బంగళాబూజు దులిపించి సున్నం కొట్టించి బాగుచేయించడంలోనూ, చెట్లమొక్కలకు నీళ్లు పోయించడంలోనూ తిరిగి సప్లయిచేసి కొత్త ఆఫీసరుని నిమిషంలో జేబులోవేసుకోగల శక్తిగలవాడని, మానేజరువిషయమై ఒక ప్రతీతి ప్రబలింది. అటువంటి మానేజరుని నేను జేబులో వేసుకోవడం ఎల్లా అబ్బా. కష్టపడి పదికి ఇరవయి కాగితాలు వ్రాయడం చేత నవును గాని, ఇల్లాంటి పనులు ఘుతరాయూ నాకు సరిపడనూ పడవు, నా చేత కానూ కావు.

వ్యవహారం గడ్డు వ్యవహారంలా కనిపిస్తోంది. నూరు రూపాయల ముసలి గుమాస్తా రిటైరు కావలసిన తేదీ సమీపించి టార్చిలైటు దీపంలా కళ్లల్లో పొడుస్తోంది. రిటైరు కాబోయే తేదీకి ఇంకా పదిపదిహేను రోజులు ముందుగానే ఆయనస్థానంలో మరొక మనిషిని నియామకం చేయడం జరిగిపోతుంది. ఈ ప్రమోషన్‌కోసరం ప్రాకులాడే నాబోటి ఇతర గుమాస్తాలు ఆఫీసరుదయ సంపాదించాలన్న దీక్షలో ఎవరి ప్రయత్నాల మీద వారు ఉంటున్నట్టు నా కప్పుడే ఆ నోటా ఆ నోటా చెవికివస్తూ ఉన్నవి. అదివరదాకా నాతో చనవుగా మాట్లాడి తిరుగుతుండే గుమాస్తాలు ఈ మధ్య నాతో కొంచెం కొంచెం ఎడమై, ఏదో పట్టిచ్చి మాట్లాడినట్టు గోచరిస్తున్నారు. 'మాచకో

చూడకన్నట్లు కాబోలు ననుకొన్నాను. రాబోయే ఖాళీ పోనివ్వకుండా సంపాదించాలన్న ప్రయత్నంలో, కొందరు గుమాస్తాలు ఆఫీసరుకు పెద్ద పెద్ద వాళ్లదగ్గరనుండి సిఫార్సు ఉత్తరాలుకూడా తీసుకొని వస్తున్నట్టు వార్తలు నా చెవిని పడుతూనే ఉన్నవి. ఒక గుమాస్తా జిల్లాజడ్జీ దగ్గరనుండీ, మరొకాయన ఆఫీసరు సెక్రటరీ దగ్గరనుండీ, ఇంకొకాయన ఆఫీసరు తోడల్లుడి దగ్గరనుండీ, వేరొకాయన ఆఫీసరు భార్య అన్నగారి దగ్గరనుండీ — వారి వారి శక్త్యానుసారం సిఫార్సులు సంపాదించి తీసుకొని వస్తున్నారని తెలిసింది నాకు.

ఆఫీసులో మూల మూలల ఏవో గుస గుసలు బలము పుంజుకొచ్చినవి. ఆశ్రయించే గుమాస్తాల రహదారీతో ఎడతెరపిలేక మా మేనేజరుగారి వీధివాకిలి రాత్రి పన్నెండు గంటలవరకూ మూతబడడం లేదని అనకొంటున్నారు. మా మేనేజరు శూద్రపక్షపాతి. కాబట్టి ఆ ఖాళీ శూద్రునికే తప్ప, ఇతర నాబోటి బ్రాహ్మణునికి రానివ్వడని ఒకానొక మిత్రుడు నాగుండెల్లో బాంబువుంచి చెప్పాడు. ఇంకా మా మేనేజరుని మంచి మాట చేసుకోవాలన్న ప్రయత్నంలో విఘ్నేశ్వర పూజలోనే ఉండిన నాకు, అప్పుడే ఆఫీసరునికూడా ఆకాశవట్టి మంగళం పాడేశారితర గుమాస్తాలని వార్తలు ఒక్కొక్కటే నా చెవిని పడేసరికి నా శరీరంలో వణుకూ, దడా పుట్టుకొనివచ్చినవి. మా ఆఫీసు ఒక కురుక్షేత్ర సంగ్రామరంగంగా మారిపోయింది. నూరురూపాయల ఉద్యోగసాధన సమరంలో హేమాహేమీ లెందరో ఒకరికి తెలియకుండా మరొకరు అనేకమార్గాలగుండా ఆఫీసరుకోటని ముట్టడి చేస్తున్నారు. భారతయుద్ధంలో శ్రీకృష్ణునిలాగా తన వాక్చక్రంచేత అన్ని పక్షాలవారినీ అరికట్టి పారేస్తున్నాడు మా మేనేజరు. నే నింకా విలువిద్యాభ్యాసంలోనే ఓనామాలు దిద్దుతుంటే, ఢంకా పగలగొట్టి జయభేరి మోయించేది ఎప్పటికి?

ఇక ఆలోచనలతో కాలయాపన చేసే రోజులు గడిచిపోయినట్లు తోచింది. ఒక్కసారి మా మేనేజరు దగ్గరికి స్వయంగా వెళ్లి, ఆయనతో అన్ని విషయాలూ మంచితనంగా, ఖచ్చితంగా అడిగేసి, నా విషయంలో ఆయన తగినసహాయం చేస్తాడో చెయ్యడో అనే విషయం తేల్చేసుకోవాలని నిశ్చయపరచుకొన్నాను. తెల్లవారి 8 గంటలకు ఆయన కాఫీ తీసుకొని కాలీగా పడకకుర్చీలో పండుకొన్న సమయం కనిపెట్టి నేను ఆయనింటికి వెళ్లి—

"నమస్కారం సార్" అన్నాను.

"ఏమిటి ఇట్లా వచ్చావు? కూర్చో" అన్నాడు.

"మీకు తెలియని విషయ మేముంది? మన ఆఫీసులో వచ్చేనెల నూరు రూపాయల పోస్టు ఒకటి ఖాళీ పడుతున్నది గదాండీ."

"అవునవును."

"మరి నేను ఎన్నాళ్లనుండో కనిపెట్టుకొని ఉన్నానుగదాండీ."

"నిజమే."

"తమరు నా విషయంలో కాస్త కనికరించి శ్రద్ధ తీసుకోవాలి."

"అట్లాగే."

"తమరు ఉపేక్షిస్తే నాకు ఈ ఛాన్సుదాటి పోతుంది."

"ప్రయత్నించుదాం."

"నేను ఆఫీసులో గుమాస్తా లందరిలోనూ సీనియరునిగదాండీ."

"అవును."

"బి. ఏ. ప్యాసయినాను."

"అట్లాగే."

"నేను ఇంగ్లీషు బాగా వ్రాయలేనని మీ కేమయినా అభిప్రాయమా?"

"అబ్బే—"

"కష్టపడి పనిచేస్తున్న వాణ్ణిగదాండీ."

"శెలవు రోజుల్లోకూడా వచ్చి పనిచేస్తున్నావు—నాకు తెలియదూ?"

"అధికార్ల దగ్గర ఎన్నడూ ఒక్కరిమార్కు లేకుండా ఇన్నేళ్లుగా పనిచేస్తున్నాను గదాండీ."

"అవును."

"ఇన్ని యోగ్యతలు ఉండికూడా తమరి అనుగ్రహం లేకపోతే ప్రయోజనమేమిటి చెప్పండి?"

"నా అనుగ్రహంతోసరం ప్రాకులాడుతావు — ప్రమోషన్ ఇచ్చేవాణ్ణి నేనాఏమిటి ?"

"అట్లా అనకండి తమరు. తమరుతలుచుకొంటే నాకీసారి సహాయంచేయగల సమయం."

"నేనొక్కమాట చెప్తాను విను. నువ్వు ఎంత కష్టపడి పని చేసినా, ఎంత తెలివిగలవాడి వయినా ఏమీలాభంలేదు. నా సిఫార్సులమీద ఆధారపడి ఉన్నా లాభంలేదు. ఆఫీసరు తురకవాడు. ఆయనకు నీ పనితోనూ, నీ తెలివితోనూ అవసరం లేదు. ఈ ప్రమోషన్‌కొరకు తలాఒక సిఫార్సుతెచ్చుకొని ఆఫీసరుని ఆశ్రయిస్తున్నారు గుమాస్తాలు. నువ్వూ అట్లాగే ఎవరిదగ్గరనుండిఅయినా ఒక సిఫార్సులెటరు తేగలిగితే, దానికితోడు నీవు సీనియరువనీ, కష్టపడి పనిచేసే గుమాస్తావనీ నేనుకూడా ఒక సమిధ తగిలిస్తాను.— తెలిసిందా?"

"నే నెవరిదగ్గరనుండి తేగలనండీ, సిఫార్సు?"

"అట్లా అంటే ఉపయోగంలేదు. ఇన్నేళ్లుగా కష్టపడి పనిచేయడం అంతా ఒకఎత్తూ, ఇట్లాంటి ఘట్టాలలో సిఫార్సులద్వారా ఆఫీసరుని లొంగకొట్టుకోవడం మరొకఎత్తూను"

"ఏమో. నాకేమీ నమ్మకం లేదు. అయినా ప్రయత్నించిచూస్తాను"

అని మానేజరుదగ్గర శలవుతీసుకొని బయటికి వచ్చాను.

రోడ్డుమీదికి వచ్చేసరికి నాప్రాణం ఉక్కిరిబిక్కిరయిపోయింది. ఊపిరితెప్పిరిల్లేసరికి మురికిగుంటల దుర్గంధం ముక్కుపుటాలను బద్దలుచేస్తోంది. ఈయన సాయం అపేక్షించి నేను వెళ్లితే ఎక్కడనో సిఫార్సులు తెమ్మంటా డేమిటి? ఎక్కడకు వెళ్లను? ఎవరి నాశ్రయించను ? ఇతరగుమాస్తాలు అంత గొప్పవాళ్ల దగ్గరనుండీ, ఆఫీసరు బంధువుల దగ్గరనుండీ జాబులు తెస్తే, ఆపని నావల్ల నవుతుందా? అసలు ఆఫీసరుకి పరిచయస్థులూ, స్నేహితులూ ఎవరోకూడా నాకు తెలియదే! ఎంత కష్టపడి పనిచేసినా, సిఫార్సు లెటరు లేనిది ప్రయోజనం లేదంటున్నాడు మానేజరు.

నాకు సుంకెల్లో రాయిపడింది. రాత్రి నిద్దరపట్టడం లేదు. ఇన్నాళ్లుగా పడిన కష్టం బూడిదను పోసిన పన్నీ రయిపోయేటట్టుగా వుంది. ఇతర గుమాస్తాలు ఏఉపాయాలమీద సిఫార్సులు తీసుకొని రా గలిగారో, అడిగితే అకిటుకు నాకు చెప్పుతారా?

ఏమీ పాలుపోవడంలేదు. జీవితంలో మనిషి పైకి రావాలంటే, ఆశ్రయింపులూ, సిఫార్సులూ చేతనయిఉండాలి కాబోలు. ప్రతీదినమూ ఇరవై నాలుగు గంటలూ తనక్రింద పనిచేసే గుమాస్తా యోగ్యతాయోగ్యతలు మరొకరి సిఫార్సులెటరు ద్వారా తెలియజేస్తేనేగాని ఆఫీసరుమనస్సుకెక్కని సంప్రదాయం కాబోలు. మరి నా తెలివీ, నాసమర్థతా, నా ప్రయోజకత్వమూ ఆఫీసరుమనస్సు కెక్కేటట్లు చేయగల పుణ్యపురుషులు నాకీ మహాపట్నంలో ఎక్కడ లభిస్తారు? నాకీ ప్రమోషన్ అయితే, వెద్దతిరపతికొండెక్కి వెంకటేశ్వర్లకి నెయ్యిదీపారాధన చేయిస్తానని మొక్కుకొన్నాను. కాళహస్తివెళ్లి ఈశ్వరుడికి అభిషేకం చేయిస్తానని మొక్కుకొన్నాను. సత్యనారాయణవ్రతం చేసుకొని, ప్రసాదం నోట్లో వేసుకొంటానని దణ్ణంపెట్టుకొన్నాను. కేదారేశ్వరవ్రతం చేసి పట్టుతోరాలు ధరిస్తానని ప్రమాణంచేశాను. ఎన్ని వేల్పుల నాశ్రయించి ఏమిప్రయోజనం? ఆఫీసరుకి ఒక్క సిఫార్సులెటరు ప్రసాదించలేని దేవుళ్లు ఎంతమందికి మొక్కి ఏమిలాభం ?

ఆదివారం ఆఫీసులేనందువల్ల ఏమీతోచక, ఇంట్లో కూర్చోనూలేక, పైన గుడ్డవేసుకొని బయల్దేరాను. ఎక్కడికి వెళ్లడానికీ స్థిరపరుచుకో లేకుండా ఉన్నాను. కాళ్లు ఏపక్కకి ఈడిస్తే ఆపక్కకి నడిచిపోతున్నాను. రోడ్డునబడి కాలు సాగిపోతోంది. పైరోడ్డులు మళ్లి, బైరోడ్డుల్లోకి ప్రవేశిస్తోంది ఘటం. బైరోడ్డుల్లోనుండి బైలేన్లల్లోకి కూడా లాగుతోంది

# హిందుస్థాన్ మ్యూచుయల్

## ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,

ప్రధానకార్యాలయము :—మచిలీపట్టణము

డైరెక్టర్ల బోర్డు కధ్యక్షులు :

డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు,

బి. ఏ. యం. బి. సి. యమ్.

పట్టాదార్లకు ఆకర్షణీయమైన భీమా పద్ధతులు

**పట్టాదార్లందరికీ గమనిక**

త్వరలోనే రు. 1,50,000 ల మూల ధనముతో ఎక్కువ బలవత్తరము చేయబడనున్నది.

మీ సొమ్ములభద్రత ద్విగుణీకృతము కాగలదు.

ఏజెంట్లకు ప్రత్యేక సదుపాయములు

| | |
|---|---|
| ప్రభుత్వ డిపాజిట్లు | 1,51,000 |
| అమలులోనున్నవ్యాపారము | 25,00,000 |
| భీమానిధి (షుమారు) | 1,17,000 |

---

భీమా అనుభవము కలిగి చురుకుగా పనిచేయగలవారు

ఏజెన్సీషరతులకు కంపెనీ ప్రధానకార్యాలయమునకు వ్రాసి తెలిసికొనవచ్చును.

మచిలీపట్టణము,
ది 6-3-1942.

తల్లాప్రగడ రామారావు,
జనరల్ మేనేజరు.

## ది మెటల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్, షొరనూర్.

(ప్రభుత్వసహాయము పొందుచున్నది.)

అత్యంతాభివృద్ధిపొందుచున్న జాతీయపరిశ్రమ. ఎస్టేటు టూల్సు, ఇంప్లిమెంట్లు, వ్యవసాయము, తోట పనిముట్లు, ఇనుపసామానులు, కట్లరీ మొదలగువాటిని తయారుచేసి సరఫరాచేయుటయందు ఈదేశమునను, ఆస్ట్రేలియా, తూర్పు ఆఫ్రికా, యఫ్. యం. యస్., కొలంబో, బర్మా మొదలగు విదేశములందును ప్రఖ్యాతి గడించినది. సైన్యము, దేశరక్షణశాఖ, లోకల్ బోర్డులు, మ్యునిసిపాలిటీలు, ప్లాంటరులు, ఇంకా అనేక ప్రభుత్వ శాఖలకు సరఫరాదార్లు. అత్యుపయోగకరమును అసామాన్యమునగు పరిశ్రమ. అభివృద్ధియగుకొలదియు అధిక లాభముల నిచ్చుచున్నది.

### డివిడెండు

ది 30-6-41 తో అంతమైన సంవత్సరమునకు డిక్లేరు చేయబడినది.
సాధారణ షేర్లమీద 3%
క్యూములేటివు ప్రిఫరెన్సుషేర్లమీద $6\frac{1}{2}$%

ఇంకను కొద్దిషేర్లు ఉన్నవి అమ్ముటకు పలుకుబడిగల ఏజంట్లు కావలెను. ఆంధ్ర దేశములో మా సామానులను అమ్ముటకు కూడ ప్రతినిధులు కావలెను.

పూర్తి వివరములకు ఈ క్రిందివారికి వ్రాయుడు:—

**ఎ. యన్. పొదువల్, బి. ఏ.,**
మానేజింగు డైరెక్టరు.,

## ది దిండిగల్ శ్రీ కన్యకాపరమేశ్వరి బ్యాంకు, లిమిటెడ్.

— స్థాపితము : 1930. —

బ్రాంచీలు :

| | | | | |
|---|---|---|---|---|
| దిండిగల్ | తంజావూరు ఈస్టునేట్ | విల్లుపురం | వల్లూరు (ఉ॥ ఆ॥) | ఈరోడ్డు |
| పలని | తిరువాడి | తిరుక్కోయిలూరు | చెంగల్పట్టు | పుదుక్కోట |
| తంజావూరు | తిరునల్వేలి | పన్రుట్టి | కుంభకోణం | గుడియాత్తం |

**రాజమండ్రి, మద్రాసు (8, గోవిందప్పనాయక్ వీధి.)** అన్నివిధములగు బ్యాంకింగువ్యాపారములును చేయబడును.
వివరములకు బ్యాంకుయొక్క ఏ ఆఫీసుకైనను వ్రాయగోరెదము.

బి. పట్టాభి చెట్టి, సెక్రటరీ అండ్ మానేజరు.



క్యాటలాగు ఉచితము.

## నారసింహా లేహ్యము

సువర్ణము, రజితము, సాలామిశ్రి, సఫేదామిశ్రి, రూమిమస్తకి, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు మొదలగువిలువగల వస్తువులచే తయారుచేయబడినది. బలముకలిగించుటలో అత్యుత్తమమైనది. మేహములు, నిక్కాక, నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగువాటిని ఖండించి బలమును, వీర్యవృద్ధిని, కాంతిని సంతానప్రాప్తిని కలిగించుటలో అమోఘమైనది. 2 డబ్బీలు చాలును. 20 తులముల డబ్బీ రు. 2-8-0; పోస్టేజి ప్రత్యేకము—

నోటు:—ప్రతి 20 తులముల లేహ్యమునందును రు. 2-4-0 ఖరీదుగల 3/4 తు॥ లోహాభ్రక సింధూరమునుగాని, అభ్రకసింధూరమును గాని, కలిపిపుచ్చుకొనిన మధుమేహాది సమస్తవ్యాధులను శీఘ్రముగా ఖండించి అత్యధికమైన గుణాధిక్యమును కలిగించును.

**పి. సి. ఏ. అండు కో, ఆయుర్వేద సమాజం** (పెరిదేపి, నెల్లూరు జిల్లా.)

కాలం. రెండో, మూడో, నాలుగో మైళ్లు నడిచినట్టు నడిచాను. పల్చని ఎండ పేరిన నెయ్యిలాగా చిక్కపడి శరీరానికి వేడెక్కిస్తోంది. ఆవేదనతో అసలే వేడెక్కిన మెదడు ఆచ్ఛాదనలేని తలమీద పడిన ఎండ తీవ్రతకు కుతకుత ఉడికిపోవడం ఆరంభించింది. ఈ ఉడుకు ఇట్లానే ఉడకబెట్టితే మెదడు కాస్తా కరిగి ఆవిరయి పారించి చక్కాపోయేలాగు కనిపించింది. బాంకిల్లో పెరిగిన ధనం వెచ్చించే మార్గాలు తోచక లక్షలు కర్చుపెట్టి వ్రరివ్రరిగా కట్టించుకొన్న పెద్ద బంగళాలూ, పెద్దకాంపౌండుగోడలూ ఎన్ని దాటించి పోతున్నానో నాకే తెలియడంలేదు. కాంపౌండు బయట ఇనపతలుపులగేట్ల దగ్గర గోడలమీద చెక్కిన ఖామందుల నామధేయాలు, రావు బహదూర్లు- దివాన్ బహదూర్లు ఎంతమంది నాకళ్లల్లో తిరిగి పోతున్నారో నేను చెప్పలేను. ఆహా! కోటికి పడగలెత్తిన లక్షాధికార్లా! సర్కారు అధికార్లా! తెల్లదొరలా! మోటారుకార్లమీదనే గాని బయటకు రాలేని రాణివాసపు భోగపురుషులా! ఒకానొక రావుబహదూరు ఆక్రమించుకొన్న ఆవరణ ప్రాకారపుగోడ ఈచివరి నుండి ఆచివరికి నడిచి రోడ్డుతిరిగేసరికి అర్ధగంటకాలం పట్టింది నాకు. అర్ధగంట కాదు, ప్రాకారం చుట్టూ గంటల తరబడి ప్రదక్షిణం చేయమన్నా చేస్తాను — ఈ రావుబహదూరు నావిషయమై మాఆఫీసరుకు ఒక్క సిఫార్సులేఖ వ్రాసి ఇవ్వగలిగితే.

ఆధారం దొరకలేదు. తెప్ప కనిపించడంలేదు. ఆచ్ఛాదన గోచరించడంలేదు. ఇంకా నడచివెళ్లు తున్నాను. గోడలమీద కనిపించే అడ్వర్టయిజుమెంటు బోర్డులన్నీ చదువుతున్నాను. ఇత్తడి ఫలకాల మీద చెక్కిన సువర్ణాక్షరములన్నీ పఠించుకొంటున్నాను. మూడురూపాయల ఉద్యోగం! మంచి ఛాన్సు. పోతే దొరకదు. ఒక్క సిఫార్సు కాగితం, ఒక్క మంచి మాట లభిస్తే...గరళంలా పనిచేస్తుంది.

చెమటపోసి, కాళ్లు అలిసి, నడుములు పీకుతున్నవి. ఇక నడవలేక పోతున్నాను. అశోకచెట్టు లాంటి మొదట్లో నాతనువు ఆనించి రవ్వంతసేపు నిలబడ్డాను. చల్లని పిల్లగాలి వచ్చి నన్ను మెల్లగా తాకింది. కళ్లు మూతలుపడి సేదదీర్చుకోడానికి క్రింద పేవుమెంటు మీదనే చతికిలబడ్డాను. అయిదు నిమిషాలు విశ్రమించి కళ్లుతెరచి చూశాను. ఎదురుగా కనపడింది 'రెడ్డి, బి.ఎ., బి. యల్., అడ్వకేటు' బోర్డు. ఆ పేరు చదువుకొనేసరికి నా పంచప్రాణాలూ లేచివచ్చినవి. ఏదో పట్టుగొమ్మ ఆధారందొరికినట్టనిపించింది. కొనవూపిరితో కొట్టుకొనే ఆశాజ్యోతి నూతనజీవనం పోసుకోవడం మొదలెట్టింది. లోకలుబోర్డులలో తాలూకాబోర్డులుండిన రోజుల్లో రెడ్డి తాలూకాబోర్డు ప్రెసిడెంటుగా ఉండినప్పుడు నాకు కొంతపరిచయం కలిగినవాడు. ఆ రోజుల్లో నేనంటే అభిమానం చూపుతూ ఉండేవాడు. ఆయన తాలూకాబోర్డు ప్రెసిడెంటు అయినప్పుడు పురజనులు జరిపిన అభినందన సభలో, రెడ్డిమీద వ్రాసిన పద్యాలు-నవరత్నాలు నేనే చదివి ఆనందింపజేసిన ఘట్టం తటాలున స్ఫురణకు తగిలింది. ఆయన యిప్పుడు పట్నంలో ప్రాక్టీసుపెట్టి బ్రహ్మాండంగా ఆర్జిస్తున్నాడని యిదివరకే విన్నాను. కాని ఎప్పటి తాలూకాబోర్డులు, ఎప్పటి స్నేహం, ఎప్పటి పరిచయం — అప్పుడే పదేళ్లయినట్టుంది, ఆనాటి రెడ్డికీ, యీ నాటి నాకూ మధ్య ఎన్నెన్ని ప్రవాహాలో ప్రవహించి గట్లు తెగ్గోసి మమ్మల్ని చాలా ఎడంచేసినట్టు కనిపిస్తోంది. నేను వెళ్లి పలకరిస్తే నడుంగా అడ్డుకున్న కాలప్రవాహం దాటి నాపిలుపు ఆయనగారి చెవిని బడుతుందా అసలు?

సంకోచాలు పెట్టుకొనే సమయం కాదు. గేటుతలుపు తెరచుకొని లోపల దూరాను. ఆదివారం అయినందువల్ల టెర్రస్సుమీదనే కుషన్ కుర్చీలో కూర్చుని పైపు పీలుస్తున్నాడు రెడ్డి.

"గుడ్‌మార్నింగ్ సార్" అన్నాను.

"హల్లో! ఎప్పుడువచ్చావు? కూర్చో" అన్నాడు.

కూర్చున్నాను. నా యోగక్షేమాలు అడిగాడు. నే నింకా నలభైయెనిమిది రూపాయల గుమాస్తానే అయినందుకు కొంత సానుభూతి చూపాడు. మా ఆఫీసరుకీ, తనకీ చాలా పరిచయం వున్నదనీ,

ప్రతిదినమూ క్లబ్బులో కలుసుకొంటూ ఉంటారనీకూడా ప్రస్తావనవశాత్తూ చెప్పాడు. ఆహా! ఇకనేం? వెదకబోయిన తీగ కాళ్లకు చుట్టుకొన్నదని అంటారు, ఇదే కాబోలు. నాకు కొంతధైర్యం కలిగింది.

"ఇప్పుడు మీవల్ల కొంత వాక్సహాయం కావలసి వచ్చాను—" అన్నాను.

"ఏమిటి చెప్పు" అన్నాడు.

"మా ఆఫీసులో నూరురూపాయల పోస్టు ఒకటి ఖాళీపడిందండీ. నేను అందరిలోనూ సీనియరునీ!"

"వెరీ గుడ్! ఛాన్సు కొట్టేశా వన్నమాట."

"మీ సహాయం లభిస్తే అంతపనీ చేశా నన్నమాటే!"

"నీ ప్రమోషన్‌కీ, నా సహాయానికీ సంబంధమేమిటి?"

"మీరు ఒక్క సిఫార్సు లెటరు మా ఆఫీసరుకిస్తే—"

"ఏమనీ?"

"నేను తమరికి తెలుసుననీ, తెలివిగలవాడిననీ, బాగా పనిచేయగల గుమాస్తాననీ, ప్రమోషన్‌కి అర్హుడననీ—"

"ఈ సిఫార్సులంతా వొట్టిభ్రమలంటే నమ్మ. నే చెప్పుతాను విను. క్లబ్బులో మేము కలుసుకొంటున్న మాట నిజమే. కాని ఈ ఆఫీసర్లు ఉన్నారే వొట్టి—ఇది అయినవాళ్లోయి. వాళ్ల అవసరం ఉంటే మన మేంపని చేయుమన్నా చేస్తారు. లేనప్పుడు వినిపించుకోరు. అదిగాక మనబోటివాళ్లదగ్గర తాను సిఫార్సులు స్వీకరించే ఆఫీసరుగా దని అనుకోనేలాగు ప్రవర్తించి, చివరికి ఉపకారానికి బదులు అపకారం చేసినా చేసేవాడే మీ ఆఫీసరు"

"చిత్తం—"

"అయినా, ఆయనదగ్గర పనిచేసే గుమాస్తా విషయమై ఇతరులు సిఫార్సు చేయడం ఏమిటి?"

"అదేనండీ ఇందులో ఉన్న చిక్కు."

"అదిగాక మీ ఆఫీసరు మహమ్మదీయుడయినందువల్ల ఆయనగారికి కులాభిమానం కూడా ఉంటుందేమో."

"అల్లాంటి అభిమానాలను భేదించడానికే కదాండీ తమబోటివాండ్ల సిఫార్సుపత్రాలకోసరం మేము తిరగడం."

"ఆ లెటరయినా ఏ మహమ్మదీయుడి దగ్గర నుండి అయినా తీసుకొనిపోతే మంచిదేమో."

"మరి అల్లాంటి మహమ్మదీయ మహానుభావుడు నాకెక్కడ లభిస్తాడో అదికూడా మీరే శెలవివ్వండి."

"నే నొక్క ఉపాయం చెప్తాను విను."

"చిత్తం—"

"మీ ఆఫీసరుఇంటిదగ్గర వాకిట్లో బెంచీమీద కూర్చొని ఉంటాడు, ఎప్పుడూ ఒక ముసలిసాహేబు—తెల్లటి గడ్డం, నెత్తికి తెల్లటి లబ్బీటోపీ పెట్టుకొని ఉంటాడు. నువ్వు ఇక ఎవ్వరిదగ్గరకీ వెళ్లక తిన్నగా ఆసాహేబుదగ్గరకి వెళ్లి అతన్ని మంచిమాట చేసుకో. అన్ని పనులూ వాడే చక్కజేస్తాడు."

"ఎవరండీ ఆసాహేబు? మా ఆఫీసరుకీ, అతడికీ ఏమయినా బంధుత్వం ఉన్నదా?"

"బంధుత్వం లేదు. వాడెవడో మీ ఆఫీసరు కుటుంబాన్ని పెద్దల హయాంనుండీ ఆశ్రయించుకొని కనిపెట్టుకొని ఉన్నాడట. కాని వాడు అసాధ్యపు ముండావాడు. వాడిమాట అంటేమాత్రం మీఆఫీసరు అడుగుదాటడు – నాకు తెలుసు. వాణ్ణి లోగట్టుకొంటివా నీపని అవుతుంది. మాబోటి పెద్దవాళ్లుగూడా అవసరమైనప్పుడు వాడిద్వారానే మీఆఫీసరుదగ్గర అన్నిపనులూ చేయించుకొంటారు."

"ఆసాహేబు పేరు?"

"పేరు నాకూ తెలియదు. పేరెందుకు? ఏ ఘడియని వెళ్లినా వాడు ఆఫీసరుగారి వరాండాలో బెంచిమీద ఎప్పుడూ హాజరు."

"మరి నేను వెళ్లి అడిగితే అతడు నామాట విని సహాయం చేస్తాడన్న నమ్మక మేమిటి?"

"వాణ్ణి కాస్త లోగట్టుకోవాలి"

"లోగట్టుకోవడం అంటే ఎట్లా?"

"వాడి భక్ష్యం వాడికి పడవెయ్యాలి"

"ఏమాత్రం ఇవ్వాలేమిటండీ?"

"ఎంతో లేదు. ఒక్కపూట సారాయి ఖర్చు క్రింద అర్ధరూపాయి డబ్బులు వాడిచేతిలో పెట్టితే చాలు—వొళ్లు తెలియదు వాడికి. నువ్వు ఏపని చేయమంటే ఆపని చేస్తాడు."

ఆహా! ఇంత చౌకలో లభించే కల్పవృక్షం పెరట్లో పెట్టుకొని దేశం అంతా తిరిగితిరిగి వేసారిపోయినందుకు నాకే సిగ్గయింది.

సెలవుతీసుకొంటానని లేచి బయటకు వచ్చాను. ఏదో బరువు నెత్తిమీదనుంచి వదలిపోయినట్టనిపించింది. తలంటి నీళ్లుపోసుకొన్న రోజు తేలికయినట్టు హాయనిపించింది దేహం. ఇక మనస్సుకు కలిగిన ఉత్సాహం నేను చెప్పలేను. బంగళాగోడల మీది క్రీపర్లోని ఎర్ర డోలుపుష్పాలు నన్నుజూచి అప్పుడే అభినందించడం ఆరంభించాయి. ఇన్నాళ్లుగా ఆఫీసరుదగ్గర పనిచేస్తున్నా ఆఫీసరువాకిట్లో ఉండే ఒక్క తురకసాహేబు నాలాంటిగుమాస్తాల అదృష్టరేఖలు సరిదిద్దగల సమర్థుడనే రహస్యం—ఈ కీలకం నా కిదివరకు తెలియనందుకు ఎంతసిగ్గు, ఎంతసిగ్గు! ప్రపంచంలో బ్రతక నేర్చడం తెలిసిఉండాలి. ఎప్పుడెప్పుడు ఏయేమనిషిని ఏయేవిధంగా ఉపయోగించుకోవాలో నేర్చుకోవాలి. నిజంగా జీవితంలో ఇదొక కళ. కళ గాదు, విజ్ఞానం. ఛా! ఇంతమాత్రం రహస్యం తెలుసుకోలేక ఎంత తికమకలుపడ్డాను! మరి ఈరహస్యం మా మేనేజరుకూడా తెలిసినట్టు లేదే! తెలిస్తే ఆనాడు నేను వెళ్లి అడిగినప్పుడు ఈ విషయం నాతో ఎందుకు చెప్పలేదు? ఇతరగుమాస్తాలు కూడా ఈసాహేబుపెన్నిధిని విడిచిపెట్టి ఎక్కడెక్కడ మంత్రో జాబులకోసరం తంటాలుపడ్డారు ఎందువల్ల? వాళ్లకుకూడా నాలాగే ఈరహస్యం తెలిసిఉండదనుకొంటాను. మొత్తానికి ఆసాహేబు ఎవ్వరోగాని, మహానుభావుడులాగా ఉన్నాడు. రెడ్డివంటివాడు కూడా అతని పనితనాన్ని గమనించగలిగినంతటి ఆకర్షణ గలిగిన సాహేబు ఎంత సమర్థుడయి ఉండాలి! బహుశా రెడ్డిలాంటి గొప్పగొప్పవాళ్లకు గాని ఆసాహేబు అందుబాటులో ఉండడు కాబోలు. మరి నాబోటి గుమాస్తాని కన్నెత్తి చూస్తాడా? రెడ్డిగారికీ, నాకూ పరిచయం అని చెప్తాను. అప్పటికీ లొంగుబాటులోనికి రాకపోతే సారాయిడబ్బులు సమర్పించమన్నాడుగా రెడ్డి! అయితే, ఆఫీసరుఅంతటి వాడిదగ్గర ఇంత చనవుగల సాహేబు, ఆఖరుకి, సారాయి డబ్బులతోనే తృప్తిపడవలసిన ఖర్మ మేమిటి?

అది వాడి దరిద్రం కాబోలు! తాగుడు మరిగిన మనిషికి మెదడు చెడిపోతుం దంటారు, ఇదేగాబోలు! వాడి సంగతి మన కెందుకు? మనం మాత్రం లేనిపోని కుశ్శంకలు పెట్టుకొని ఇంటికి వచ్చేసిరిని కాళ్లతో తన్నుకోకూడదు. ఏమో ఏపుట్టలో ఏపాముందో! ఇంజక్షన్లకీ, శస్త్రచికిత్సలకీ, తొట్టివైద్యాలకీ నయంగాని దీర్ఘరోగాలు చిట్కావైద్యాలకి లొంగి చక్కబడినట్లు, పావలాసారాయి డబ్బులతో మన దురదృష్టపు వక్రరేఖ వొంపులు తిరిగి చక్కబడి బయటపడవలసిన రోజు వచ్చింది గాబోలు!

ఎన్నినిమిషాల్లో ఇంటికి చేరుకొన్నానో సరిగా 11 గంటలు కొట్టి భోజనంవేళ అయ్యేసరికి నేనూ ఇంటికి చేరుకొన్నాను. భోజనం చేసి రవంత విశ్రమించడం అవసరంగా కనిపించి నడుములు వాల్చాను. ఒక్క కునుకు పట్టించి, రెండుగంటలకు మెళుకువ వచ్చి లేచి కూర్చునేసరికి, మళ్లా ఆఫీసరూ, రెండు వేల రూపాయలూ, నూరురూపాయల ఉద్యోగమూ, ప్రమోషనూ, సాహేబూ, సిఫారస్సు — వెన్నంటి తరుముకొనివచ్చినట్టు రంయిమని మెదడులో పరిగెత్తినవి ఆలోచనలు.

వెళ్లితే సాహేబుదగ్గరకు ఎప్పుడు వెళ్లడం? ఏపని అయినా 'శుభస్య శీఘ్రం' అని వెంటనే చేయడం మేలుగదా! 'ఆలస్యం అమృతం విషం' అన్నారు. పోనీ, ఆసాహేబు ఎవరో, నిజంగా అతనివల్ల ఈపని జరుగుతుందో జరగదో, అచ్చం సారాయిడబ్బులతో తృప్తిపడక, ఏ ఏభయ్యో వందో లంచంపెట్టు మం

టాడో — ఈ వివరాలన్నీ ఎవరినయినా పరస్పరంగా అడిగి నిగ్గుతేల్చుకొంటే! నేను సాహేబుద్వారా ఆఫీసరుని లోగట్టుకొంటున్నట్టు ఇక మూడో మనిషి చెవికి రావడం ఏమంత శ్రేయోదాయకం! ఇట్లాంటి రాచకీయరహస్యాలు ఎంత గోప్యంగా ఉంచితే అంత మేలేమో! నిజంగా రెడ్డికి దణ్ణం పెట్టి తలు మక్కోవచ్చు. ఆయన పెట్టకపోయినా, ముష్టిపెట్టే మనిషిని చూపించి పుణ్యంకట్టుకొన్నాడు.

వెంటనే ఈకొరత కాస్తా తీర్చుకొంటే మంచిదని తోచింది. పంచాంగం చూపించుకొన్నాను. వర్జ్యం చూపించాను. రాహుకాలంగంటలు లెక్క వేసుకొన్నాను. గుళిక కాలం చూపించాను. సాయంత్రం 6 గంటలకి పంచకరహితమై దివ్యంగాఉన్నట్టు తోచింది ముహూర్తం. ఆరోజే వెళ్లి ఆ రవంతపనీ చేసుకొని రావడానికి నిశ్చయించుకొన్నాను. సాయంత్రం సరిగ్గా 5½ గంటలకు మంచి శకునం చూచుకొని 'యశ్శివో నామరూపాభ్యాం' చదువుకొంటూ బయ్యల్దేరాను.

ఆఫీసరు గారి ఇల్లు చేరుకొనేసరికి సరిగా టంగుటంగుమని ఆరూ కొట్టింది గడియారం. గేటుతలుపు నెట్టి లోపల ప్రవేశించాను. అప్పుడే దొంగసొద్దున ఇంట్లో దూరిన దొంగనుకొంది గాబోలు - కుక్క బొంయిమని మీదికి పూకింది. జంకి వెన్ను చూపితే, ఇక ముందు జరగవలసిన కార్యమంతా ఎట్లా జరగడం! ధైర్యం తెచ్చుకొని, చ్చు, చ్చు, చ్చు అని కుక్కకి చిటికవేశాను. చంచలబుద్ధి! అంతలోనే తోక లొటలొటలాడించుకొంటూ వచ్చి నాకాలు నాకింది కుక్క. ఇంతలోనే ఆఫీసరు గారి బంగళావరాండాలో ఎవరో "జాకీ, ఆవ్ ఆవ్" అని పిలిచారు. నన్నే ఆహ్వానిస్తున్నట్టు ఆపిలుపు నా కానందదాయకమై రెండడుగులు ముందుకు వేశానో లేదో నాకంటె ముందుగా కుక్కే వసారాలోకి దూరి మాయమైంది. బ్లాకవుటు అయినందువల్ల బంగళావసారాలో దీపం లేదు. కాని హ్యరికేన్‌లాంతరొకటి అరుగుమీద కునికిపాట్లు పడుతోంది. అరుగుదగ్గరగా గోడ కానుకొనియున్న బెంచీమీద కూర్చునేఉన్నాడు సాహేబు. రెడ్డి చెప్పిన మాటలు అక్షరాలా సత్యం! అనుభవంమీద ఇచ్చిన సలహో రెడ్డిది. తెల్లని పైజమా, షెర్వాణీ, నెరిసిన గడ్డం, బోడితలమీద తెల్లని లబ్బీటోపీ వేసుకొని కూర్చున్నాడు సాహేబు. మసకమసక సంజెచీకట్లోనే నాసాహేబును సమీపించానో లేదో —

"కోజా?" అని అతగాడు నన్ను పలకరించాడు.

"సలాం హుజరత్" అన్నాను.

"సలాం పండత్. ఆవ్, బైఠో" అన్నాడు సాహేబు.

"ఆఫీసరుగారు ఊళ్లో లేరుగాబోలునే, ఎప్పుడు వస్తారు?" అన్నాను.

"ఈరాత్రి ఎక్స్‌ప్రెస్‌లో రావాలి. స్టేషనుకు కారు పంపించాం" అన్నాడు సాహేబు.

ఫరవాలేదు. సాహేబు సుముఖంగానే ఉన్నాడు. మనం నిదానంగా, వ్యవధిగా మన విషయం అంతా చెప్పుకోవచ్చుననే ఆశ కలిగింది. గొంతు సకిలించి, సవరించుకొని బెంచీమీదకి పైకి జరిగాను. అరుగుమీద పెట్టిన హుక్కాగొట్టం నోట్లో పెట్టుకొని బుడబుడ మనిపించాడు సాహేబు.

"మీతో కొంచెం పనిఉండి వచ్చాను" అన్నాను.

"ఏమిటి సంగతి?" అన్నాడు.

"నేను — ఆఫీసరుగారి ఆఫీసులో గుమాస్తాను"

"మంచిది"

"నాపేరు ఫలానా రావు అంటారు"

"అచ్ఛా!"

"బి. ఏ. పేసయి, పదేళ్లయింది నౌకరీలో చేరి"

"సంతోషం."

"పిల్లలు గలవాణ్ణి."

"అల్లాహనుగ్రహం."

"ఇప్పుడు ఆఫీసులో నూరురూపాయలపోస్టు ఒకటి ఖాళీవచ్చింది"

"అచ్ఛా! అచ్ఛా!"

"ఆపోస్టుకోసరం ఆఫీసులో సుమాస్తాలు నానా నానా ప్రయత్నాలూ చేసి, నాకు రాకుండా అడ్డుతగలడానికి చూస్తున్నారు."

"హాఁ, హల్లా!"

"నేను వాళ్లందరికంటె సీనియరునికూడాను."

"అచ్ఛా!"

"కష్టపడి పనిచేసే సుమాస్తానని ఆఫీసరుగారికి కూడా తెలుసు."

"బహుత్ అచ్ఛాహై."

"నాకు మొదటినుండీ మంచిరికార్డుకూడా ఉంది."

"బడాపండత్."

"మీరుగనక కొస్త ఆఫీసరుగారితో—"

"క్యా —"

"నాపేరు రావు అంటారు. ఫలానారావు అని నా పేరు ఆఫీసరుగారితో చెప్పి, సిఫార్సుచేసి, ఈప్రమోషన్ నాకు ఇప్పించేభారం మీది."

"రే క్యా —"

"మీరు తలుచుకొంటే ఈపని అవుతుందని చాలామంది చెప్పారు."

"క్యాబోల్ —"

"ఆఫీసరుగారు మీ మాటకి జవదాటరని విన్నాను."

"నహీనహీ. సిఫార్సు జాన్తానహీ." అన్నాడు సాహేబు.

తురకబిడ్డగనుక! బెట్టుసరి చేస్తున్నాడు. అయినా, ముఖమెరుకయినా లేని మనం ఈనాడు కొత్తగా వచ్చి సహాయ మపేక్షిస్తే, మన పనులన్నీ తేరగా చేయడానికి అతడు మన నౌకరా ఏమిటి? అతగాడి ధక్క్యం ఆతనికి చూపితే కొండమీద కోతిలా దిగి చక్కా వస్తాడు.

"ఇదిగో నీసారాయిడబ్బులు. ఈఅర్ధరూపాయి తీసుకొని కడుపునిండా తాగు. నాకేమీ ఊరికేనే చేయవద్దులే." అని అర్ధరూపాయి డబ్బులూ తీసి సాహేబుచేతిలో పెట్టబోయాను.

"ఛూ! ఎవరురే బొమ్మన్? నాకీ సారాయికీ డబ్బులు ఇస్తావ్ బేగ్? నీకీ ఎంత ఫాగర్"? అని అన్నేళ్ల ముసలి సాహేబూ కాలరుద్రుడయి తటాలున లేచి, కుడిచేత్తో నాఎడమ చెంప పగిలేటట్లు ఫెడేలున ఒక చెంపపెట్టు పెట్టాడు.

నాకు కళ్లు చీకట్లు కమ్మినవి. వరాండా బయట మెట్లకిందికి తూలి నిలబడ్డాను. నా కింకా దిమ్మతిరగని స్థితిలో ఎవరో వచ్చి నన్ను మెడబట్టి వీథిలోనికి నెట్టి గేటు బిగించారు. ఇంకా ఎందుకు నామీద కోపం ఆకుక్కకి — ఇనపతలుపుసందుల్లో నుంచి మూతి పెట్టి బొంయ్యిమని అరుస్తూనేవుంది.

వేశ్యాలోలు డయిన విప్రనారాయణ మూర్తి వేశ్యమాతచేతిలో తిన్న చెడావుదెబ్బ తటాలున స్ఫురణకు తగిలింది నాకు. ఏడుపు ఆగింది కాదు. మొఖం కనిపించకుండా గుడ్డ కప్పి వెర్రిఏడుపు ఏడిచాను. కళ్లల్లోనుండి జారే వేడికన్నీళ్లు దెబ్బతగిలిన చెంపమీదికి జారినపుడల్లా చెంప మంటలు మండిపోతోంది. రోడ్డుమీది దీపంకొంతిరి నిలిచి క్రిందికి ఉమ్మివేసును గదా—దంతం కదిలిన రక్తం ఎర్రగా నాకనిపాపలో కలిసిపోయింది!

శరీరంలో మరణవేదనలా బాధ బయల్దేరింది. నడిచే శక్తి నశించిపోయింది. నీరసం బలమైంది. దాహం! నోరెండిపోతోంది. నే నుండేది మహారణ్యమూ, మహాపట్టణమా? తెలియడంలేదు. నా ఘటాన్ని ఏ శక్తి, ఏ భూతం నెట్టుకు పోయిందో, పోయి పోయి ఆ నాడు పార్కుదగ్గర దీపంక్రీనీడని చెట్టుకింద పండుకొన్న బెంచీదగ్గరకు వచ్చిపడింది నాఘటం. బెంచీమీద కూర్చున్నాను. చెట్టుమీద గుడ్లగూబ ఒకటి 'ఉం, ఉం' అంటూ నాజీవితానికి మంగళం పాడుతూంది.

* * * *

తెల్లవారి పదిగంటలకు మామూలుప్రకారం ఆఫీసుకు పోదునుగదా, నన్ను హెడ్డాఫీసునుండి క్రింది

ఆఫీసుకు ట్రాన్స్ఫరుచేసినట్లూ, ఇరవై నాలుగుగంటలలో ఆఫీసులో ఛార్జియిచ్చి వెళ్లిపోవలసినట్లూ ఆఫీసరుదగ్గరనుండి వచ్చిన ఉత్తర్వు నాచేతి కందిచ్చాడు మానేజరు.

కాని — ఏ ఆఫీసుకు వెళ్లినా, ఎంతకాలం బ్రతికినా, ( రెడ్డి చెప్పిన సాహేబు నాదురదృష్టవశాత్తూ ఆరోజున ఎక్కడికో పోయియుండినందున) అతని స్థానంలోనే కూర్చొనియుండినమనిషిని గుర్తు తెలుసుకోలేక ఆఫీసరుబంధువు అయిన మేనమామకే సారాయిడబ్బులు ఆశపెట్టిన ప్రయోజకుడనని నాజీవితంలో తీరని మచ్చ అప్పటికీ ఇప్పటికీ అట్లనే నిలిచిపోయింది.





# కర్షకా!

● శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి ●

౧

కులములని జాతులని మేలుకోవలనుచుఁ
పేరుపేరున వేఱుగ భేదభావ
ముగ్గడించుట యెవనికో యొప్పుఁగాని
కర్షకా, నీకుఁ జెల్ల దా కాపథంబు.

౨

ఆలతో లేఁగపెండుతో సహారహంబు
కాఁపురముసల్పు నీ కేల కానిత్రోవ!
నిఖిల జీవుల కాశ్రయ నిలయమైన
కృషియె నీ జీవితమునకుఁ గీర్తితెచ్చు.

౩

కలిమిలేముల త్రొక్కుళ్లవలన సమిత
మోదఖేదము లందుట కాదు నీతి;
కాలచక్రంబు పరవళ్లు లీల దాఁటి
వడిదుడుకు లేక మెలఁగుట గడుసుఁదనము.

౪.

వేఁడి వెలిఁగ్రక్కు పడమటిగాడ్పులకుఁ
గాంతి దఱిఁగిన తీవెలదొంతియట్లు
విమల పూర్వసత్సంప్రదాయములు నేఁడు
సన్నగిల్లుట గుఱుతింపు మన్న నీవు.

౫

పాలకుల వేషభాషల ప్రాభవమునఁ
బాలితుల వైఖరియు మాఱుపాటు నొందు;
అందు విద్యాధికుల సంఘమందు ముందుఁ
గలుగు పరిణామ మది నీకుఁ గాదు హితము.

౬

సర్వశాస్త్రవిచారము సలిపి విబుధ
సంఘ మూహించు విజ్ఞానసారమెల్ల
నాటపాటల మాటల ననుభవమునఁ
జిత్తమున హత్తుకొనుట నీవృత్తియగును.

౭

వర్తకము రాచఠీవి సంప్రతులజులుము
చదువుసంధ్యలవారి సంసారగోష్ఠి
సర్వమానవగ్రాసవాసముల తృప్తి
నీదువృత్తికి శాఖలై నెత్తికెక్కె.

౮

దున్నఁగా దూడలను జేరు నన్నరీతిఁ
గాయకష్టంబువంక కేగకయె, దండి
లాభముల కానపడి మాయవైభవంబు
లంది కులికెడు వ్యక్తుల నరయుమన్న.

౯

పరుగుపరుగునఁ బ్రాప్తించు పాలకన్న
నిలిచి శాంతించి త్రావిన నీరె మేలు,
లక్షలకొలంది చేకూర్చు లాఁతివృత్తి
కన్న శ్రేయంబు నీ వృత్తి యన్న నిజము.

౧౦

పశుపతికి నీకు సంబంధబాంధవంబు
లుండునన్న నసత్య మేముండు నన్న!
శిశువుకన్నను నిచ్చలు పశువు నెంతొ
గారవింతురు నీవుగా కేరు చెపుమ?

౧౧

ఆలు-పిల్లలు జెల్లలు-నాలపిండు
గొడ్డుగోదలు-దూడలు-దొడ్డు లొక్క-
చేతిమీఁదుగ నడచినరీతి నున్నఁ
గలుగుసంతోస మింతని తెలుపఁగలమె?

౧౨

ఆఱుగాలము కష్టించి యాలుమగలు
బిడ్డపాపలు తమదృష్టిఁ బడ్డ మెదుకె
యారగింతురుగా కంతె, పారతంత్ర్య
బుద్ధి యవ్వారిపొంతకుఁ బోవదన్న.

౧౩

అతని కష్టార్జితమునకు నాసపడెడి
'పరభృతంబుల' లెక్కకుఁ దఱుగు లేదు,
వాని 'సిద్ధాన్నమును' నోటవైచుకొనుచు
నెగిరిపోఁజూచు డేగల వెన్నొ కలవు.

౧౪

నారువోసినవాఁడెపో నీరువోయు
ననెడి వేదాంతసూక్తి నీకమృతగుళిక;
నమలి భక్షించుకన్నను నాణె మర్థయు
మ్రింగుటే యన్న సూక్తి మెఱుఁగవన్న.

౧౫

లోకమును ధాత సృజియించుఁగాక, దాని
తిండి దండిగ సృష్టించు తెరువు నీదె,
ఉద్దియగుదువు ధాతకు నోయి నీవు
చూడ నెచ్చటిదో యిట్టి చుట్టఱికము.

౧౬

'ఆత్మవ త్సర్వభూతాని' యనెడిమాట
నక్షరాలను బాటింప నర్హుఁ డెవఁడొ!
ఎవని కయ్యది సరిపడు నవని నీకుఁ
దప్ప తక్కినవారిలో నెవ్వడైన?



ఫొటోలో కనబడు మొసలిని దక్షిణవల్లూరు ఎస్టేటుజమీందారుగారైన
**శ్రీరాజా బొమ్మదేవర వెంకటభాష్యకార్లు రావునాయుడు బహద్దరు**
జమీందారుగారు చల్లపల్లివద్ద నున్న వెలువోలువద్ద కృష్ణానదిలో పట్టిరి.



మరమ్మతు

[లినోకట్ - చిత్రము]

●

శ్రీ తేజోమూర్తుల కేశవరావు

# శివస్తుతి*

= శ్రీ శివశంకర శాస్త్రి =

దేని సన్నిధి శుభ్రభవశానివేశ
సంపద కిరీటవిధుకరజాల మొందు,
దగ్ధ మయ్యెను కామపతంగ మెందు,
అట్టి శివనేత్రశిఖిదీప మతిశయిల్లు!

ధూమ మెరుగక యున్నను, కాముసతికి
ఆయె నెది సూత్రధారి నిరంతరాశ్రు
వాహినికి, అట్టి హరనేత్రవహ్ని భూతి
నిచ్చి మీ పాపములు దహియించు గాక!

పారితోషికగతి రతిప్రాణసముడు
తనశరీరమ్ము విడిచె నెద్దాన, అట్టి
యీశు ఫాలస్థలీరంగదేశమందు
మించి నర్తించు వహ్ని రక్షించు గాక!

పండుకొనియె జ్వాలావలీపల్లవచయ
రూపకేళితల్పాన మరుండు రతిని
వదలి, ఆసూత్రితం బైన వహ్నిసఖ్య,
మట్టి హరనేత్ర మొసగు సౌఖ్యమ్ము మీకు!

దేని తాపయోగవిలీయమాను డగుచు
పూర్ణత కిరీటచంద్రుడు పొందలేడొ,
భర్గదేవసీమంతితఫాలభిత్తి
యయిన యావహ్ని మీపాప మడచు గాక!

దానవస్మేరదృగ్బాష్పధారలందు
ఏది యించుక తృప్తి వహింపలేదొ,
అపరబడబానలము బోలు నాపురారి
బాణవహ్ని దహించు మీపాపచయము!

పడసి స్మరబోధిసత్త్వంపు పాత్రముగను
ఒసగె నత్యర్థదానప్రయోగవిధిని
దేహమే ప్రథమమ్ముగ దేని, కట్టి
ఫాలలోచనవహ్నిని ప్రస్తుతింతు.

విషమకోపాంధకారమ్ము వెడల గ్రక్క-
గా భ్రుకుటికాళయామిని, కాల మవల
ఎరుక లేని నిద్దుర పోయె నెక్కి యెవని
లోచనహుతాశశయ్యపై, బ్రోచు నతడు.

శిరమునం దుండి యెవనికి చేయుచున్న
దానివలె దోచు ననకృత్ప్రదక్షిణములు
గంగ ఆవర్తమాలికాక్రమమువలన,
ఆ జగద్గురు డచలేశు డవచుగాక!

దిక్కు లెవ్వానిచే శివదీక్ష బూని
నట్లు భస్మాంగరాగమ్ము నలముకొనియె,
అట్టి పీయూషదీప్తిహారాట్టహాస
ములు హరించుత మాలిన్యమును జగాన!

సర్వదేహసంసంగిభుజంగముక్త
పాండునిర్మోకపట్టసంబద్ధభంగి
సాంద్రభస్మోఘసఖ మగు శర్వతనువు
మించు మీదురితమ్ము హరించు గాక!

తను విభూషణ ఫణి ఫణా గణమరీచి
పటల కందళితేంద్రచాపము, మరుత్త
నృపతికి సువర్ణవర్షి యా నీలకంధ
రాఖ్యసఫలపయోధరం బతిశయిల్లు!

---

* శ్రీ మంఖకుని సంస్కృతమున కాంధ్రము. శ్రీకంఠచరితములో 'నమస్కారవర్ణనము' నం.౩,



తిరువణ్ణామలై దివ్యదర్శనము

# తిరువణ్ణామలైదేవాలయము



= శ్రీయుత సి. రాజగోపాలాచార్యులు =

దక్షిణహిందూదేశములోని దివ్యక్షేత్రములలో నొకటైన తిరువణ్ణామలకు నేను మొన్న ఫిబ్రవరి 28-వ తేదీనాడు కార్యవశాత్తు వెళ్లియుంటిని. ఆ మరునాటియుదయమున ఒకగంటసేపు తీరుబాటు కలుగజేసికొని అణ్ణామలై దేవాలయమునకు వెళ్లి రాగలిగితిని. నిర్మలచిత్తముతో, విశాలము లైన ఆ దేవాలయప్రాకారములగుండా ప్రదక్షిణము చేయుటలో భక్తిపరవశుడనై పోయి నాయొడలు నేను మరచితిని. నాబోటి రాజకీయవ్యక్తికి ఈపాటి విరామము దొరకుట బహుదుర్లభము. ఒకవేళ దేవుడుమేలుచేసి, అదృష్టము బాగుండి అట్టి విరామము లభించినను ఈ రీతిగా ఒంటరిపాటు - ఏకాంతము దొరకుట మరియు దుర్లభము. ఉపచారములు చేయువారొకవంకను, ఆదరించువారొకవంకను చుట్టుముట్టుటతో ఆయేకాంతము నిరర్థకమై, ఆ సదవకాశములో కట్టుకోదలచుకొన్న భావనాసౌధము లన్నియు కూలిపోవును.

ఆహా! ఏమి యావైభోగము, ఏమి యావైశాల్యము, ఏమి యాభక్తి ప్రపత్తులు, ఏమి యాపనితనము, ఏమి యాశిల్పసంపద! నిత్యజీవముతో అవి యాగోపురప్రాకారములయందును, దేవాలయకుడ్యములందును, ఆపరిసరములలోనే మూర్తిభవించి స్థావర మేర్పరచుకొనిపోయినవి. మన తాతముత్తాతలు కట్టించిన ఆ మహాగోపురముల ముందు మన ఉన్నతోన్నతాశయము లన్నియు దివిటీముందు దివ్వెవలె దిగనారిపోవును. పనితనములోనే కాదు - పవిత్రతలోకూడ అవి మహోన్నతములే, యనుటకు సందేహము లేదు. చూచుటకు చిన్న చిన్నవిగానే కనబడినప్పటికిని ఆ ఆలయపు ప్రతిమూలలోను సునాయాసముగా ఇరువదివేలమంది కూర్చోవచ్చును. విశాలప్రాంగణములం దయితే మరి చెప్పనే అక్కరలేదు. లక్షమంది ధారాళముగా కూర్చోవచ్చును. కూర్చొని, తమకు నిజమైన ఊరటను, ధైర్యమును ఇవ్వగలిగిన ఉపన్యాసకు లెవరయినను దొరికినయెడల వీనులవిందుగా వారి యుపన్యాసములను విన వచ్చును. భాగవతకాలక్షేపములతోను, సాధుగోష్ఠులతోను, భజనసంకీర్తనములతోను కాలక్షేపము చేయను వచ్చును.

అయ్యో! మన మేగతికి వచ్చినాము! ఆ భక్తిప్రపత్తు లెక్కడికిపోయినవి? ఆ భావన యెక్కడికేగినది? ఆ ప్రావీణ్య మెక్కడికి వెళ్లినది? ఈ భక్తి



శూన్యత, ఈ పాషండత, ఈ అల్పత్వము, ఈ సంకుచితదృష్టి, ఈ సంకుచిత హృదయము, ఈ వికారాకారము, ఈ అశ్లీలత, ఈ అపరిశుద్ధత—ఇవి మన కెందుకు దాపరించినట్లు? ఎక్కడనుండి దాపరించినట్లు? మన తాతముత్తాతల నాటి ఆ శక్తిసామర్థ్యము లేవీ ఎక్కడికిపోయినవి? హే భగవన్! నీవు మమ్ముల నెందు కింత నిష్ఠురహృదయముతో గాలికి వదలివేసినావు? ఎందుకు మమ్ముల నింత పనికిమాలినవారినిగా (ఎందుకును, ఏవిధముగాచూచినను) చేసినావు? మా పెద్ద లెక్కడ, మే మెక్కడ? ఈ గోపురములను, ఈ ప్రాకారములను యోజించి, కల్పించి, కట్టించి ఈ చదరములను, ఈ మంటపములను నిర్మించిన ఆ మహనీయులసంతతిలోవాడినేనా నేను? తలచుకొన్నకొలది ఈతలపు లన్నియు శల్యములవలె నొప్పించుచున్నవి. ఆ బాధ చెప్పనలవిగాకున్నది.

ఇటు చూడుడు—ఈ ప్రకటన లేమిటి, ఈ హెచ్చరిక లేమిటి? "ఈ స్థలమును దురుపయోగము చేయువారు దండింపబడుదురు", "మలమూత్రములతో ఈ చోటును మలినపరచువారు శిక్షింపబడుదురు" ఇత్యాది, ఇత్యాది. అయ్యో! రామ! ఎందుకివన్నియు? ఈయీచెడుగు లిక్కడనున్నవని చూపుటకేనా, లేక వీటివల్ల ఫలితమేమయినను కలుగుచున్నదా? కలిగినట్లుగాని, కలుగుచున్నట్లుగాని ఏమియు కనుపించదే!

అటు చూడుడు: ఆ వేయికాళ్ల విశాలసభాంగణమును—వేయికాళ్ల మంటపమును. ఆహా! ఏమి ఆనిర్మాణచాతురి! ఏమి ఆ గంభీరసృష్టి! దివ్యశక్తియంతయు అందులో కేంద్రీకృతమైనట్లున్నది. అట్టి ఆ మండపములో, సుందరమైన ఆ స్తంభములకు స్తంభములకు మధ్య వికారముగా ఆ నవీనపు ఇటుకగోడ లెందుకు కట్టినట్లో నాకు బోధపడలేదు. ఈ వేషము చాలదన్నట్లు దీనికితోడుగా మధ్యలో ఆ పోత ఇనుపకటకటాల తలుపు లెందుకు బిగించినట్లో నాకంతకంటెను బోధపడలేదు. ఇదంతయు నేమిటని ధర్మకర్తలను ప్రశ్నించితిని. వారు చెప్పిన సమాధాన మిది: ఈ మండపము ఎప్పుడో ఏడాదికొకతూరి తప్ప ఉత్సవాదుల కుపయోగింపబడదనియు, ఏడాది కొకతూరిమాత్రమే దీని యుపయోగమనియు, అందువల్ల ఇతరసమయములందు ఈ మండపమును జనసామాన్యము విచ్చలవిడిగా ఉపయోగించి దురుపయోగముచేసి మలినపరచకుండుటకే ఈ దిగ్బంధనము గావింపవలసి వచ్చినదనియు వారు చెప్పిరి. అయితే, ఇక దీనిగతి యింతేనా? లేక మనకు ఆశాహేతు వేమయినను ఉన్నదా?

ఇట్లు బంధించివేయుటకంటె దీనిని ప్రజోపయోగకరమగునట్లు ఏల చేయరాదు? మన తాతముత్తాతలు కలలుగన్న ఆ వేదాంతతత్త్వములను,

ఆ భగవద్విషయములను ప్రజాసామాన్యమునకు వారి సొంతభాషలో పాటలుగాను, కథలుగాను, కబుర్లుగాను చెప్పగలిగిన సత్పురుషులను—త్రికరణములుగా సత్పురుషులైనవారిని - ఇక్కడ చేరదీసి వారిచేత అట్టికాలక్షేపములను చేయించుచు, దూరశ్రవణ యంత్రములనమర్చి—ఇప్పు డిది కష్టసాధ్యము కూడ కాదుగదా—మండపములోని మూలమూలలనున్న వారికిని వినిపించుచుండినచో ఎంతప్రశస్తముగా నుండును! ఎంత ఉపయోగముగా నుండును! ఉదయసాయంకాలముల రెండు వేళలందును ఇట్లు చేయవచ్చునే! జనసామాన్యము ఇందువల్ల ఎంతయినను వికాసము పొందగలదు. వికాసముపొంది ప్రబుద్ధులయిన జనసామాన్యము దీనిని దురుపయోగము చేయుదురనుట నమ్మదగినది కాదు. పైపెచ్చు ఇది పరమపవిత్రమైన స్థలముగా వారికే స్వయముగా బోధపడగలదు. తదుపరి దీని నా పవిత్రదృష్టితోనే ఉపయోగించుచుందురు.

ఇంక, దేవాలయ పుష్కరిణుల సంగతి: వానినిగూడ ఇప్పటికంటె ఎంతో పరిశుభ్రముగా ఉంచవచ్చును. దేవాలయావరణలో రాతిపరపులు లేని విడిభాగములందు చక్కని పూలమొక్కలను నాటవచ్చును. స్వామికార్యమునకును, స్వకార్యమునకును గూడ అవి పనికివచ్చును. అందమున కందమును చేకూర్చును.

ఈ స్వల్పసంస్కరణలతో ఈ అణ్ణామలై దేవాలయమును స్వర్గధామముగా చేయవచ్చును. మన పెద్దలు ఎన్నో పవిత్రాశయములతో, ఎంతో విశాలముగా, జనసామాన్యమున కెన్ని విధములుగానో ఉపయోగపడునట్లు కట్టించిన ఈ ఆలయములను మనము మతిమాలి పాడుచేసినాము. లేదు, లేదు—అవి యింకను పూర్తిగా పాడుకాలేదు. ఇంకను కొంత ఆశాకిరణము గోచరించుచున్నది.

యువతీయువకులారా! లెండు లెండు, మేల్కొండు. (ఉత్తిష్ఠత. జాగ్రత.) పవిత్రులుకండు. పరిశుద్ధులుకండు. దైవస్వరూపులుకండు. శక్తివంతులుకండు. ఉత్సాహసంపన్నులు కండు. మహనీయులు కండు. మీ ఆనువంశికమైన సంప్రదాయమును మీరు అనుసరింపుడు. ఇది మీది. మీ హక్కుభుక్తము. దీనిని మన పెద్దలు మనకోసమై నిర్మించినారు. మనము వారి సంతతిలోని వారము. దీనిని పరమపవిత్రముగా కాపాడవలసిన బాధ్యత మనది.



# ఓ భగవాన్!

= శ్రీ చింతా దీక్షితులు =

కనిపించని భగవంతుడవు నీవు కనిపిస్తే ఏమి చెయ్యాలో తెలియక దిగ్భ్రమ చెందుతాను. రెప్పవాల్చకుండా చూడాలనుకుంటాను. నీరూపం నా హృదయంలో అచ్చు గుద్దుకుండామని ఎంతో ఆకాంక్షతో నిన్ను చూచుకుంటాను. నువ్వు కూర్చున్నప్పుడు చూస్తాను. నువ్వు కాళ్లు చాచినప్పుడు నీకాళ్లమీద నాశిరస్సు మనసా నిలుపుకొంటాను. నీ పాదపద్మాలు చూచుకొంటాను. నీముఖం, నీకళ్లూ చూచుకొంటాను. ఠీవిగా నువ్వు కూచోవడం చూచుకుంటాను. నువ్వు నిలబడ్డం చూచుకొంటాను. భక్తుడు చేతికి అందించే దండకమండలాలు నువ్వు పట్టుకోవడం చూచుకొంటాను. నువ్వు మందమందంగా నడక సాగించడం చూచుకొంటాను. అడుగుమీద అడుగువేస్తూ నువ్వు అరుణగిరితట్టు వెళ్లడం చూచుకొంటాను. కొండ ఎక్కడం చూచుకొంటాను. కొండ ఎక్కుతూ ఆగడం చూచుకొంటాను. ఆగి వెనక్కి తిరిగి భక్తులను నీకటాక్షములతో కరుణించడం చూచుకొంటాను.

సొంత ఇంటిలో తిరుగుతున్నట్లు నువ్వు అరుణాద్రిపై తిరుగుతూ ప్రక్కనున్న భక్తుణ్ణి ప్రశ్నించడం చూచుకొంటాను. కొండ ఎక్కి ఎక్కి మలుపులో మాయమవడం చూచుకొంటాను.

ఎన్ని వైఖరులుగానో, ఎన్నిరకాల అందాలతోనో, ఎన్నెన్నివిధాలనో నీవు భక్తుల ననుగ్రహించేపద్ధతులు చూచుకొంటాను. కూర్చుని మాట్లాడ్డం చూచుకొంటాను. భక్తుల సందేహాలు తీర్చడం చూచుకొంటాను. నవ్వడం చూచుకొంటాను. ఇన్ని,నీమూర్తులూ చూచుకొంటాను. ఏదో ఒకమూర్తి నా హృదయంలో నిలుపుకుందామని, మాయకుండా అచ్చుగుద్దుకుందామని, పోకుండా బంధిద్దామని మనసు పడతాను.

ఏమి భగవాన్! ఒక్కక్షణమే నిల్చి మాయమౌతావు నా హృదయంనుంచి? ఇన్నిమూర్తులు చూచుకొన్నా ఒక్కమూర్తయినా నిలవదు నాహృదయంలో—ఏమి భగవాన్?

ఆ నీకూర్చున్న ఠీవిలో అందం; ఒకకాలిమీద జేర్లాబడిమూచే నీచూపు అందంలో తీవ్రత, అనుగ్రహం; ఆ నీ నిలబడ్డ సౌందర్యమూర్తిలో ఉండే మహేశ్వరత్వం; ఆ నీ మందగమనంలో ఉండే ఠీవి, జాగ్రత్త, అహింస, సౌందర్యం; ఆ నీ వెనకకుతిరిగిచూచే చూపులో ఉండే సింహగాంభీర్యం, అనుగ్రహం, భక్తపరాధీనత—ఏమి భగవాన్, ఇన్ని అందాలూ నాకళ్లతో నీసమక్షాన్ని ఆస్వాదించి, పట్టుకొని, నిలుపుకో చూచుకొన్నానే—అన్నీ ఇంటికి వచ్చాక జారిపోతున్న వేమి భగవాన్ ?

నా హృదయం నీ నివాసానికి తగదు, నిజమే, భగవాన్—నా హృదయంనిండా చీకట్లు ఉన్నమాట వాస్తవం, మలినమున్నమాట నిజం, కోరికలు నివసిస్తూన్నమాట యథార్థం, కామాదులు కోటకట్టుకొన్నమాట నిజం. ఈ హృదయంలో, ఈ పాడుకొంపలో నిన్ను నిలవమనడం నాతిప్పే—కాని నే తరించేమార్గం ఏది భగవాన్ ?

ఇంక నాహృదయం నీ నివాసం కావాలంటే దానిని యోగ్యంగా చెయ్యాలంటావా ? నేను చెయ్యగలనా భగవాన్? నీమూర్తిజ్యోతితో ఆచీకట్లు చెదరగొట్టలేవా భగవాన్? మలినాన్ని నీ అనుగ్రహంతో తుడిచివెయ్యవా భగవాన్? నీదృష్టితో నాకోరికలు తరుమగొట్టు భగవాన్. ఈకొంప నీకు నివాసయోగ్యం చేసుకో భగవాన్. నువ్వే పీట వేసుకో భగవాన్. నువ్వే ముగ్గులుపెట్టి అలంకరించుకో భగవాన్. నువ్వే దీపం పెట్టుకో భగవాన్. నా కివన్నీ చేతకాదు భగవాన్.

"అయితే నీహృదయం 'నా కిచ్చెయ్య" మంటున్నావా భగవాన్ ! నా కిచ్చెయ్యాలనే ఉంది. నీ వుండడానికి నీ కిచ్చెయ్యాలనే ఉంది. కాని నేను చెప్పినమాట అది వినదు. ఓ భగవాన్, నేను నేనై నీ కిది ఇవ్వలేను. నువ్వే తీసుకో భగవాన్—నువ్వే దీనిలో కాపురముండు భగవాన్.

అయితే నీభక్తులు నీమీద రాసిన శ్లోకాలు జ్ఞాపకంచేసుకొని ఆవర్ణనలు నీకు సరిపుచ్చుకొని ఆమాటలతో నీరూపం పట్టుకొని నా హృదయంలో ప్రతిష్ఠించదలచుకొంటాను. కాని నువ్వు ఆమాటల్లోంచి తప్పించుకుపోతావు. ఎలాగ భగవాన్—మాటలూ నిన్ను కట్టలేవు—అవును—మనస్సూ నిన్ను కట్టలేదు—నిజమే—మరి నిన్ను కట్టే ఆభక్తి నా కేదీ ? నా కెందు కియ్యవూ ? నువ్వే సంపాదించుకోమంటావా ?

నీ అనుగ్రహంతో సమస్తమూ ప్రసాదించగలవంటారే ! నీకు అసాధ్య మేదీ లేదంటారే ! ప్రారబ్ధాలుకూడా నిన్ను చూచి పారిపోతాయంటారే ! మరి నా ప్రారబ్ధం పారిపోదేం ?

నా హృదయంలో కాపురముండు భగవాన్—నాకు అంతే చాలు భగవాన్—ఉండవూ, భగవాన్ ఉండవూ ?

# శ్రీరాజా బొమ్మదేవర
# వెంకటభాష్యకార్లరావునాయుడు బహద్దరుగారు

(దక్షిణవల్లూరు ఎస్టేటురాజాగారు)



★

వీరు 30-11-40 తేదీన ఎస్టేటును కోర్టుఆఫ్ వార్డ్సు నుండి ఒప్పగింతచేసుకొనిరి. శ్రీరాజాగారు వేటలో అసమాన ప్రవీణతను సంపాదించిరి. చిరుతపులులను, పులులను వేటాడుటలో ప్రతిభ సంపాదించిరి. చిరుత ప్రాయముననే యిట్టి ప్రాఖ్యాతిని సంపాదించగల్గిరి.

★



వేణుగానము

[చిత్రకారిణి : శ్రీమతి పి. సీతాదేవి]

# కులశేఖర మహీపాల చరిత్రము

ఆంధ్ర వాఙ్మయమున భక్తికావ్యములు రెండు విధములుగ నున్నవి. వీనిని శివకావ్యములు, విష్ణుకావ్యములు నని స్థూలముగా చెప్పవచ్చును. వీనిని మరల నాలుగు భాగములుగా వ్యవహరింపవచ్చును. అవి శివపురాణములు - శివప్రబంధములు, విష్ణుపురాణములు - విష్ణుప్రబంధములు. దేవీభాగవతాదికములను శివకావ్యములక్రిందను, లక్ష్మీస్తోత్రాదికములను విష్ణుకావ్యములక్రిందను పరిగణింపవచ్చును. ప్రాయికముగా శివవిష్ణుప్రశంస లేని కావ్యము లేకున్నను శివకేశవాభేద ప్రతిపాదకములై అద్వైతపరములయినవానికి శివకావ్య విష్ణుకావ్యనామము ప్రయోగింపఁబడుట లేదు. వీరశైవమును, వీరవైష్ణవమును ప్రతిపాదించుచు "శివ ఏవ పరః", "విష్ణురేవ పరః" అని చెప్పి తదేకారాధనముచే ముక్తినందిన భక్తుల చరిత్రలను ప్రతిపాదించునవి శాఖావాఙ్మయ నామమునకుఁ దగియున్నవి. బసవపురాణము, చెన్నబసవపురాణము, పండితారాధ్య చరిత్రము, శ్రీకాళహస్తి మాహాత్మ్యము మొదలగునవి శైవకావ్యములు; విష్ణుపురాణము, విష్ణుమాయా విలాసము, ఆముక్తమాల్యదవంటివి వైష్ణవకావ్యములు. శైవ ప్రబంధములకు ఓరుగల్లునఁ గాకతీయులు ప్రధానాలంబనములైరి. విష్ణుప్రబంధములకు విజయనగరమున రాయలును, తద్వంశజులును ముఖ్యముగా నాధారమైరి. స్వతంత్ర కావ్యములును లేకపోలేదు.

కులశేఖర మహీపాల చరిత్రము విష్ణుప్రబంధములలో 'ఆముక్తమాల్యద' జాతికిఁ జెందినది. అనఁగా ద్రావిడ వాఙ్మయమునుండి కథను గ్రహించి యాంధ్ర వైష్ణవ సల్లిన కావ్యమని నా భావము. దీనిని రచించిన రఘునాథాచార్యుఁడు వెంకటాచార్యుని కుమారుఁడు; విష్ణుభక్తిపరాయణుఁడు. శైలినిబట్టి యితఁ డర్వాచీనకవి యని తోఁచుచున్నది. ఈ గ్రంథ మముద్రితము. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున D. 2177 గా నుండి మరల నుద్ధరింపఁబడినది. కులశేఖరాళ్వారు లని విష్ణుకథలయందు సుప్రసిద్ధుఁడు గలఁడు. ఆయనయే అమృతస్యందియై మధురతమమైన 'ముకుందమాల' రచించిన పరమభక్తుఁడు. ఇతఁడు విష్ణుచిత్తునివలె సామాన్య భక్తుఁడుగాక మహారాజును, భక్తుఁడును. విష్ణుచిత్తుని పుత్రిక చూడికుడుత్త నాచ్చియారు (ఆముక్తమాల్యద) వలెనే ఇతనిపుత్రిక నీళాదేవి శ్రీరంగమునందు రంగని వివాహమాడెను. ఆముక్తమాల్యదయందువలె ఇందును విష్ణుభక్తిప్రతిపాదకములైన యుపాఖ్యానములు గలవు. ఇందు రామాయణ మొకటి. ఈ ప్రబంధము శ్రీరామున కంకితమైనందున రామకథ కితఁడు కొంత ప్రాధాన్య మిచ్చెను. దీర్ఘమైనదైనను ఈ కథ మూలకథలోఁ గలిసిపోయినది. ఔచితిని భంగపఱచుట లేదు. ఏలయన, కులశేఖరుఁడు రామభక్తుఁడు. అతని కుపదిష్టమైనవి రామకథా శ్రవణ మననములు. అందాతఁడు లీనమైన విధమే ఈ ప్రబంధ సారాంశము. ప్రబంధధోరణి ననుసరించి ఇందలి వర్ణనలు కొంత పొడవుగా నున్నను, పారిజాతాపహరణమునందువలె కొంత ఉచితముగా నుండకపోలేదు.

కథాంశమును సంగ్రహముగా నుదాహరింపవలసి యున్నది. కేరళమునఁ గుక్కుటకూటపురము గలదు. ఆపట్టణపు రాజు దృఢవ్రతుఁడు. అతఁడు వేట కరిగి త్రోవతప్పి యొక లేడి ననుసరించిపోవుచు దాని నొక వేటునకుఁ గూల్చెను. అది సకరుణముగా పడియుంటఁ జూచి జాలిగొనెను. అదియు మనుష్యభాషణముల


శ్రీ సాగి వెంకటనరసింహము


నాతని నోదార్చి, పూర్వజన్మమున తన పతి కుద్దేశింపఁబడిన క్షీరము త్రాగుటచే నీజన్మము వచ్చిన దనియు, దృఢవ్రతుఁడు తన్ను వధించుటచే తనకు ముక్తి వచ్చిన దనియుఁ జెప్పెను. మఱియు రాజునకు సంతానము లేకపోవుట యుక్తము గాదని చెప్పి దేహము వర్జించెను. రాజు తన యనపత్యతకుఁ గుంది మంత్రులతోఁ జెప్పికొని తన్నివారణోపాయములు వెదకుచుండెను. ఇది ప్రథమాశ్వాసము. ఇందు రెండు మనోహరములైన ఘట్టములు గలవు. రాజుచేఁ గూలిన లేడిస్థితి మిక్కిలి స్వాభావికముగా వర్ణితమైనది. ఒక్క పద్యమును విడువఁజాలక వ్రాయుచున్నాను:

"కడువడి సెలియించు కన్నుల కొలకుల
నుడుకుజలంబుల విడుచుదాని
వెరయాడి యంగముల్ విరవిరవోవంగ
నగ్గలంబున వడకాడుదాని
ప్రాణముల్ చంచలభావమందఁగ నోట
గళగళ నురువులు గట్టుదాని
మార్మ్రపె యిడుచు నమ్మలికంబుఁ దోఁపంగ
నొయ్యన కుట్టూర్పు లూర్చుదాని
హరిణయువతిఁ జూచి యందంద మదిలోన
పాపభీతియును గృపారసంబు
గీలుకొనఁగ నపుడు కృష్ణకృష్ణా యంచు
నగ్గలించి హాయము డిగ్గనుటికి."

రెండవది లేడిపూర్వజన్మ వృత్తాంతము. గారామునఁ బెరిగిన కన్య అత్తింట నెట్టి కోరంటికము ననుభవింపవలసి వచ్చెనో కన్నులఁగట్టునట్లు వర్ణింపఁబడినది. అత్త ధౌర్త్యము, కోడలి మెత్తందనము, భర్త దేబెతనము, కోడలు పతిని బ్రతిమాలుట, అత్తను బ్రతిమాలుట, ఒక సమయమున కోడలికి తలుపు తలకుఁదగిలి నెత్తురు ఓలలనుట, ఆ సమయముననే మూఁడురోజు లుపవాసముంచి పైన కాపువెట్టి అత్త కోడలిని పాలు తెమ్మని పంపుట, అట్టి ప్రాణాంత సమయమున కోడ లాపాలను కొంచెము త్రావుట, అందుకై యింటినుండి తరిమివేయఁబడుట-అను విషయములు గుండెనీరుచేయఁగలవు. ఈ సందర్భమున మాథ్యూ ఆర్నాల్డు వ్రాసిన 'బొఖారాదేశపు చింతాకులుఁడైన రాజు' (Sikh King in Bokhara) జ్ఞప్తికి వచ్చుచున్నది. అం దొకఁడు ప్రాణము లెరియించు దప్పికచే తన యన్న దాఁచుకున్న నీరు చెప్పకయే త్రావెనఁట. ఆదోషమును తాను స్వయముగా రాజుకు నివేదించి మరణశిక్షఁబొందెను. ఎట్టి విషమస్థితిలోనైనను నీతి తప్పరా దను పరమాశయము ప్రాచ్యులది. వారు "ప్రాణవిత్తమాన భంగమందు... బొంకవచ్చు" ననుట నంగీకరింపఁజాలరు.

ఇఁక రెండవయాశ్వాసము. వైష్ణవుల యాదేశానుసారము భార్యతో నొక్కవత్సరము బ్రహ్మచర్యానిష్ఠుఁడై రాజు విష్ణ్వనుగ్రహము నందెను. విష్ణు విట్లు చెప్పెను: "నీకు పరమ భాగవతోత్తముఁడు పుత్రుఁ డగును. అతనికి నీళాంశమున పుత్రికారత్న ముదయించును. ఆమెను నేను శ్రీరంగమున వివాహ మాడుదును." ఆవాక్యానుసారము దృఢవ్రతునకు పుత్రుఁడు పుట్టెను. అతనికి కులశేఖరుఁడని పేరిడిరి. కులశేఖరుఁడు సర్వవిద్యా నిష్ణాతుఁడై రాజ్యాధిపత్యము నంది దిగ్విజయయాత్ర గావించి సుఖముగా నిల్లు చేరెను. అతఁడు బాల్యమునుండియే పరమ భక్తాగ్రేసరుఁడుగాన నప్పుడు వైష్ణవభక్తులఁ బిలిపించి తనకు ముక్త్యుపాయము కాలక్షేపోపాయముఁ జెప్పఁడనెను. వారు వైష్ణవతత్త్వ ముపదేశించి రామాయణ పఠన శ్రవణ మననము లుత్తమము లనిరి. అట్లే రామాయణమును వినెను. ఈ యాశ్వాసమున విష్ణుభక్తుల వేషభాషలు, వారిని సత్కరించవలసిన విధము చక్కఁగా నిర్దిష్టములైనవి. రాజు వారలకు "వందన మాచరింతు ... పునర్వందనమాచరింతు ... పునః పునర్వందనమాచరింతు" ననుటయు, వారు సంస్కృతమున "దోర్బలౌదార్యవీర్యసమృద్ధిరస్తు" మొదలగు నాశీర్వాదము సేయుటయు నింపుగా నున్నవి. కొంచెము భూగోళశాస్త్రము, తత్వశాస్త్రము మేళవింపఁబడినవి. విష్ణుధ్యానము కొంత సంస్కృతములో నున్నది. ఈకవి యుభయభాషా పండితుఁ డనుటకు ప్రథమాశ్వాసములోని తెనుఁగుపోకడలును, ద్వితీయాశ్వాసములోని సంస్కృతగుంభనములునే, తరువాతి మిశ్రావిష్కరణములును జాలును. ఇట్లు ప్రౌఢిమ

గల్గియు, ఆక్తమాల్యదలోవలె కవిత్వమునందు పెటుకుఁదనము లేదు.

బాగుగ ప్రవహించు సంస్కృతపద్య మొకటి:

"సనకసనందనాది ముని
సన్నుతపాదసరోరుహాయ స
జ్జనవిపదంధకారదివ
సప్రభవే కమలాలయాఘన
స్తన తటకుంకుమారుణ వి
శాలసముజ్జ్వలవక్షసే సుహ్రు
ద్వనయవిదే నమోభగవ
తే భవతే యని మ్రొక్కెరందఱుఁ"

మఱియొకటి:

"పావనములు విసమితస జ
నావనములు విబుధకోకిలాశ్రయణ మధు
శ్రీవనములు కృతిముని సం
భావనములు విష్ణుదాసపదసేవనముల్"

3, 4 ఆశ్వాసములలోని కథను మూఁడు భాగములు చేయవచ్చును. ఇందు మొదటిది రాజునకు విష్ణుభక్తులయెడఁ గల తాత్పర్యము. రెండవది రామాయణకథ వినినప్పుడు రాజు తన్మయత్వము. మూఁడవది శ్రీరంగని వివాహము. విష్ణుభక్తుల సేవాసాంగత్యములు లేనిదే రాజొక్కనిముసమైనను మనఁజాలఁడు. వారి రాకవలన మంత్రులకు చాల చిక్కులు గలిగెను. రాజ్యపాలనమునకు వలయు మంత్రాంగమునకుఁ దగు సమయమే దొరకదయ్యెను. ఒకనాఁడు మంత్రులు భటులతోఁజెప్పి వైష్ణవులు లోపలికి రాకుండఁజేసిరి. వారు 'శ్రీనివాసా' యని ద్వారములోఁ గూర్చుండిరి. వారు రామికి విచారించి రాజెదురేగి క్షమార్పణము వేఁడి వారికిఁ గ్లేశముగూర్చిన భటులను ఖండింప నాజ్ఞాపించెను. కాని విష్ణుభక్తుల యాజ్ఞచే నాభటులను మరల క్షమించెను. రెండవమారు మంత్రులు మరియొక యుపాయము చేసిరి. రాజు స్నానము చేయు సమయమున నతని యాభరణము లొక ముసలిదానిచే తీయించి దాయించి, ఆనేరము వైష్ణవులపైఁ బెట్టిరి. రాజు మిక్కిలి దుఃఖించి తత్సత్యమును స్థాపించుటకై యొక తీవ్రమైన పనిచేసెను. పాములవానిఁ బిలిపించి విషసర్పము నొకదానిని పాత్రలోఁ బెట్టుమని, తనచేతి నందులోఁ జొనిపి మూత వేయించెను. సర్ప మతని కింతమాత్రమును హానిచేయలేదు. మంత్రు లందులకు మిక్కిలి భీతిల్లి సత్యమును వెల్లడించి రాజును, భక్తులనుగూడ క్షమార్పణము గోరిరి. ఆసమయముననే శ్రీరంగనాథుఁడు ప్రత్యక్షమై యతని ప్రార్థన మంగీకరించి యతని కూఁతును వివాహమాడెను.

రెండవ యంశము రామాయణాకర్ణనమున రాజు తన్మయత్వము. ఖరదూషణాదులు రామునిపైకి వచ్చుచుండి రని విని రణభేరి వేయించి శ్రీరామునికి సహాయము నేయ ససైన్యముగ బయలుదేరును. "ఆకాలము వేరు, ఈకాలము వేరు" అని యెంత చెప్పినను వినఁడు. అప్పుడు మంత్రు లొక యుపాయము చేసిరి. తా మరణ్యములో నక్కడక్కడ తిరిగి అసురుసురై వచ్చి సేనానివేశములో నున్న రాజుతో నిట్లు చెప్పిరి: "మేము కొన్ని రోమఘులకై యరణ్యమున కేగితిమి. అక్కడ మహాకోలాహల మొకటి విని యది యేమని చూడఁగా ఘోరయుద్ధముఁ జూచితిమి. అందు శ్రీరామచంద్రుఁడు ఖరదూషణాదుల వధించి సీతాలక్ష్మణులతో స్వేచ్ఛగా నెచ్చటికో పోయెను." ఈమాటలు విని అమాయకుఁడు కులశేఖరుఁడు నమ్మెను. సైన్యములను మరలించెను. అప్పటి కాయుపద్రవము తప్పెను. మఱియొకమారు రాజు సీతచెఱ విడిపింతు నని గుఱ్ఱము నెక్కి బయలుదేఱెను. భక్తి పారవశ్యమున నాతని కితరుల ప్రార్థనములు వినరావయ్యెను. అతని వెఱ్ఱి ప్రజల మొరలచేఁ గుదురునది కాదు. అతఁడు తన గుఱ్ఱమును సముద్రతరంగములపై నడిపించెను. ఆ మాహాత్మ్యమునకు మెచ్చి శ్రీమహావిష్ణువు రాముఁడై రమాశేషాహులను సీతాలక్ష్మణులను గావించి ప్రత్యక్షమై, పురి కేగుమని రాజు నాజ్ఞాపించెను.

ఈ రెండువిషయములను బట్టి యమాయికమైన మూఢభక్తి యెంత ఫలకారియో తెలియుచున్నది. మేము తెలివి కలవారము, మాయికులము అని ప్రగల్భములాడు ప్రజలు మాయను తరింపలేక జననమరణరూప సంసారమున నిమగ్నులగుటయు, అమాయికభక్తులు ముక్తినందుటయుఁ గాంచనగును.

మూఁడవది నీళా శ్రీరంగనాథుల వివాహము. నీళ చిన్నప్పటినుండియు రంగభక్తికలది. ఆమె రంగని మహిమ విని అతఁడే తన భర్తయని నిశ్చయించుకొనెను. శ్రీరంగఁడుగూడ ఈమెపై మోహముగలవాఁడు. అందువల్ల కవి ప్రబంధధోరణిని వారిరువురి విరహము, మన్మథాదిదూషణము, శీతలోపచారములు మొదలగున వన్నియు గుప్పించినాఁడు. ఇచట వసంతాది వర్ణనమున ప్రకృతివర్ణన ప్రాగల్భ్యము మిక్కిలిగాఁ బ్రకటింపఁబడినది. నీళ చెలికత్తె యొకతె తన పితృదత్తమైన ఖేచరగమనశక్తిచే శ్రీరంగనికడ కేగి, అతని విరహమును గాంచి, అతనికి తన చెలివిరహము చెప్పి మరల నతఁ డామోద పూర్వకముగ నిచ్చిన కుసుమమాల గొనివచ్చును. స్త్రీవర్ణనము, వివాహవర్ణనము, రంగని యూరేగింపు మొదలగున వన్నియు నంత రుచికరములుగా నుండక విసుగెత్తించును. పూర్వకథలో నున్న సొంపు ఉత్తరకథలో లేకపోవుటకుఁ గారణము పాండిత్యప్రకర్షఁ జూపు నభిలాషయే. లక్ష్మీదేవి శ్రీరంగని నుపాలంభనము సేయుట మిక్కిలి చమత్కారముగా నుండును.

"ఈసారి పెండ్లికూఁతురి
నేసీమం దెచ్చికొనఁగ నిచ్చఁదలఁచితో
ఆ పడి మాననగునే
వేసరకుఁడి క్రొత్తచెలుల వెదకెదు పనికిన్"

ఆముక్తమాల్యదలో విష్ణుచిత్తుని ఛాందసమునకు భగవంతుఁడు మేలమాడెను. ఇక్కడ నట్టి సంఘటన మేమియు లేక పెండ్లి పేరంటములన్నియు సలీసుగా నడచిపోయినవి. శ్రీరంగమునకు వెడలి కులశేఖరుఁ డక్కడనే అప్పగింతలు గావించి సుఖముగా నిల్లు చేరెను. అచ్చట—

"శ్రీవైష్ణవ పూజాసం
భావన లేమఁజుక రామభద్రచరితసే
వావిలసిత హృదయుండై
భూవరుఁ డాళ్వారులనఁగ పొలుపు వహించెన్"

తుదకు కుమారు నభిషిక్తుఁ గావించి విష్ణుసన్నిధికిఁ జనెను.

కవి వ్యాకరణాదిశాస్త్ర పారంగతుఁడు. సామెతలు, గవేషణలు, చతురపాంపతి వంటి గండు పదములఁ బ్రయోగించును. అచ్చటచ్చట నచ్చ తెలుఁగు లలో నోలలాడును. మొత్తముమీఁద సభయభావముల నందముగా మేళవించును. అనుప్రాసాది శబ్దాలంకారములును, ఉపమాద్యర్థాలంకారములును కవి బాగుగ వాడియున్నాఁడు.

శబ్దాలంకారమున కుదాహరణము:

(1) "మదమార గదలు తుమ్మెదల బలరొదల సం
పదల దేఁబొదలు పూఁబొదలు నూచి
జివులువే దవులించు నవులపైసింగంపు
రవళిఁజూపు వెడందగవులు నూచి".

(2) "నేనేనోములు నోచినాడనో శర
న్నిర్నిద్ర పద్మాక్ష నా
నాసైనోనిచయం బడంచితి నితాం
తధ్వాంతముల్ సంతతా
నూనేనో ప్రచయం బడంచు క్రియ ని
న్నుం గొల్తు నెన్నైనగా
నీనేనోవన నౌనౌగలనె రా
నీ నీదయాసారముల్"

ఇది పూర్వప్రబంధకవుల యనుకరణము. పూర్వకవుల పోకడల ననుసరించె ననుటకుఁ గొన్ని పద్యములు:

"చందన సహకార చాంపేయపాటలీ
వకుళపున్నాగ ప్రవర్ణితములు
.....................ఉద్యానవనములు"
(కులశేఖర - ప్రథమాశ్వాసము)

"ఖనటత్పయోధివీక్ష్య రసాతలానోక్ష్య
పిండీకృతాంగ భీతాండజములు
.............. ప్రభంజనములు"
(ఆముక్తమాల్యద 1.3)

"భాషించితివిగదా బహుధర్మసంహితా
నిర్ణీతనిరుపమ నీతికథల"
(కులశేఖర, పుట 35)

"శ్లాఘించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణవేళలందు."
(భీమఖండము-శ్రీనాథుఁడు)

పోతన, కేతన, భట్టుమూర్తి, పాపరాజులనుండి కూడ పెక్కుపోలికలఁ జూపవచ్చును.

కథను సూతుఁడు శౌనకాదులకుఁగాని, నారదుఁ డింద్రునకుఁగాని చెప్పినట్లుకాక, వైష్ణవగురువు శిష్యులకుఁ జెప్పినట్లు గలదు. అంతవఱకు క్రిందికి దిగినందు కీకవిని ప్రశంసింపవలసియున్నది. చాలవఱకు అంధానుసరణము చేయకుండ తప్పించుకొన్నాఁ డనవచ్చును.

వ్యాకరణాదిదోషములు మిక్కిలి స్వల్పముగా నున్నవి. అవి దోషములే కావేమో! ఇంత చక్కని ఈ గ్రంథ మేపుణ్యాత్ములైన వెంటనే ప్రకటించిన నెంత బాగుగనుండును!

---

# హంస విహారము

[రాగము : హంసధ్వని—తాళము: ఆదితాళము]

== శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణారావు ==

పల్లవి

గంగాజలవిహారముచేయ - కాశికె పోవలెనా ? మనసా !

అనుపల్లవి

హంసగ జీవుల అంతరంగమున - గంగాజనకుడు రంగేశు డుండ॥ గంగా॥

చరణములు

౧. రంగదభంగబ్రహ్మానందత - రంగాలలో మహాదేవువలె
అంగజాదిపరమశత్రువుల - సంగపాపపంకము బాపగ॥ గంగా॥

౨. నింగివేలులు నిర్మలమ్ములై - తేజరిల్ల జ్ఞానానంద మహా !
శృంగారాభ్రగంగచాయతోడ - చెలువుగ శ్రీరామకృష్ణుల
బంగారువదనాద్రిని బుట్టి - బాలకృష్ణహంస తేలియాడ
మంగళకరమ్ముగ మన - ముంగిటికే నేడు వచ్చెగదా ! ॥గంగా॥

---

# సంగ్రామానంతరప్రపంచము-జాతీయత

= శ్రీ కోటంరాజు రామారావు =

●

నేను కళాశాల విద్యార్థిగానుండిన దినములలో నా కభిమానగ్రంథమైయుండిన ఒక యుత్తమరాజకీయ ప్రచురణమందు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు జాతీయతయొక్క స్వరూపమును, సిద్ధాంతమును వివరించియుండిరి. అందలి ప్రధానసూత్రములు నేటికిని ప్రమాణములై యొప్పుచున్నవి. 'జాతి' అనగా నేమి? ఏవిధమగు 'జీవశక్తి' యున్నచో అది జాతీయత అనిపించుకొనును? జాతి అనగా సంఘమునందుండు వేర్వేరు తెగలా? లేక మతమా? లేక భాషయా? లేక మరేదైనానా? అనేక తెగలవారు కలసి నివసించుచున్న రాజ్యము లనేకము గలవు. వ్యక్తుల ఆంతరంగికజీవితములయందు తప్ప, సాముదాయికవ్యవహారములయందు మతమునకెట్టి స్థానమును లేని దేశము లనేకమున్నవి. ఐరోపాఖండమందు కడుచిన్నవగు అనేక దేశములలో వేర్వేరుభాషల నుపయోగించు ప్రజ లెందరో గలరు. అందుచే, వీనిలో నే యొక్కటిగాని జాతీయతకు ప్రధానలక్షణమని చెప్పుటకు వీలులేదు. దీనినిబట్టి, జాతీయతకు ప్రధానలక్షణమగు ఐక్యత నైసర్గికముల వలన, అనగా కొన్ని పరిహద్దులమధ్యగల ఏకదేశనివాసమువలననే సిద్ధించుచున్నదిగాని ఇతర విషయములవలన గాదని స్పష్టపడుచున్నది. దీనికితోడు రాజకీయలక్ష్యములయందు ఏకీభావము, సమాన ఆర్థిక ప్రయోజనములు, వానిఫలితముగా, తమ రాజకీయ, సాంఘికసంస్థలను సంరక్షించుకొనుటకు ఏర్పడు త్యాగోత్సాహము మొదలగువానివలన 'జాతీయత'కు జీవము గల్గుచున్నది. ఆధునిక ప్రభుత్వము లన్నియు ఇంచుమించు ఈ 'జాతీయతా' సిద్ధాంతముపైననే ఆధారపడియున్నవి. నేడు ప్రపంచమున గాంచుచున్న విజ్ఞానాభివృద్ధికిని, మన కిపుడు గన్పించు మానవాభ్యుదయమునకును చాలవర కిదియే కారణము. అంతమాత్రమున ఈ 'జాతీయత' పూర్తిగా నిర్దుష్టమైనదని చెప్పుటగాదు. దీనినుండికూడ రెండువిధములగు అపాయము లుద్భవించుచుండును. వానిలో ఒకటి తీవ్రమగు సంకుచిత దేశాభిమానము. ఫ్రాన్సునందలి 'షావనిస్టు'లును, బ్రిటనునందలి 'జింగో'లును, జర్మనీయందలి నాజీలును, ఇటలీయందలి ఫాసిస్టులును ఈ తెగలోనికే చేరెదరు. రెండవది సామ్రాజ్యతత్వము. ఇది నైతికముగ, జాతీయతయంత పవిత్రమైనదిగా పరిగణింపబడకపోయినను, జాతీయతకంటె తీవ్రమైనది, బలవత్తరమైనది. జాతీయతయొక్క ఈ వ్యగ్రరూపమునే, గత నాల్గు దశాబ్దములనుండియు రాజకీయ దార్శనికులు నిరసించుచున్నారు. రవీంద్రనాథ టాగోరువంటి కవీంద్రుడు, చివరి రోజులలో తన కావ్యప్రసంగముల నవలబెట్టి, ఈవ్యగ్రజాతీయతను నిరసించుటకే రాజకీయములన సమీపించెను. జాతీయత (నేషనలిజమ్) అను పేరుతో రచించిన గ్రంథమునందీ ఆధునికజాతీయతను తీవ్రముగ ఖండించెను.

## విశ్వమానవ సౌభ్రాత్రత్వము

రాజకీయములయందు జోస్యము చెప్పబూనుట నిష్ప్రయోజనము. ప్రస్తుత మీ ప్రపంచమునందంతటను రాజకీయముగ స్మశానవైరాగ్యము వ్యాపించియున్నది. భయంకరమగు ఈజాతీయతత్వ మిక చాలునని ప్రతివారును అసహ్యించుకొనుచున్నారు. సంకుచితమగు

నీజాతీయతను వదలించుకొని, విశ్వవ్యాప్తమగు ప్రపంచ సమాఖ్యను నెలకొల్పుకొనవలెనని కోరుచున్నారు. అట్టి సమాఖ్యయందు వేర్వేరుప్రాంతముల ఆర్థిక రాజకీయమైన సమస్యలను, పోటీలను సర్ది సమన్వయపరచుకొనవచ్చుననియు, దానితో మానవజాతీయైక్యత సిద్ధించి, విశ్వమానవసౌభ్రాతృత్వమేర్పడుననియు వారి తలంపు. కాని, అట్టి తలంపులతో నేకీభవింపనంత మాత్రమున, ఇతరులకు తగినంత భావౌన్నత్యము లేదని కాని, ఉన్నతాదర్శములు లేవని కాని, మానవసత్స్వభావమునందు ఏమాత్రము నమ్మకములేనివారని కాని తలంపరాదు. మానవతత్వమునందుగల రాగద్వేషాది అరిషడ్వర్గమును వదలించుకొనుట అంత సులభము గాదు. అందుచేత, ఇంకను చాలకాలమువరకును మనము 'జాతీయత'పై నిర్మితములగు రాజ్యాంగములతోనే సంతృప్తి పడియుండవలసియుండును.

కాని, మన మీవిధముగ నొకవైపున 'జాతీయత'ను వదలుటకిష్టపడక ప్రాకులాడుచున్నను ఇదే సమయమున, అంతర్జాతీయైక్యతకుగూడ పునాదులను నిర్మించుకొనవలసియున్నది. ఈ రెండులక్ష్యముల నొకేసారి సాధింపజాలుట యెంత కష్టసాధ్యమో వేరుగ జెప్పనక్కర లేదు. ఇక్కడనే చిరకాలమునుండియు క్రమముగా వృద్ధిపొంది పరిపూర్ణతనందిన పాశ్చాత్యజాతీయతలకును, ఇంకను అంతపరిపూర్ణస్థితినందని ప్రాచ్యజాతీయతలకును విభేదము లుద్భవించుచున్నవి. జాతి, కుల, మతవిచక్షణల నన్నిటిని తొలగించి, అన్నిజాతులకును కలిపి ఒకేప్రభుత్వము నియమింపవలెనని హెచ్. జి. వెల్సువంటివారు కోరవచ్చును. అది వారికి చాల సులభమే. కాని ఇంతవరకు పారతంత్ర్యమున బడి మ్రగ్గుచున్న భారతజాతి వంటివి అందు కంగీకరింపజాలవు. అందుచే, ఆదర్శవాదులు కోరు అంతర్జాతీయ సమాఖ్యలకుకూడ జాతీయతనే పునాదులుగ నేర్పరుచుకొనుటుచితము. ఆదర్శవాదులు కోరు ప్రపంచసమాఖ్యకు ఈ జాతీయతలు, అంతర్జాతీయ సమ్మేళనములును క్రమముగా ప్రపంచ సమాఖ్యకు సోపానములు గావచ్చును.

## సామ్రాజ్య తత్వము

అందుచే మరికొంతకాలమువరకును జాతీయతలపై నెలకొల్పబడిన రాజ్యాంగ పద్ధతు లిప్పటివలెనే ఇకమీద సాగునని నమ్మవచ్చును. ఇట్టిరాజ్యములసంఖ్య ఇంకను హెచ్చునేకాని తగ్గదు. దీనితోపాటు ప్రపంచమునందు వేర్వేరురాజ్యములు ఆయాప్రాంతీక పరిస్థితుల కనుగుణమగు విధమున వేర్వేరువర్గములుగా నేర్పడును. ఈ సమయమున పైన ఆకాశము, క్రింద భూమి తప్ప ఇతరమగు సరిహద్దులచే పరిమితములుగాని విశ్వమానవ సమాఖ్య నిర్మాణాదర్శముకొరకుగూడ మనము కృషి సల్పుచుండవచ్చును. అంతియకాని, ప్రపంచమందలి సామ్రాజ్యతత్వమంతయు ఆకస్మికముగ నొక్కమారుగ అదృశ్యమైపోవునని తలంచుటకు ఏమాత్రమును అవకాశము లేదు. కనుక ఈ సంగ్రామము ఫలితముగా, ప్రపంచమున నిపుడున్న సామ్రాజ్యతత్వ దేశముల సంఖ్య ఇంకను హెచ్చునే కాని తగ్గదు. అయితే, సామ్రాజ్యతత్వదేశములే జయించినను గూడ, అవి ఇదివరకువలె నంత పెద్దగా ప్రవర్తింపకపోవచ్చును.

వలసరాజ్యముల నేర్పరచుకొని, వానిని సామ్రాజ్యదేశములు స్వలాభముకొరకుపయోగించు విధానము అప్పుడే మారిపోవుచున్నది. సామ్రాజ్యదేశములు జయించినను గూడ ఈపరిణామము ఇంకను త్వరితముగ పూర్తియగునని నిశ్చయముగ జెప్పవచ్చును. ఆవిషయమెటులున్నను, ఈసామ్రాజ్యతత్వములు జాతీయభావముల వ్యాప్తి నేమాత్రమును నిరోధింపజాలవు. ఈ సందర్భమున నొకవిషయమును మరువరాదు. కమ్యూనిజము, సోషలిజములు అంతర్జాతీయ బాంధవ్యముల నధిక మొనర్చి ఐక్యతను నెలకొల్పగలవని కొందరు నుడువుచున్నారు. వానిచే విభేదము లధికమై జాతీయతలు శిథిలమైపోవుచున్నవని ఇతరు లనుచున్నారు. ఆ ఫలితములమాట యెటులున్నను, ఈరెండు క్రొత్తసిద్ధాంతములును సంఘపరిణామమున గల్గించు మార్పులను ఎవరును కాదనజాలరు. వానిశక్తిని స్వల్పపరచి మాటలాడవలసిన అవసరముగూడ లేదు. కాని మానవకల్యాణసాధకములగు ఉద్యమములు ఒకప్పుడు ఆకస్మికముగ దెబ్బతిని కొంతకాలము స్తంభించిపోయిన నిదర్శనములు ప్రపంచచారిత్రమున లేకపోలేదు. అటులనే ఈ యుద్యమములకుగూడ

దెబ్బ తగులవచ్చును. లేక, లెనిన్, ట్రాట్స్కీలవంటి నాయకుల ఆధ్వర్యమున ప్రచండ వేగముతో వ్యాపించి ప్రపంచమునంతను ముంచివేయవచ్చును.

## సంగ్రామము - సామ్యవాదము

ఈనితో సంగ్రామానంతరము ప్రపంచమునగల్గు మార్పులను గురించిన ఆలోచన లేర్పడుట సహజము. ముందు మనము ఐరోపాతో ప్రారంభించుదము. ఈ మహాసంగ్రామమునందు బ్రిటిషు మిత్రమండలిసహాయముతో సోవియటురష్యా విజయ మందుననుకొనుడు! అంతటితో బ్రిటిషుసామ్రాజ్యము అంతరించి, ఈ దేశములన్నియు కలసి ఒక అంతర్జాతీయసమ్మేళనముగ నేర్పడునని తలంపవచ్చునా? అటు లెన్నటికిని జరుగదు. సోవియటురష్యాగూడ ఇపుడు, జాతీయసిద్ధాంతములపై నెలకొల్పబడిన దేశీయప్రభుత్వముగా పోరాడుచున్నదే కాని అంతర్జాతీయధర్మసూత్రము వ్యాపింపజేయుటకు గాని, కమ్యూనిజమును ప్రపంచమున ప్రచారమొనర్పవలెనను ఉద్దేశముతోగాని ఈమహాసంగ్రామమునకు సమకట్టియుండలేదు. సంగ్రామము ముగియునపటికి, ఫ్రాన్సుదేశమునమాత్రము కమ్యూనిస్టు ప్రభుత్వ మేర్పడునని స్టాలిను ఆశ. క్రమముగా ఐరోపాఖండమునందంతను కమ్యూనిజమును నెలకొల్పుటకు ఈ స్వల్పారంభము చాలునని అతని అభిప్రాయము. అందుకు కారణముగూడ లేకపోలేదు. గతమహాసంగ్రామానంతరము ఐరోపా దేశములయందు తీవ్రవాదవర్గములు అనేక అవకతవకలొనర్చి వ్యవహారమును చెడగొట్టియుండనిచో, నేడా దేశములయందు కమ్యూనిజము కాకపోయినను సామ్యవాదమైనను విజృంభించి యుండెడిది. ఫాసిజము ఏమాత్రమును తలయెత్తగల్గియుండెడిది గాదు. ఐరోపాఖండమంతయు సోవియటుపద్ధతులపై నొక పెద్ద సంయుక్తరాష్ట్రములుగ నేర్పడినను గూడ—నేటి రష్యాయందువలెనే—ఐరోపాయందలి వేర్వేరుజాతు లన్నియు స్వపరిపాలితములై తమతమ ప్రత్యేకవిజ్ఞానములను, సంస్కారములను పోషించుకొనుచు అభివృద్ధి నొందుచుండుట కెట్టిప్రతిబంధకము నుండదు. నేటి సోవియటురాష్ట్రసమ్మేళనమందు అనేక దేశములు, అనేక జాతులు చేరియున్నవి. ఆ దేశముల బలముపైనను, అందు గల వివిధజాతులవారు గన్పరచుచున్న అభిమానాదరములపైననే సోవియటురష్యా ప్రభుత్వముయొక్క బలము ఆధారపడియున్నది.

## హిట్లరు జయించుచో?

హిట్లరు ఈ సంగ్రామమున జయించునెడల ఐరోపాఖండమునంతను భారతదేశమువలె నేక మొనర్చి, బర్లినునగరమును తనకు రాజధానిగ నొనర్చుకొని అచటినుండి ఐరోపాదేశముల నన్నిటిని ఏకచ్ఛత్రాధిపత్యముగ పరిపాలించుటకు ప్రయత్నించును. అపుడు ఆ దేశములలో పరస్పరము ఎట్టి సంబంధమును ఉండదు. అవియు జర్మను ప్రభుత్వమునకు సామంతరాజ్యములై పరిపాలింపబడుచుండును. జర్మనులు ఐరోపాయం దిపుడున్న వేర్వేరుజాతులను నిలబెట్టుటయే కాక వాని సంఖ్య నింకను హెచ్చించెదరు. ఐరోపాయందలి ఇతర ప్రజలు ఎన్నిజాతులుగ నేర్పడి, సంకుచితజాతీయతలో బడి యెంత కొట్టుకొనుచున్న జర్మనుల కంత మంచిది. ఈ చిన్నజాతులలో ప్రతిదియు దుర్బలమైనదిగనే యుండును. అందుచే నవన్నియుగూడ తుదకు జర్మనీపైననే ఆధారపడియుండవలసివచ్చును. ఐరోపాఖండమునందు హిట్లరునకు ఆధిపత్యము లభించినయెడల, బ్రిటిషువా రవలంబించుచుండు 'చీలదీసి పరిపాలించు' రాజ్యతంత్రమునే అతడుగూడ ఐరోపాయం దవలంబించును. కనుక, హిట్లరు జయించునెడల, ప్రజలలో చీలికలను కల్పించి దుర్బలపరచు సంకుచితజాతీయతనే ప్రోత్సహించును.

## బ్రిటను జయించినచో?

ఒకవేళ, బ్రిటను స్వశక్తివలన నీసంగ్రామమున జయించి, తన యిష్టానుసారము సంధిషరతులను నిర్ణయింప గలుగునెడల, ఏయొక్క జాతికిని ఎక్కువ ప్రాముఖ్యత గలుగకుండ, అన్నిటిని సరిసమానముగ స్థితియం దుంచుటకు ప్రయత్నించును. ఈ రాజనీతినే (Balance of power) బ్రిటిషుప్రభుత్వము ఆదినుండియు అనుసరించుచున్నది. బ్రిటిషుప్రభుత్వ మట్టిపద్ధతి ననుసరింపనిచో, ఐరోపాయందలి ఇతర జాతుల పోటీవలన బ్రిటిషుసామ్రాజ్యమునకు ఉపద్రవము గల్గును. అంతియకాక, హిట్లరు నిరంకుశపాలననుండి విడిపింప



ఈ ఫోటోలోని రెండు మొసళ్లను దక్షిణ వల్లూరు ఎస్టేటు రాజాగారైన శ్రీ రాజా
చేవల వెంకటలక్ష్మీకాల్లరావు నాయుడు బహద్దరుగారు వేదాద్రివద్ద కృష్ణలో కొట్టిరి.
మొదటి మొసలిసైజు మొసలిని యింతవరకు ఎవ్వరును కొట్టలేదు.

బడిన ఐరోపా దేశములు ఆంగ్లప్రభుత్వపు అభీష్టముల ననుసరించి నడచుకొనుటకు ఎక్కువ సంసిద్ధముగ నుండుననికూడ బ్రిటిషు విదేశాంగ కార్యాలయము వారు భావించుచుండవచ్చును. ఈవిషయమున బ్రిటిషు ప్రభుత్వము ఎట్టిపద్ధతులను అనుసరించినను, — సోవియటురష్యా కది ఏమాత్రము ఇష్టము లేకపోయినను కూడ - దానిని ప్రతిఘటించుటకు తగినబలము లేక సోవియటురష్యా యూరకొనవచ్చును. వెంటనే దానిని ప్రతిఘటించుటకు రష్యా యిచ్చగింపకపోవచ్చును. కమ్యూనిస్టులకు ప్రపంచపరిణామచరిత్ర బాగుగ తెలియును. కమ్యూనిస్టుల తీవ్రవాదము ప్రపంచ సంగ్రామ సంఘర్షణలనుండి యుద్భవించిన మహాశక్తి. సంగ్రామానంతరము పునర్నిర్మితములగు జాతులలో నేదియు గూడ ఈ తీవ్రవాదశక్తియొక్క ధాటిని ఎక్కువ కాలము నిలువరింపజాలదు. కమ్యూనిస్టు సిద్ధాంతములు విజృంభించి, తీవ్రమతావేశముతో ప్రపంచమునంతను ఉప్పెనకెరటమువలె వ్యాపించి తుడిచివేయుచున్నప్పుడు ఏయొక్కజాతిగాని, జాతుల సమ్మేళనముగాని దానిని ప్రతిఘటింపజాలదు. అందుచే, ప్రపంచమున ఇకమీద రాబోవునది సామ్యవాదయుగ మనుట నిశ్చయము. ఆవిషయమున నెట్టిఅనుమానమును లేదు. కనుక జాగ్రత్తగా పరిశీలించినయెడల, స్టాలిను విజయము అనగా చర్చిలుయొక్క ఆదర్శముల పరాజయమని తెలియవచ్చును. అది రూజ్వెల్టుకుగూడ పరాజయమే. స్టాలినువిజయము పైకిమాత్రమే హిట్లరు పరాజయముగను, ఫాసిజమునిర్మూలనముగను కన్పించును. అందుచేత బ్రిటిషుప్రభుత్వమువారిప్పుడు, వెనుకటి అనుభవములవలని గుణపాఠమును నేర్చుకొని, హిట్లరుఆధిపత్యమునుండి విడిపింపబడిన దేశములను బలపరచియు, కొన్నిప్రాంతములలో దేశములనుకలిపి సమాఖ్యల (ఫెడరేషను) నేర్పరచియు, తన కిప్పుడును ప్రమాదమురాకుండచేయుటకు నానాదేశములను సమానబలముగల వర్గములుగా (Balance of Power) విభజించుటకు ప్రయత్నించును. ఈవర్గములను అప్పుడే చూచాయగా మనము కనిపెట్టవచ్చును. వీనిలో ఉత్తరమున స్వీడన్, నార్వే, డెన్మార్కు, హాలండు, బెల్జియములు ఒక సమాఖ్యగా ఏర్పరుపబడవచ్చును. ఫ్రాన్సు, స్పెయిను, పోర్చుగలు దేశములను లాటిన్ దేశములవర్గముగా వేరుచేయవచ్చును. ఇటలీప్రజలలో ఫాసిజమును పూర్తిగా రూపుమాపి, దురాక్రమణాభిలాషను నిర్మూలించినపిదప ఇటలీనిగూడ ఈ వర్గమున చేర్చవచ్చును. బాల్కను దేశములను ఒకవర్గముగా నేర్పరుపవచ్చును. టర్కీ ఈ సంగ్రామమున మిత్రమండలికి ద్రోహముగ ప్రవర్తించినయెడల తురుష్క ప్రభుత్వమునకు ఐరోపా సరిహద్దులలోనే ప్రవేశము లేకుండ జేయబడును. ఇవిగాక బాల్టికు సముద్రమునుండి దక్షిణమున నల్లసముద్రమువరకును గల దేశములను 'తూర్పుదేశముల' వర్గముగా ఏర్పరచెదరు. ఈ వర్గమునకు జెకోస్లావేకియా దేశము శిరోరత్నముగ నుండును. బలవంతములగు ఈ వర్గములు చుట్టుముట్టియుండుచో, మధ్యనున్న జర్మనీ యెన్నటికిని తలయెత్తుకొనజాలదు. ఐరోపారాజ్యములకు జర్మనీవల్ల ఇక ఎన్నటికిని ఉపద్రవము కలుగుట అసంభవమగును. ఐరోపా రాజకీయములలో జర్మనీకి ఇక నేవిధమగు ప్రాముఖ్యతయు నుండదు. ఇది సంగ్రామానంతరము బ్రిటిషుప్రభుత్వమువారు అవలంబింపదలచిన పునర్నిర్మాణ ప్రణాళిక. ఈడెన్ గారికీవిధానమునెడల చాల అభిమానము. అయితే ఈ ప్రణాళిక క్రియారూపమున అమలులోనికి వచ్చునా అను విషయము వేరు. వచ్చినను రాకపోయిననుగూడ దానితో సోవియటు రష్యా కెట్టి ప్రసక్తియు నుండదు. రష్యామాత్రము మొదట, సంగ్రామమువలన శిథిలమైపోయిన తన ఆర్థిక పారిశ్రామిక నిర్మాణమును పునరుద్ధరించుకొనుచు, సేదదీర్చుకొనుచుండును. అటుపిమ్మట ధనస్వామ్యతమీదను, తమ గర్భశత్రువగు సామ్రాజ్యతత్వముమీదను పోరాటమును ప్రారంభింపవచ్చును.

## కెనడా-అమెరికా

ఇక ఇతరఖండములలోని దేశములవిషయ మాలోచించుదము. అమెరికా సంయుక్తరాష్ట్రములు నైతికముగా కెనడాను తనలో ఇంచుమించు పూర్తిగా కలిపివేసుకొనినట్లే. ఈ సంగ్రామమునందు బ్రిటను విజయమందిననుగూడ కెనడాలో అమెరికాసంయుక్త రాష్ట్రములు నెలకొల్పుకొనిన ప్రాబల్యమును తగ్గింప

లేదు. కెనడా ఇక బ్రిటిషు 'డొమినియను'లలో నొకటిగ నుండదనియే భావింపవచ్చును. దక్షిణ అమెరికా రాష్ట్రములకు వాషింగ్టను (అ. సం. రా)యొక్క ధనస్వామ్యసామ్రాజ్యతత్వ మనిన అపరిమితమగు భయము. హిట్లరు వచ్చి తమ రాష్ట్రముల నాక్రమించుకొనునను భయమువలనను, యుద్ధపరిస్థితులవత్తిడివలననుమాత్రమే ఆ దేశము లిపుడు సంయుక్తరాష్ట్రములతో కలసి పని చేయుట కంగీకరించినవి. ఈప్రాంతములయందు ఇంకను ఉపయోగములోనికి దెచ్చుకొనబడని ప్రకృతిసంపద ఎంతయో కలదు. ఈరాష్ట్రములు తరుచు విప్లవములకు గురియగుచుండును. ఒకరాష్ట్రమునకు మరియొక రాష్ట్రమునకు అన్యోన్యత అనునది ఆరాష్ట్రములలో అసలే లేదు. ఈరాష్ట్రము లిటుల పరస్పరము కలహించుకొనుచుండుట సంయుక్తరాష్ట్రములకు ఏమాత్రమును లాభకరము గాదు. అయినను ఇప్పటివలెనే ఇకమీదగూడ నీరాష్ట్రములను వేర్వేరు స్వతంత్రరాష్ట్రములుగనే యుంచవచ్చును. ఈరాష్ట్రము లెటులున్ననుగూడ ఉభయఖండములను సంరక్షించుకొనగలశక్తి సంయుక్తరాష్ట్రములకు గలదు. అవసరమగుచో, అమెరికా, అట్లాంటికుసముద్ర ప్రాంతములందును, పసిఫిక్ సముద్ర ప్రాంతములందును విశాలమగు భూఖండముల నాక్రమించుకొని పరిపాలించుటకుగూడ సంయుక్తరాష్ట్రములకు తగినంత బలము గలదు.

## ఆస్ట్రేలియా

ఆస్ట్రేలియా చాల విశాలమగు దేశము. అక్కడ నివసించుప్రజల సంఖ్యకంటె ఆదేశపు విస్తీర్ణము యొక్క చదరపుమైళ్లసంఖ్యయే యెక్కువ. అన్నివ్యవహారములును సరిగా సాగినయెడల, ఈ సంగ్రామాంతమున ఆస్ట్రేలియాప్రజలు తమ జాతీయతను చాలవరకు సంస్కరించుకొనవలసియుందురు. ప్రస్తుతము ఆస్ట్రేలియా దేశమున తెల్లజాతులవారు దప్ప ఇతరులు నివసింపరాదను నియమము గలదు. ఈవిధానము ఆస్ట్రేలియాకును, బ్రిటిషుసామ్రాజ్యమునకునుగూడ చాల అపాయకరము. అమెరికాసంయుక్తరాష్ట్రముల వారికి తమదేశపు ప్రకృతిసంపద నుపయోగములోనికి దెచ్చుకొనుటకే ఇంకను మనుష్యులు కావలసియున్నారు. ప్రస్తుత సంగ్రామమున గల్గు నష్టములవలని ఆంగ్ల దేశమునందు, ఆస్ట్రేలియాకు పార్లిపోవలసినంత మిక్కుటమగు జనాభా యుండదు. ఆంగ్లేయులకు ఆస్ట్రేలియాకంటె కెనడా దేశము చాలదగ్గర. ఎక్కువ ఫలవంతమైనది. అందుచే ఆస్ట్రేలియావారు ఇతర దేశముప్రజలను వలస దెప్పించుకొనవలసియుందురు. సంగ్రామానంతరము సంధిసమావేశమున ఆసియాజాతులప్రజలంపూర్తిగానిరసింపబడి త్రోసివేయబడిననే తప్ప, ఆస్ట్రేలియాకు వలసపోయి అచట నివసించుట కెంతయు ఉత్సాహముతో నంగీకరింతురనుటకు సందేహము లేదు. దీనిఫలితముగా కొలదికాలములోనే ఆస్ట్రేలియాయందొక కొత్తజాతి యుద్భవించుట నిశ్చయము. సంగ్రామఫలితము లెటులైననుగూడ,ఆస్ట్రేలియాయందీమార్పు జరిగితీరుననిమాత్రము చెప్పవచ్చును.

## ఆఫ్రికా

ఆఫ్రికాఖండమున దక్షిణాఫ్రికా, మొరాకో, ఈజిప్టుదేశములయందు తప్ప జాతీయతయనునది కనుపింపదు. కాలక్రమముగ నాజాతులయందుగూడ జాతీయత, విజ్ఞానములు వ్యాపించి అభివృద్ధిపొందిననే తప్ప ఆఫ్రికాఖండమునుగురించి ఈ సందర్భమున నెక్కువ చర్చింపవలసిన అవసరమెద్దియు లేదు. ఆఫ్రికాయందలి ఆదిమజాతులవారు పారస్వత్వములను బడసి, పలుకుబడిని సంపాదించుకొని శ్వేతజాతీయుల ఆధిపత్యమును తొలగించుకొనువరకును స్మట్సుసేనాని, హెర్జాగ్ సేనాని మొదలగువారే ఆఫ్రికావ్యవహారములు చక్కబెట్టుకొనుచుందురు.

## ఆసియా

ఇక, ఆసియాఖండమున నున్న రష్యాప్రాంతము గాక మిగిలినదేశముల సంగతి. వీనిలో ముట్టమొదట ఆసియా పడమటిప్రాంతమునను, మధ్యప్రాంతమునను గల మహమ్మదీయ రాజ్యములను పేర్కొనవలసియున్నది. అవిగాక తూర్పున చైనా, జపాను లున్నవి. మధ్యప్రాంతమున దక్షిణముగ భారతదేశ మున్నది.

ఇస్లాంమతము విశ్వమానవ సోదరత్వమును ప్రతిపాదించుచున్నది. సంకుచితమగు జాతీయభావమున

కామతమునందు తావు లేదు. గత మహాసంగ్రామానంతరము, ఖిలాఫత్‌ను శిథిలపరచుటకు బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వములు ప్రయత్నించినపుడు కీ. శే. న్యాయమూర్తి అమీర్ ఆలీగా రట్టిచర్యను ఖండించుచు, ఖిలాఫతును తొలగించుటవలన, మహమ్మదీయసౌభ్రాతృత్వమును నిర్మూలించి, దానికిబదులు, మహమ్మదీయమత సిద్ధాంతములకును, సంప్రదాయములకును విరుద్ధమగు సంకుచిత జాతీయతావిష బీజముల నా దేశములయందు నాటుచుండిరని ఆక్షేపించిరి. గత మహాసంగ్రామానంతరము, మధ్య ఆసియాప్రాంతమున బ్రహ్మాండమగు మరియొక బ్రిటిషుసామ్రాజ్యమును సృష్టించుటకు చర్చిలు తలపెట్టెను. కాని అందు కాతడు ఏర్పరచిన పథకమునందుగూడ, ఆ దేశముల ఐక్యతను గుర్తించు సూచనలు గలవు. ఆపథకము ననుసరించియో, ఇపుడు అరబ్బీదేశములన్నియు నొక సమ్మేళనముగ నేర్పడుటకు ఆందోళన మొనర్చుచున్నవి.

ఈ దేశము లసలే కడు పేద దేశములు. వానికిగల అన్యోన్య ఆర్థికసంబంధములు అత్యల్పము. అందుచే వానినిగురించి అంతగ చెప్పదగిన దేదియు లేదు. కాని, వీనిలో ఒక్క పర్షియాతప్ప (అది సోవియటు రష్యాలో చేరును) మిగిలిన దేశములన్నిటిది ఒకేజాతి, ఒకేమతము, ఒకేభాష. ఆ దేశములన్నియు ఇరుగు పొరుగుననే కలసియున్నవి. కాని, ఒక వైపున పాశ్చాత్య సామ్రాజ్యతత్త్వము, మరియొకవైపున సోవియట్ రష్యా ఈ దేశములలో ప్రవేశించి స్థావర మేర్పరచుకొనినయెడల నీ దేశములన్నియు కలసి ఏకరాజ్యముగ నేర్పడుటకష్టము. వారీ దేశములను వేర్వేరు జాతులుగనే నిలిపియుంచెదరు. ఈ దేశముల జాతీయతను శిథిలపరచుచుండు ప్రతికూలశక్తులను నిరోధింపగల సామర్థ్యము ఇస్లాంమత సిద్ధాంతములయందుగల ప్రచండమగు జీవశక్తికిమాత్రమే కలదు.

జపాను—నూతనవ్యవస్థ

తూర్పు ఆసియా దేశములను గురించి చర్చించునపుడు, జపాను ప్రకటించుచున్న 'నూతన వ్యవస్థ'ను గురించియు, 'సమానసౌభాగ్యప్రాంత' సిద్ధాంతములను గురించియు మొట్టమొదట స్ఫురణకు వచ్చుట సహజము. జపాను ఈ యుద్ధమున పరాజయమునంది శిథిలమైపోవుచో, ఇతర ప్రాంతములలో ఇంతవరకు జపాను జయించుకొనియున్న రాజ్యము లన్నియుగూడ లాగుకొనబడును. కొరియా దేశమును, చైనాయం దిటీవల ఆక్రమించుకొనిన ప్రాంతములనుగూడ, ఒక్క అంగుళమైనను మిగులకుండ, జపాను తిరిగి ఇచ్చివేయవలసియుండును. జపాను 50 సంవత్సరములకిందట ఏ స్థితియందుండెనో ఆ స్థితికే మరలవలసియుండును. అటులగాక సంగ్రామానంతరము జపాను ఏదోవిధముగ రాజీపద్ధతులవలన, ఇంకను గొప్ప రాజ్యములలో నొకటిగ నిలచియుండునెడల, పసిఫిక్ ప్రాంతములయందలి ఆసియా దేశములకును, స్వపరిపాలితములగు చైనా, ఇండియాలకును కలిపి పెద్ద సమ్మేళనమును నెలకొల్పి, తానుగూడ ఆసమ్మేళనమున చేరవలసివచ్చును. జపాను ప్రపంచమున నిలువవలెననినయెడల, ఇట్టి సమాఖ్య చాల అవసరము.

చైనా

చైనాప్రజలలో జాతీయభావ మిపుడు చాల దృఢముగ నాటుకొనిపోయినది. దానిని కదల్చుట కిక నెవరికిని సాధ్యము గాదు. కాలక్రమమున, కొలది కాలములోనే, చైనా ప్రపంచములో కెల్ల మిక్కిలి బలవత్తరమగు దేశమగును. భారతదేశముకంటె చాల ముందుగనే చైనా ఇట్టి ఔన్నత్యము నందగలదు. దాని ఫలితము లీలోపుననే భారతజాతీయస్వాతంత్ర్యోద్యమముపైనగూడ ప్రతిఫలించి, భారతజాతీయోద్యమ విజయమునకు చాలవరకు తోడ్పడును. ఇటీవల చాంగ్ కై షేకు మహాసేనానియొక్క భారతదేశాగమనము చైనాభారతదేశముల కేర్పడగల భవిష్యత్సంబంధమును సూచించుచున్నది.

జాతీయతనుగురించి ఇంతవరకును జరిగిన చర్చయందు రెండుముఖ్యసిద్ధాంతములు బయల్పడినవి. అందొకటి: ఇకమీదగూడ ప్రపంచమున జాతినిబట్టియే ప్రభుత్వము లేర్పడి రాబోవు ప్రపంచనిర్మాణమున నట్టిజాతీయప్రభుత్వములే ప్రధానోపాంగములుగ నుండునని. రెండవది: వైవిధమగు జాతీయప్రభుత్వములు ఆయా ప్రాంతములబట్టిగాని, భాషనుబట్టిగాని, మతమునుబట్టి

గాని, జాతినిబట్టిగాని, వానికిగల సమానఆర్థికప్రయోజనములను బట్టిగాని, దేశరక్షణసమస్యలనుబట్టి గాని వేర్వేరు సమ్మేళనములుగ నేర్పడునని. యథార్థమున నీ రెండును ఒకటే. మొదటిది సంకుచితమైన జాతీయత; రెండవది అంతకంటె కొంచెము విశాలమైన జాతీయత.

## భారత దేశము

పై విషయములు మన భారతదేశమునకు విశేషముగ వర్తించును. అటుల నుడువునపుడు, ఇకమీద గూడ ఏదో యొకరూపమున, కొంతవరకైనను, బ్రిటిషుపరిపాలన మీ దేశమున నింకను నిలిచియుండునను భావముతో మాటలాడుచుంటిని. అంతమాత్రమున మన మాస్థితిని హర్షించెదమనికాని, అటులనే జరిగితీరుననికాని తలంపరాదు.

మన దేశమున ముస్లింలీగుతప్ప, భారత జాతీయతను ఆక్షేపించుచున్నవారెవ్వరును లేరు. భవిష్యద్భారతరాజ్యాంగమును నిర్ణయించుట కేర్పడు భారత ప్రజాప్రతినిధిసమావేశమున పాకిస్థాన్ సూచనను గురించి చర్చ జరుగవచ్చును. కాని తుద కిది తప్పక త్రోసివేయబడును. పాకిస్థానమును బలవంతముగ నీ దేశముపై విధించుయెడల వెంటనే ఈ దేశమున అంతస్సంగ్రామములు చెలరేగును. ఎంతయో ప్రయాసపడి ఇంతటి మహాసంగ్రామమును జయించిన బ్రిటిషు ప్రభుత్వము భారతదేశమునకు గల ప్రకృతిసిద్ధమగు రక్షణ ఏర్పాటులను దుర్బలమొనర్చునట్టి, పైవిధమగు విభజనకు ఏమాత్రమును అంగీకరింపదు. కనుక భారతదేశపు ఐక్యతకు ఏ విఘ్నమును భంగమును గలుగదని నమ్మవచ్చును. అయితే ఇక తరువాతిమాట యేమిటి? సంగ్రామానంతరము భారత దేశము, సంపూర్ణముగ కాకపోయినను చాలవరకు స్వపరిపాలితమై యుండునని నమ్మవచ్చును. దీనినిగూడ మనము అనుకొనుచుంటిమే కాని, అటులనే జరిగితీరునని యెవ్వరును చెప్పలేరు. ఎటుల జరిగినను జరుగవచ్చును. కాని, ఈ సంశయము వలన మనము భారతజాతీయతయొక్క భవిష్యదభివృద్ధినిగురించిన ఆలోచనలను మానవక్కరలేదు. ఆజాతీయతను ఎటుల సంరక్షించుకొనగలమా యనునదే ప్రస్తుత ప్రశ్న.

విదేశీయసంబంధముల దృష్టితో చూచినయెడల మన దేశము నైసర్గికముగ చాల అనుకూలమగు స్థితియందున్నది. ఇంత అనుకూలమగు స్థితి ప్రపంచమున మరియే యితర దేశమునకు లేదు. ఇకమీద బ్రిటిషుసామ్రాజ్య శిథిలములపై నిర్మింపబడు ఆంగ్లస్వతంత్రరాజ్యముల సమ్మేళనమున, మనమిష్టపడుచో, భారత దేశముగూడ ఒక భాగముగ నుండవచ్చును. మన దేశమున ఏడుకోట్ల మహమ్మదీయులు గలరు. అందుచే మనము ఇకమీద నేర్పడు ఏ మహమ్మదీయరాష్ట్రముల సమ్మేళనమునందైనను చేరవచ్చును. లేక ఆసియా రాజ్యముల మహాసమ్మేళనమునగూడ మనకు ప్రధానమగు స్థానము లభింపవచ్చును. ఈ సమ్మేళనములలో నేదియుగూడ మనలను వదలిపెట్టుట కిష్టపడకపోవచ్చును. వేనిలో చేరినను గూడ భారతదేశ మికమీద ప్రపంచ చారిత్రమున చాల ముఖ్యమగు పాత్రను వహించునని చెప్పవచ్చును.

ఒక్క ముస్లింలీగువారు, వారి పాకిస్థాన్ వాదమును వదలివేసినయెడల ప్రజలలో వ్యాపించియున్న ప్రతి యుద్యమముగూడ భారతజాతీయైక్యతను బలపరచుటకే కృషిసల్పుచున్నవి. బ్రిటిషుప్రభుత్వమునుండి మన కిపుడు సంక్రమింపనున్న విశాలమగు నీ దేశమునకు పరిహద్దు లిదివరకే స్పష్టపరుపబడియున్నవి. దేశమునందలి ప్రతిప్రాంతమునకును నిర్మింపబడియున్న విస్తారమగు రైలుమార్గములవలనను, టెలిగ్రాఫులవలనను, విమానాది ఇతర యాన సౌకర్యములవలనను దూరము లదృశ్యమై దేశమునం దొక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు గల సంబంధబాంధవ్యములు మరింత బలపరుపబడి, కుదురైన రాజ్యాంగమునకు సకలసౌకర్యములును సమకూర్పబడియున్నవి.

## సంస్థానములు

మన రాజ్యాంగ స్వరూపము నిర్దిష్టముగ సమాఖ్య (ఫెడరలు) పద్ధతియందుండును. ప్రపంచమున జరామరణబాధితమగు ఇతర జీవకోటివలెనే ఈ దేశమునందలి సంస్థానాధిపతులుగూడ అదృశ్యము గావలసియుందురు. వీరికి మూడుదశాబ్దములకంటె ఎక్కువ వ్యవధి నొసగ నక్కరలేదు. ఈ సంస్థానములకు అపుడే 'మరణశిక్ష' విధింపబడియున్నది. ఆధునిక జీవితపద్ధ

శాంతిఅశోక

# శాంతి అశోక

స్త్రీలపాలిట
సౌభాగ్యవల్లి
రజోదోష
మూలమున
అ కురించెడి
అస్వస్తత లన్నింటిని
త్వరితముగను
శాశ్వతముగను
నివారింపజేయును.

సోల్ డిస్ట్రిబ్యూటర్లు :—

**తటవర్తి నారాయణమూర్తి**

**అండ్ సన్సు, భీమవరం.**

---

శత్రు
వు ను
ఇండి
యాకు
దూర
ముగా
నుం
చు

గవ
ర్నరు
యుద్ధ
నిధికి
తిరిగి
చందా
లను
ఒసం
గు

డు

---

డిఫెన్సు బాండ్లు,
సేవింగ్సు సర్టిఫికెట్లను యింకను
విశేషముగా కొనుడు.

# విజయమునకు

ధర్మముగాను, అప్పుగాను
ధన మొసంగుడు.

వెలువడును! సంవత్సరాదికి సుప్రసిద్ధ గ్రంథము!

శ్రీ చిద్ఘనానందేంద్ర సరస్వతీస్వాములవారి

(కోరంకి వెంకట్రామశర్మగారు, బందరు.)

# భగవద్గీతోపన్యాసములు

## నాల్గవ కూర్పు

ఇందు గీతామూలము, ఉపన్యాసములు, గీతాసారము, అర్థసంగ్రహములు గాక, నూతనముగ గీతామృతము, ధ్యానశ్లోకములు చేర్చబడి, మంచి దళసరి గ్లేజు కాగితముపై ముద్రింపబడి క్యాలికోతో బైండు చేయబడినది. 560 పేజీలు.

వెల పుస్తకము 1-కి రు **2=0=0** పోస్టేజి ప్రత్యేకము.

వలయువారు:

**మొరుసుపల్లి హనుమంతరావు,**

బి. యే., యం. యల్., వకీలు.

బ్రాడీపేట - గుంటూరు.

---

**10,000 మందికి పైగా**

మహారాజులు, జమీందార్లు, గొప్ప గొప్ప డాక్టర్లు, ఇంకా యితర ప్రముఖులు స్వయంగా వుపయోగించి మెచ్చుకొనిన ఔషధరాజము.

# Veerya Bund

వీర్య బంద్ (రిజిస్టర్డు)

గంటలలో, నీరైన వీర్యమును వజ్రమువలె గట్టిపరచి ఎంత బలహీనునకైన సంసారసుఖ మిచ్చును. మాత్రములోను, కలలోను పోయెడు శుక్లనష్టమును పోగొట్టి ముసలివారికిగూడ యౌవనమునగు సాటిలేని ధాతుపుష్టి ఔషధము. పెద్దబుడ్డి (40 రోజులకు) 3-8-0; సీసా మాత్రలు (20 రోజులకు) 2-0-0; 10 రోజులకు ½ సీసా 1-4-0. వీ. పి. ఛార్జీలు వేరు. క్యాటలాగు ఉచితము (ఉత్తరములు రహస్యంగా యుంచబడును.)

**అమృతరత్నాకర ఫార్మసీ,**

53, గోవిందప్పనాయకన్ వీధి, మద్రాసు.

---

జండు




# అయొడైజ్‌డ్ సరసపరిల్లా

రక్తశుద్ధినికలుగజేయు దివ్యౌషధము. బొల్లి (సిఫిలిస్) యందును, దానివలన వచ్చు కీళ్ళనొప్పులు, కీళ్ళవాపులు, చర్మముమంటలు మొదలగువాటియందును కడుశీఘ్రముగ గుణము నిచ్చును. చర్మముపైనుండు అన్నివిధములగు నల్లనిమచ్చలను పోగొట్టును. చెడురక్తము వలన సంభవించువ్యాధు లన్నిటికిని నమ్మకమైనమందు. హిందూదేశపు సుగంధిపాలతో తయారుచేయబడినది. ప్రతిడ్రామునందును 2 గ్రెయినులు పొటాసియం అయొడైడ్ చేరియున్నది.

సీసా 1-కి రూ. **1-0-0.**

సబ్ ఏజంట్లు:-- బెజవాడ: చంద్రమౌళీశ్వర్ అండు కో. మచిలీపట్నం: కె. వి. మాణిక్యరావు. నెల్లూరు: ఆర్యన్ ఫార్మసీ. తెనాలి: శ్రీ కృష్ణా ఫాన్సీ స్టోర్సు. ఒంగోలు: తాతా జాలయ్య శ్రేష్ఠి. గుంటూరు: మెడికల్ అండ్ ఆప్టికల్ యంపోరియము. పెద్దాపురము: వేలు మెడికల్ స్టోర్సు. విశాఖపట్నం: నీలం అండు కో. అనకాపల్లి: కె. యం. స్టోర్సు. నంద్యాల: రాజా పెద్దసుబ్బారాయుడు శెట్టి. రాజమండ్రి: ఈశ్వరదాస్ అండ్ కో.

లేనియెడల రాజధాని ఏజంట్లవద్ద దొరుకును.

**దామోదర్ అండ్ కో.,**

92, పెరుమాళ్ మొదలివీధి, మదరాసు.

ణాము ప్రాపంచికముగను, ఆధిభౌతికముగను నుండును. తత్ఫలితముగ నిత్యజీవితమునందు మతాచారములకును, సిద్ధాంతములకును, ప్రత్యేక విశ్వాసములకును స్థానము లేకపోవచ్చును. ఈ యాధిభౌతిక పరిస్థితి అంతరించవలె నని భారతీయులు కోరరు. ఈ స్థితియం దుండగనే భిన్నభిన్నవిశ్వాసములు తొలగి యేకత్వము సిద్ధించునని వారి నమ్మకము. ఏకైక సంప్రదాయము, సర్వ సామాన్యమతము, విశ్వజనీనమగు జాతీయ వ్యక్తిత్వము పరస్పరస్వయంపోషక ఆర్థికవ్యవస్థలకు తోడు ప్రజాశక్తినంతను కేంద్రీకరించుకొని విజృంభింప జేయగల కేంద్రజాతీయస్వపరిపాలనాసంస్థలును మన కవసరము. కేవలము ప్రాంతీయవిషయము లన్నిటికిని స్థానికమగు స్వపరిపాలనాపద్ధతులను నెలకొల్పుకొన వచ్చును. కొన్ని అసంగతాంశములను వదలివేసి ప్రత్యేకాభిమానములకు అవకాశ మొసగక విశాలదృష్టితో సంచరించినయెడల అన్నిమతములునుగూడ భారత జాతీయరాజ్యనిర్మాణమునకు తోడ్పడగలవు. స్వతంత్ర భారతదేశమునందు నేడుగాన్పించు పురాతనహిందూ సాంఘికవ్యవస్థలకు స్థానముండదు.

## హిందూసంఘము

ఇకమీద కులభేదము లంతరించును. హిందువుల కిది నిజమగు 'శుద్ధి' ఉద్యమ మనియే చెప్పవచ్చును. ప్రజాప్రాతినిధ్యపరిపాలన యనగా ప్రజలయం దధికసంఖ్యాకుల యభిప్రాయమును బట్టి పరిపాలించుట. అందుచే మతాభిమాన మధికముగగల హిందువులే అందరికంటెను ముందుగ సంఖ్యాబలముచే ఇపుడు తమకుగల ప్రాధాన్యతను కాపాడుకొనుటకు ప్రయత్నించెదరు. నిమ్నజాతుల వారిని సవర్ణహైందవులనుండి వేరుచేయుటకు రెండు దశాబ్దములుగా జరుగుచున్న ప్రయత్నములు సఫలమగుచో హిందూసంఘము ఈదేశమున అల్పసంఖ్యాక సంఘముగ మారిపోవును. అందుచే హిందువులు ప్రస్తుత హరిజనోద్ధరణోద్యమమును చాలముఖ్యమగు రాజకీయోద్యమముగ పరిగణింపవలసియుందురు. కనుక సనాతనిస్టుల కిక నీదేశమున భవిష్యత్తు ఉండదు. ఈవిధముగ సంస్కరింపబడి పునరుజ్జీవితమై నూతనశక్తితో విజృంభించు హిందూసంఘము భవిష్యద్భారత రాజ్యాంగ నిర్మాణమునకు మార్గమును చదునుచేసి పునాదుల నమర్చును. భారతీయులయం దెన్నియో సంఘములు, ఎన్నియో మతవిశ్వాసములు ఉండవచ్చును. వారందరునుగూడ భారతదేశపు క్షేమమునే లక్ష్యముగ నిడుకొనునంతకాలము వానివలన భారతజాతీయత కెట్టి నష్టము నుండదు. భవిష్యద్భారత రాజ్యాంగమును గురించిగాని, అప్పటి సాంఘిక నిర్మాణమును గురించి గాని వివరముగ చర్చింప బూనుచో నది పెద్ద గ్రంథ మగును. ఇంతవరకు మనము రాష్ట్రీయ స్వపరిపాలనావిధానమును అనుసరించి చూచితిమి. అది జయప్రదముగనే పనిచేసెను.

## ఆంధ్ర రాష్ట్రము

కాని మన మీవిధానమును ఇంకను విపులమొనర్చి దేశమునందుగల అనేక 'ఉపజాతుల'కుగూడ వర్తింపజేయ వలసియున్నది. ప్రజాప్రాతినిధ్యపరిపాలనమును సౌష్ఠవముగ నిర్వహించుటకును, భారతజాతి సర్వతోముఖ వికాసమునందగల్గుటకును దేశమునంతను భాషాప్రయుక్త రాష్ట్రములుగ విభజించు టవసరమను సిద్ధాంతమును నేడందరు నంగీకరించుచునేయున్నారు. ఎట్టి ఆటంకములు వచ్చినను సరే, వాని నన్నిటిని తొలగించుకొని ఈసిద్ధాంతమును ఆచరణయం దనువర్తింపవలెను. కృష్ణాగోదావరీస్రవంతులు సముద్రమునకు ప్రవహింపకుండ నిరోధించు టెంత దుస్సాధ్యమో, ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు అడ్డుదగులుటగూడ అంతదుస్సాధ్యమే. జనాభానుబట్టి పోల్చిచూచుచో, ఈదేశమునందలి ప్రజలలో ఆంధ్రులు మూడవస్థానము నాక్రమించుచున్నారు. దీనినిబట్టియే భారతదేశమందలి వేర్వేరు భాషలలోను, ఉపజాతులలోను ఆంధ్రులయొక్క ప్రాముఖ్యత అంగీకరింపబడవలసియున్నది. ఆంధ్రదేశమునందలి సముద్రతీరపు జిల్లాలు భారతదేశములో కెల్ల మంచిసారవంతములగు ప్రాంతములలో గణన కెక్కినవి. ఆంధ్రభూగర్భమున, ఇంతవరకును కనుగొనబడని, అపారమగు ఖనిజసంపదగలదు. మనకు వందలకొలది మైళ్ళపొడుగుగల సముద్రతీరము గలదు. సముద్రయానము, సముద్రాంతరదేశములతో

వాణిజ్యము ఆంధ్రులకు అనాదిగా సంప్రదాయ సిద్ధములై వచ్చుచున్నవి. మనదేశము, ఉత్తరదక్షిణ హిందూస్థానములకు మధ్యభాగమున నున్నది. దక్కను ప్రాంతముల విదేశవాణిజ్యమంతను ఆంధ్రదేశమే ఆక్రమించుకొనవచ్చును. ఈవిధముగ వర్తమానభారతీయ జీవితమందును భావిభారతజాతీయాభ్యుదయమునందును ప్రధానమగు స్థానమును వహించుటకు ఆంధ్రజాతికి సహజసిద్ధమగు చక్కని అవకాశము లెన్నియో కలవు.





# జగన్నాథుని రథం

[కథానిక]

= శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి =

౧

జీవితంలో వచ్చే ప్రతికష్టానికీ, సుఖానికీ మనకు తెలిసినా తెలియకపోయినా ఏదో కారణం ఉండితీరుతుందికదా. ఒకప్పుడు మహాపద ఏదేనా వచ్చినా, ఒకప్పుడు మహాసంతోషం ఏదేనా కలిగినా దానికికారణం జన్మాంతర దుష్కృతమో, సుకృతమో అనుకుంటాను. జన్మాంతరందాకా అవసరం లేదంటాను - కొన్ని సంవత్సరముల జీవితం మనం తిరగేసి చూచుకుంటే, కారణం అక్కడే ఉంటుంది. అది అతి స్వల్పమైన విషయం కావచ్చు. అప్పుడు మనం దాన్ని లెక్కచేసి ఉండకపోవచ్చు. ఆకారణంచేత అది చేసే పని అది మానదుకదా !

మా సాంబశివుడి చావుకుమట్టుకు ఆరోజున మేము వెళ్లిన సభే కారణమని నా దృఢవిశ్వాసం. అతని చావుకే కాదు, ఇక్కడ చెప్పబోయే విషాద గాథ కంతకూకూడా ఆనాటి సభే కారణ మంటాను. దానికి కారణం జన్మాంతరం కావచ్చు. అది వేరే సంగతి. ప్రస్తుతకారణం (Immediate cause) సంగతి నేను చెప్పేది.

పడుపువృత్తినిర్మూలనచట్టము కొత్తగా ప్యాసు అయిన రోజు లవి. దాన్నిగురించి దేశంలో కొంత గగ్గోలు బయలుదేరింది. ఈ చట్టాన్ని ప్రజలకు బాగా విశదపరచి అమలులో పెట్టడానికి మద్రాసుపురప్రముఖులు కొందరు పూనుకున్నారు. ఒకసభ ఏర్పాటుచేశారు. చిత్రంగా ఉంటుంది–మనుష్యుల ఆలోచనలూ, చర్యలూ చూస్తుంటేను. ఒక్కొక్కకాలానికి ఒక్కొక్క పద్ధతి! పూర్వకాలంలో అయితే ఎవడిపని వాడు చూచుకుంటూ, జపమో తపమో, యజ్ఞమో యాగమో చేసుకుంటూ ఎవడి తరణోపాయం వాళ్లు చూచుకోడమే కాని, ఇంకొకణ్ణి తరింపచెయ్యా లనుకునే రోజులు కావవి. "స్వయం తీర్ణః పరాన్ తారయతి" రోజు లవి. ఇప్పుడలా కాదే! మన సంగ తెప్పుడేనా చూసుకోవచ్చును - ముందు పక్కఇంటివాళ్ల సంగతి, గ్రామం సంగతి, దేశంసంగతి చూచి, వాళ్ల నుద్ధరించే ప్రయత్నం చెయ్యాలనే రోజు లివి. మనం పాశ్చాత్య ప్రభువులవల్ల నేర్చుకున్న ధర్మసూక్ష్మాల్లో ఇదొకటి. అందుచేత ప్రతిదానికీ ఒకసభా, ఒకకమిటీ, చందాలూ వగైరా తప్పవు.

నాకు ఏసభన్నా, ఏఉపన్యాసమన్నా తలనొప్పి. వెళ్లడం ఇష్టముండదు. తత్రాపి, సంఘోద్ధరణ సభలంటే మరీని. కాని మాసాంబశివుడి బలవంతాన్ని నేనూ తయారై సభకు బయలుదేరాను. ఒక్క అరగంట ఇంచుమించులో సభకు అంతా హాజరయ్యారు. పురప్రముఖుల్లో పేమా పేమీలుకూడా చాలామంది వచ్చారు. అందులో ముఖ్యులు – శ్రీపురంరాజావారు, స్వామినాథఅయ్యరుగారు, తిరువెంకటాచారిగారు, జయరాంనాయుడుగారు, దామోదరం మొదలియారుగారు, సుబ్రహ్మణ్యంచెట్టిగారు, లక్ష్మీదేవిగారు, ఆండాళమ్మగారు, రమాబాయిగారు – ఒకరేమిటి, అన్నిజాతులవారూ, స్త్రీపురుషాదులు తయారయ్యారు. మావాడు వాళ్లందర్నీ చూచి కొంచెం నిర్ఘాంతపోయి, "ఇదేమిటి, వీళ్లందరూ వచ్చారెందుకు"అన్నాడు రహస్యంగా. "ఏమి, ఎందుకు రాకూడదు?" అన్నాను.

"ఎందుకు రాకూడదేమిటి? నీకేం మతిలేదా ఏమిటి? వీళ్లని ఎరగవు నువ్వు. వీళ్లలో ఈచట్టం కావాలన్నవాడు ఒక్కడేనా ఉన్నాడూ? వేశ్యల నెరగనివాడు, వాళ్లకోసం డబ్బు తగలెయ్యనివాడు— ఎవడు ఇందులో? ఇటువంటిదానికేనా కొంత శీలం (Character), నీతీ, నియమం ఉండేవాళ్లు కావాలి కాని వీళ్లెందుకూ"అన్నాడు కొంచెము తీవ్రంగా. మాపక్కనున్నవాళ్లకు వినపడుతుందేమోనని నాభయం. పైన చెప్పిన పెద్దమనుష్యులంతా పెద్దపెద్ద వకీళ్లు, వర్తకులు, ధనికులు, అసెంబ్లీమెంబర్లూను. ఊళ్లో ఏసభా, ఏకార్యం వాళ్లు లేందే జరగదు. అలాటి వాళ్లని పట్టుకుని వీళ్లెందుకంటే! "కాలాన్నీ, దేశాన్నీ అనాలికాని వీళ్లనని ఏమిలాభం" అని ఏదో చెప్పబోతుంటే, సూటూ కళ్లజోడూతోటి దర్జాగా ఒకతను చక్కావచ్చాడు. ఆయన్ను అంతా చాలా గౌరవంగా పలకరించి ముందు కూర్చోపెట్టారు. "అరే! వీడుంనా! **Nonsense! Absurd! Ridiculous!** నేఉండ నిక్కడ! లే పోదాం" అన్నాడు మాసాంబశివుడు.

నేను పట్నంలో పెద్దల్ని చాలామందిని ఎరిగి ఉన్నాను కాని ఇత న్నెప్పుడూ చూడలేదు.

"కూచోవోయి నాయనా! చంపక! ఇక్కడికి వచ్చేదాకా నిలవనిచ్చావుకావు. వచ్చిన తరువాత సభ ప్రారంభమైనా కాకుండా లేలెమ్మంటావేం? ఈ వచ్చిన పెద్దమనిషి ఎవరు? సంగతేమిటి? నీకెందు కింత కంగారు?" అన్నాను.

మావాడు కూడా పెద్ద ధనికుడూ, ఉద్యోగీ కాకపోయినా, ఛోటా నాయకుల్లో ఒకడు. మంచి నిజాయతీ అయినవాడు. కష్టపడి పట్టుదలగా పనిచేసే వాడు. అందుచేత ఏ సభ వచ్చినా, ఏ కమిటీ వచ్చినా, నిజమైన, కష్టమైన పని కావాలి అంటే మావాడిని ముఖ్యంగా ఒక సభ్యుడుగా తీసుకుంటారు. అందుచేత సాంబశివుడు వూళ్లో అన్ని రకాల మనుష్యులనూ ఎరుగును.

"వాడా? **Scoundrel!** వాడిని ఎరగవూ? పరాంకుశంపిళ్లె. వాడు పట్నంలో అందరికన్నా పెద్ద ముండలకుతాదారు (**Brothel keeper**). వాడు మనకో పెద్దా! ఎంత దురన్యాయం!"

నాకు నమ్మ బుద్ధిపుట్టలేదు: "పోవోయి, నీ కబుర్లూ నువ్వూనూ! మరీ వింతగా చెపుతావు నువ్వు. నువ్వు చెప్పినట్టే అయితే వాడి కింత గౌరవం, సభాపూజ్యతా ఎలా వచ్చింది" అన్నాను.

"సభాపూజ్యతా లేదు, వాడి పిండాకూడూ లేదు! వాడిని ఈ వూళ్లో ఎరగనివాళ్లు లేరు. జనాభా లెక్కలలో వాడి వృత్తి 'వ్యాపారం' అని ఉంటుంది. ఆ వ్యాపారమేమిటయ్యా అంటే, ఈ వూళ్లో ఉండే పెద్ద పెద్దలందరకూ, అనగా స్త్రీవ్యసనమున్న వాళ్లందరకూ ముండలను తార్చడం. ఏ జాతిలో, ఏవయసులో, ఏ రకంలో మనిషి కావాలంటే, వాళ్ని క్షణంలో తీసుకువచ్చి వప్పచెప్తాడు. ఇక్కడికి వచ్చిన పెద్దలలో ముప్పాతికమందికి పైగా వాడితో అవసరం వుంటుంది. అందుకని వాణ్ణి గౌరవించకేం చేస్తారు? లేకపోతే వాడు అల్లరిచేస్తాడేమో! వాడు పెద్దమనిషి, సభాపూజ్యుడూను! చూడు. పాపం! ఆ రాజాగారూ, ఆ అయ్యరుగారూ ఎంత ఆప్యాయంగా మాట్లాడుతున్నారో! ఇంకోక్షణం ఉంటే వాణ్ణి ఏ

"కమిటీలోనో వేస్తారుకూడాను." అన్నాడు నిప్పులు కక్కుతూ.

ఇంతలోనే దొర ఒకాయన వచ్చాడు. ఒక పెద్దమనిషి తొందరగా వెళ్లి ఆయన్ని ముందుకు తీసుకువచ్చి కూర్చోపెట్టాడు. ఎక్కడినుంచో పూలహారం ఒకటి తెచ్చి వేశారు. ఆయన ఎవరో, ఎందుకింత మర్యాద చేస్తున్నారో తెలియదు. "ఏం లేదు. కేవలం దొరగనక. దొరైతే మంచివాడుఅయితీరాలిగా"

ఇంతలో పరాంకుశంపిళ్లై,—ఆ దొరతో ఇదివరకే పరిచయ ముందికాబోలు—ఆయనతో మాట్లాడి, అక్కడున్న పెద్దలందరకూ పరిచయం చేశాడు.

"ఇదేమిటి! వీళ్లూ పిల్లిచేతులో పడ్డారూ" అన్నాడు సాంబశివుడు. "ఇంక నేనా లేస్తావా, పోదాం" అన్నాడు. "కూర్చో! ఈ వేడుకేదో చూచేపోదాం." అన్నాను. బలవంతాన కూర్చున్నాడు.

పూర్వకళావతిని ఒకావిడను అగ్రాసనాధిపతిగా ఎన్నుకున్నారు. ఆవిడగంభీరోపన్యాసం అయింది. దొరగారు హైందవదురాచారాలను గురించీ, సంఘంలో ఉండే అవినీతినిగురించీ, వేశ్యావృత్తినిగురించీ చాలా దీర్ఘోపన్యాసం చేశారు. మావాడిని పట్టుకోడం కష్టమయింది. విడిచిపెడితే దొరను రెండువాయించి చక్కా వస్తాడని భయపడ్డాను. తరువాత రాజాగారూ, అయ్యరుగారూ, ఇంకా మరికొందరూ ఉపన్యాసాలిచ్చారు.

"ఆ పరాంకుశంగాడు మాట్లాడితే వాడి గొంతుక పిసికి నేనాత్మహత్య చేసుకుంటున్నా" నన్నాడు సాంబశివుడు. "నీ తీర్మానంలో ప్రథమభాగం అంగీకరించడమైనది." అన్నాను నేను.

వాడిధర్మమా అని పరాంకుశం ఉపన్యాసం ఇవ్వలేదు. చట్టాన్ని అమలులో పెట్టడానికి విజిలెన్సు కమిటీ ఒకటి ఏర్పాటుచేశారు. అందులో పైన చెప్పిన ప్రముఖులు, దొరగారు, పరాంకుశం అందరూ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. మావాడినికూడా ఉండమన్నారు కాని మావాడు చాలా సిగ్గుపడుతూ అంతభారం వహించలేనని పటపట పళ్లు కొరుకుతూ బయటకు వచ్చాడు.

## ౨

ఆ శుభసమయంలో ప్రారంభించిన విజిలెన్సు కమిటీ పని ప్రారంభించింది. పేటపేటకూ ఒక సబ్ కమిటీ ఏర్పాటుచేశారు. ఊరంతా వలవేసి గాలించడం మొదలుపెట్టారు. చాలామంది భయపడి పట్నంనుంచి మకాం ఎత్తేసి, సైదాపేట, పరంగిమల, పల్లావరం మొదలైన సమీపగ్రామాలు చేరుకున్నారు. ఇంతలో యెవరో బుద్ధిమంతుడు బయలుదేరి వాళ్లకు సలహా చెప్పాడు. "ఎందుకిలా ఖంగారుపడి పారిపోతారు? వేశ్యావృత్తి మాన్పడానికి కాదిది. నలుగురైదుగురు వేశ్యలు కలిసి, ఒకరి యాజమాన్యంకింద వ్యాపారం సాగించకూడదని ఈబిల్లు ఉద్దేశం. కాబట్టి, మీరు విడిపోయి యెవరిమట్టుకు వారు హాయిగా ఉండండి" అన్నాడు ఆ పెద్దమనిషి. "బాగుంది ఈసలహా" అనుకున్నారు. వాళ్లు విడిపోయి, ఒక్కొక్కళ్లు ఒక్కొక్క సంసారికొంపలో చేరారు. ఇప్పుడు మింటుస్ట్రీటు అనీ, చంగాయంగడి అనే అక్కరేకుండా పట్నమంతా పాకిపోయారు. దానితో వాళ్లను పట్టుకోడం కష్టమయింది. కాని లంచగొండి ఉద్యోగులకుమట్టుకు చాలా అనుకూలంగా ఉంది. సంసార్ల ఇళ్లకు—లోకువ వాళ్లను చూచి—వెళ్లడం, వాళ్లను బెదిరించడం, నాలుగురాళ్లు గుంజుకోవడం. పరాంకుశం లాంటివాళ్లకు మరోలాభం. కమిటీపనిమీద తిరుగుతుండడంలో కొత్త కొత్త పక్షులను పట్టడానికి వీలు చిక్కింది.

అలా దొరికిందే సౌభాగ్యం. పద్ధెనిమిదేళ్లుకూడా పూర్తిగా నిండని పడుచుదనం. తెల్లజామపండుకంటె అందమైన శరీరచ్ఛాయ. చెంపకు చారెడు కళ్లు. ఛీ! ఛీ! లాభంలేదు. ఆపిల్లను వర్ణించకూడదు. చెప్పబోతే ఈమాటలు యెంత సామాన్యంగా, చప్పగా ఉన్నాయో తెలుస్తుంది. ప్రపంచంలోకల్లా సౌందర్యవంత మనుకొన్న శిల్పవిగ్రహానికేనా వంక ఉండవచ్చుకాని ఈ అమ్మాయికి వంక యెంచడానికి వీలులేదు. అటువంటి సౌందర్యం కొన్నిజన్మలెత్తి ఎంతో సుకృతం చేసుకుంటేనేకాని కంటపడదు

కూడా కష్టమే. కాని ఇటువంటి అమూల్యమైన వజ్రం వెళ్లి గులకరాళ్లలో పడ్డది. ఆపిల్ల దారిద్ర్యం ముగ్గురి మరణానికి కారణమయింది.

ఇంత అన్యాయం యెందుకు జరగాలో తెలియదు. పూర్వకాలంలో అయితే, డబ్బుతో నిమిత్తం లేని రోజులలో అయితే, కేవలం వంశమర్యాద, మనిషి సుగుణసంపత్తిమాత్రమే లెక్కకొచ్చే రోజులైతే ఏఇంట పుట్టినా ఇబ్బంది లేదు. కాని ఈరోజుల్లో డబ్బుతోనే మర్యాదా, సుగుణసంపత్తీ, తెలివితేటలూ వచ్చే ఈరోజుల్లో, సర్వ సౌఖ్యములూ, సంతోషములూ, జీవితంఅంతా డబ్బుతోనే ఉన్న ఈరోజుల్లో దరిద్రులకు పుట్టడంకంటె దౌర్భాగ్యమేముంటుంది? ఉంటుంది. లేకనేం? ఇంతకంటె దౌర్భాగ్యం ఏమిటంటే ఆడపిల్లకు, ఇంకో దరిద్రుడికి భార్య కావడం.

సౌభాగ్యంభర్త పోస్టాఫీసులో గుమాస్తా. పల్లెటూళ్లో- పుట్టింటే దుర్భరమనిపించినదారిద్ర్యం పట్నవాసంలో మరింత దుస్సహమని వేరే చెప్పడ మెందుకు? ఒక ఇరుకుసందులో, ఎనిమిదికాపురాలున్న ఇంట్లో కాపురం. రెండుపూటలూ, కడుపునిండా నాలుగు వస్తువులూ వేసుకుతినడానికి చాలని జీతం భర్తకి. ఆఫీసులోవాళ్లు కడిగి ఇచ్చిన జీతపురాళ్లేకాని పైన కానీ కూడా సంపాదించడానికి వీలుకాని, వ్యవధికాని లేని ఉద్యోగం. అందులోనే ఎలాగో రూపాయో అర్ధో మిగుల్తే, భర్త కాఫీకర్చుకో, తలగుడ్డకో, జోడుకో సరిపోయేది. ఇంట్లో కూచోడానికి చాపా, పడుకోడానికి పాతబట్టాతప్ప, ఓపరుపూ, మంచం, కుర్చీ ఏవల్లా కానూ లేదు. ఉన్నా పెట్టుకోడానికి చోటేదీ? ఊళ్లో ఎక్కడ చూచినా, ఎవళ్లని చూచినా, ముద్దనుసుముక్కారుచీరలూ, జాకెట్లూ, తలలో పువ్వులూ, ఒంటినిండా వస్తువులూ పెట్టుకొని, భర్తచేతులో చేయి కలిపి, కార్లలో షికారు తిరుగుతూ ఉంటారు. నాఖర్మమేనా ఇలా కాలింది అనుకునేది సౌభాగ్యం. డబ్బులేకపోతేమట్టుకు అందరికి మల్లేనే సరదాగా సంతోషంగా ఉండడానికేమి? కొత్తగా కాపురానికి వచ్చిన రోజుల్లోనేనా, ఆ మొగుడేమి మొద్దోకాని, తన భార్య అసమానసౌందర్యవతి అని గ్రహించినట్టు తోచదు. అతిమెత్తనై, మెరిసిపోయే శరీరాన్ని కప్పడానికి ఈ ముతకనూలుగుడ్డలు పనికిరావన్నమాట తోచలే దనుకొంటాను. యమునా తరంగాల్లా, నల్లగా నొక్కులునొక్కులుగా మోకాటిచిప్పలవరకూ వేలాడే జుట్టుకు చక్కని సుగంధతైలం, ఆఖరుకు మంచినువ్వోనేనా కొన్నపాపాన్ని పోలేదు. రోజూ ఆఖరుకు తల్లోపువ్వులకు ఒక్కకానీకికూడా కరువైపోయె. పోనీ, అనుకూలుడైన భర్త అయితే ఇవేవీ కనపడవు. రాత్రి తొమ్మిదింటికి వచ్చి రెండు మెతుకులు నోట్లో వేసుకుని భార్య ఇల్లు సవరించుకుని వచ్చేసరికి గొడ్డులా నిద్రపోవడమేకాని, ఆ చక్కని, ఎర్రని, నిండైన పెదవు లెప్పుడూ ముద్దుపెట్టుకున్న జాడ కనపడదు. అగాధములూ, నిర్మలములూ, నిశ్చలములూనైన ఆమెకళ్లలో తన ప్రతిబింబం ఎప్పుడూ చూడలే దనుకుంటాను. శ్రీకారములాంటి చెవులలో తన హృదయవేదన ఎప్పుడూ చెప్పిఉండడు. అజంతా చిత్రకారులనూ, అమరావతీశిల్పులనూకూడా సిగ్గుపరచే ఆ స్తనద్వయాన్నైనా, ఎన్నడేనా పరామర్శించాడా అని అనుమానం. ఇంక ఏఅర్ధరాత్రో ఏనిద్రకళ్లనో ఏం చేస్తేం, ఏం చెయ్యకపోతేం?

సౌభాగ్యానికి చిన్నతనంలోనే జీవితమంతా శూన్యంగా కనుపించింది. అందరికిమల్లేనే ఆ అమ్మాయీ ఏవో అనూయికపు సుఖస్వప్నాలు కొన్ని కన్నది. ఏదో ఆనందం అనుభవిద్దా మనుకుంది. కాపురాని కొచ్చిన కొద్దిరోజులకే స్వప్నాలకూ, వాస్తవానికీ ఉండే తారతమ్యం తెలుసుకుంది. ఈసౌందర్యం అంతా ఈఅంధకారంలో మాటుమణిగిపోవలసినదేనా! ఈ యవ్వనమంతా అడవిలో పూసిన పూవులాగా వ్యర్థం కావలసిందేనా అని నిస్పృహ బయలుదేరింది.

కాని తన తోటివాళ్లంతా అంత సుఖంగా ఎలా ఉండగలుగుతున్నారు? వాళ్ల కాపట్టుచీరలూ, జాకెట్లూ ఎక్కడినుంచి వస్తున్నాయి? వాళ్ల భర్తలూ తక్కువజీతగాళ్లేనే! ఎక్కడికో వెడుతుంటారు, వస్తుంటారు. సినీమాలు, నాటకాలు, షికార్లు—ఎంతో

హాయిగా ఉంటారు. ఎలాగా అనుకునేది. ఆసందేహాలన్నిటికీ సమాధానం సరోజిని చెప్పింది.

సరోజిని ఈ ఇంట్లోకి కొత్తగా కాపురానికి వచ్చింది. ఒక్కతే వచ్చింది. భర్త ఎక్కడో ఉన్నాడంది. ఉన్నాడో లేడో ఎవళ్లకూ తెలియదు. తరువాత తరువాత తెలిసింది-ఒకసానికొంపలోనుంచి వచ్చిందని. వచ్చినప్పటినుంచీ, సౌభాగ్యంతో, ఎంతో చనువుగానూ, ఆదరంగానూ మాట్లాడేది. త్వరలోనే సౌభాగ్యంపరిస్థితులూ, మనస్తత్వమూ తెలుసుకుంది. ఒకరోజున నిలవేసి అడిగింది.

"ఎందుకు నువ్విలా బాధపడతావు? అందరికీ మల్లేనే నువ్వూ హాయిగా ఉండరాదూ? ఎవరొద్దన్నారు నిన్ను?"

"ఎలాగమ్మా! నీకేం, కబుర్లు చెపుతావు! నువ్వు ఏంచేసినా, ఎక్కడికి వెళ్లినా అడిగేవాడు లేడు"

"నిన్ను మట్టుకు ఎవరడుగుతారు? నీ మొగుడింట్లో లేనంతసేపూ నువ్వేంచేస్తే ఎవరు చూడొచ్చారు? ఈ ఇంట్లోవాళ్లెవ్వళ్లూ మాట్లాడరు. నాది పూచీ. వీథిలో వాళ్లకు నీ గొడవ పట్టుకోదా. నాలుగుడబ్బులు సంపాదించుకుంటూ సరదాగా ఉంటే మీ ఆయనమట్టుకు వద్దంటాడా ఏమిటమ్మా! ఆయన్ను అడగకుండా, బాధించకుండా నువ్వు సంపాదించుకుని పోగ్గా ఉంటే ఆయన మరీ సంతోషిస్తాడు. ఇవన్నీ ఎక్కడికని మామూలుమనిషి ఎవ్వరూ అడగడు. ఈ పట్నంలో పద్ధతే అంత. నీకు తెలియక ఏమో అనుకుంటున్నావు."

మరి రెండు రోజులకు ఒక సినీమా ఛాన్సు వచ్చింది. సరోజిని వచ్చి చెప్పింది. "ఒకచోట ఎక్‌స్ట్రా కావాలట. అయిదురూపాయలిస్తారు. కష్టమేమీ లేదు. వస్తావా" అంది. ఏమీ లేకుండా అయిదురూపాయలొస్తాయంటే సౌభాగ్యానికి ఆశ పుట్టింది. ఎలాగైతే నేమి, హడిలిపోతూ బయలుదేరింది, భర్తతో చెప్పకుండా.

అక్కడంతా కొత్తగానూ, తమాషాగానూ, సంతోషంగానూ ఉంది. ముఖానికి రంగుపూశారు. చక్కని బట్టలు కట్టి, వస్తువులు పెట్టి అలంకరించారు. భర్తకు తన సౌందర్యం కనపడలేదు 'కాని అక్కడున్న ప్రతివాడూ, కూలీదగ్గరనుంచి డైరెక్టరువరకూ అందరూ వొళ్లంతా కళ్లు చేసుకుని ఈ పిల్లను చూడడం మొదలుపెట్టారు. పది పదిహేనుగురు ఈ అమ్మాయి అడ్రసు అడిగి తీసుకున్నారు. ఆ రోజున సుఖంగా భోజనం పెట్టారు. ఫలహారం పెట్టారు. మధ్య మధ్య కావలసినంత కాఫీ ఇచ్చారు. సాయంకాలం అయిదు రూపాయలు చేతులో పెట్టి, మళ్లీ కబురుచేసినప్పుడు తప్పకుండా రమ్మని చెప్పి పంపించారు.

తన పదిహేడు సంవత్సరముల జీవితంలోనూ ఏదో విధమైన ఆనందం అనుభవించినది ఈ రోజుననే.

ఇలా ఆ నెలలో నాలుగైదుసార్లు ఎక్‌స్ట్రాగా వెళ్లి ఒక పాతికరూపాయలు సంపాదించింది. అంతే కాకుండా అందులో ఒకతనితో కొంచెము పరిచయం కూడా కలిగింది. చాలా మంచివాడు, పాపం! రెండు మూడుసార్లు కాఫీహోటలుకూ, సినీమాకూ కూడా తీసుకువెళ్లాడు. సినీమాలోనూ, రిక్షాలోనూ రెండు మూడుసార్లు కౌగిలించుకుని ముద్దుపెట్టుకున్నాడు కూడాను. కాని ఇంత మంచిగా ఉన్నప్పుడు ఈ మాత్రాని కేమిటని ఊరుకుంది సౌభాగ్యం.

## 3

ఆ నెల సంపాదనతో సౌభాగ్యం శుభ్రమైన బట్టలు కొనుక్కుంది. మనిషిలో నిరుత్సాహం పోయి జీవితంలో ఒకవిధమైన ఆనందం బయలుదేరింది. దానితో ముఖానికి కొత్తవికాసం, తేజస్సూ వచ్చాయి. వూళ్లోవాళ్ల మాట అటుంచి, సినీమావాళ్లందరికళ్లూ ఈ అమ్మాయిమీదనే పడ్డాయి

మనిషిలో మార్పూ, దుస్తులలో మార్పూ భర్త చూచాడో లేదో చెప్పలేం. చూచినా చూడనట్టుగానే ఊరుకున్నాడు. సినీమాల్లో పని ఎక్కువగా రావడం మొదలుపెట్టింది. తరుచు రాత్రులుకూడా వెళ్లవలసి వచ్చేది. అందుచేత భర్తకు చెప్పక తప్పిందికాదు. ఒకరోజున చెప్పింది. విన్నాడు. కాస్సేపు ఊరుకున్నాడు. ఆఖరుకు "సరే, నీఇష్టం" అన్నాడు. ఆ రోజునుంచీ

ఎక్కువ బాహాటంగా, తన ఇష్టంవచ్చినప్పుడు తన ఇష్టంవచ్చినచోటికి వెళ్లడం మొదలుపెట్టింది. మెరక మీదనుంచి కిందకి జారడమే ప్రారంభించాలికాని, బయలుదేరినతరువాత వేగము ఎక్కువ కావడమేకాని ఆగడమంటూ ఉండదుకదా!

ఒక సినీమాలో అసిస్టెంటుడైరెక్టరుతో పరిచయం, చనువూ ఎక్కువయింది. రోజూ అతను తీసుకువెళ్లి తీసుకువస్తూ ఉండేవాడు. మామూలుగా ఒకనాడు సాయంకాలం వచ్చి, షూటింగుకని తీసుకెళ్లాడు. కాని ఇల్లు బయలుదేరినతరువాత షూటింగు లేదని చెప్పి, సినీమాకు తీసుకెళ్లి, హోటల్లో ఇద్దరూ భోజనంచేసి, ఎగ్మోరులో ఒక హోటల్లో రాత్రి నిద్రచేశారు. తెల్లవారుఝామున లేచి వస్తూంటే పరాంకుశంకళ్లపడ్డారు. పాపం! అతనూ ఒకావిడను తీసుకువచ్చి ఒక ఉద్యోగికి అప్పచెప్పాడు. ఆవిడ ఇవతలికి వస్తే ఇంటిదగ్గర దిగపెడదామని కనిపెట్టుకున్నాడు. సౌభాగ్యాన్ని చూడ్డంతోనే, రాత్రంతా నిద్రమానుకుని కాపలాఉన్న కష్టం మరిచిపోయాడు. ఈసౌందర్యరాశి మద్రాసులో ఇంతకాలం తనకంట పడకుండా ఎలా ఉందనుకున్నాడు. ఇటువంటి రంభను కనిపెట్టలేకపోవడం తన ప్రజ్ఞకు లోటని సిగ్గుపడ్డాడు. తిన్నగా తలవంచుకుని వెడుతున్న సౌభాగ్యందగ్గరకు వెళ్లాడు.

"ఎవరు నువ్వు?"అని దబాయించాడు. ఆ అమ్మాయి హడిలిపోయి మాట్లాడలేకపోయింది. పక్కనున్న పెద్దమనిషి ఏదో చెప్పబోయాడు.

"నువ్వెవరయ్యా? ఈమనిషి నెక్కడనుంచి తీసుకొచ్చావు?"

"ఈవిడ నాభార్యండీ."

"నోరుముయ్యి. నీభార్యా! ఇల్లూ వాకిలీ విడిచిపెట్టి ఈహోటలు కెందుకొచ్చారు? ఇంత తెల్లవారకట్లే ఎక్కడి కెడుతున్నారు?"

ఇంక నేముంది? కుర్రాడు చిత్తయిపోయాడు. ఏ సమాధానమూ చెప్పలేకపోయాడు. కళ్ల నీళ్లు గిర్రున తిరిగాయి. ఎవరో పోలీసు ఉద్యోగమనుకుని ఆయన్ని బ్రతిమాలడం మొదలుపెట్టాడు. పరాంకుశం గంభీరంగా వాడిని చీవాట్లువేసి, వాళ్ల అడ్రసులు వ్రాసుకున్నాడు. వాళ్లు హడలిపోతూ సిగ్గుపడి వెళ్లిపోయారు.

వీళ్లు సరియైన చిరునామాలు ఇవ్వలేదేమోనని అనుమానం కలిగింది పిళ్లకు. ఇంతకాలం ఈ అమ్మాయిని తెలుసుకోలేకపోవడమే తప్పు. ఇప్పుడు చేత చిక్కిన దాన్ని విడిచిపెట్టుకుంటాడా? తాను మళ్లీ వస్తానని అక్కడ బంట్రోతుతో చెప్పి నిమ్మళంగా వాళ్లను వెంబడించి, ఆ అమ్మాయిచిరునామా సరిఅయినదే నని తేల్చుకుని వచ్చాడు.

అక్కడినుంచి సౌభాగ్యాన్ని వెంటాడడం మొదలుపెట్టాడు పరాంకుశంపిళ్లె. కాని సినీమాపని ఎక్కువగా ఉండడంవల్ల ఆవిడదర్శనం కావడమే కష్టంగా ఉండేది. కాని పరాంకుశం పట్టుదలగలవాడు. ఒకమాత్రానికి అధైర్యపడే మనిషి కాడు. అందులో ఇటువంటి పిల్లకోసం అజన్మాంతం కనిపెట్టుకున్నా ఉండవచ్చు.

సౌభాగ్యానికి ఎలాగైనా సినీమాలో పెద్దపేరు సంపాదించుకుందామని సరదా బయలుదేరింది. ఆవిడను ఎలాగైనా స్టారును చేద్దామని అక్కడ అసిస్టెంటు డైరెక్టరుకు సరదాగా ఉంది.

పరాంకుశం నెమ్మదిగా ఎలాగైతేనేమి సౌభాగ్యాన్ని పట్టుకున్నాడు. కాని ఆ అమ్మాయి ఒకపట్టాన్ని లొంగలేదు. తన ఆశయం ఆయనతో చెప్పి తన్ని విడిచిపెట్టమంది. పరాంకుశం తన తెలివితేటలూ, లౌక్యం అంతా ఉపయోగించి సినీమా లాభంలేదని ఆ అమ్మాయికి నచ్చచెప్పి ఒప్పించేటప్పటికి తలప్రాణం తోకకు వచ్చింది. సినీమాలో ఈ అమ్మాయికి తప్పకుండా పేరు వస్తుంది. వస్తే, ఇంక తనకేసి కన్నెత్తి చూడనేనా చూడదని బాగా తెలుసు. అందుకని అంత తంటాలుపడ్డాడు.

## ४

ఎంత ఓరిమి ఉన్నవాడైనా, వారాని కొకసారైనా చేసుకున్న పెళ్లాం కంటపడకపోతే, ఎప్పుడో ఒకప్పుడు వొళ్లు మండదూ! మొదటిరోజుల్లో

కొంచెము విసుక్కునేవాడు. తరువాత భార్య మంచి మంచి చీరలూ, ఇంట్లోకి సామాన్లూ తనకు కానీఖర్చు లేకుండా తీసుకురావడం చూచి సంతోషించాడు. ఇంకా ఎప్పుడేనా చికాకుపడితే, తనకు ఎప్పుడు కావలిస్తే అప్పుడు రెండో, మూడో, అయిదో, పదో, అవసరాన్నిపట్టి చేతులో పెడుతూఉండేది. ఇంకనేం కావాలి? ఏమని కోప్పడగలడు? ఈడబ్బు ఎలా వస్తోంది, ఎక్కడినుంచి వస్తోంది అని ఒక్కమాటన్నా నోరు తెరిచి అడగలేడు. తెలియకనా, తెలిసా? అడిగి బంగారుగుడ్లు పెట్టే బాతును చంపుకోడ మెందుకనుకున్నాడేమో! అక్కడికీ అప్పుడప్పుడు ఏవో పిల్ల సమేరీలు తెస్తూనే ఉండేవాడు. చడామడా నాలుగు కేక లేసుకునేవాళ్లు, ఊరుకునేవాళ్లు. కాని ఈసారి మట్టుకు అలాకాదు. పాకం ముదిరింది. ఈ అనుకూల దాంపత్యం విడిపోయేరోజు లొచ్చాయి.

నే విన్నరోజుల్లో నేనూ నమ్మలేదు. ఇప్పుడు మీరూ నమ్మరనుకుంటాను. ఒకటి రెండుసార్లు తన స్నేహితుడనీ, తన పై అధికారనీ, ఎవరో ఉద్యోగస్థుడనీ ఎవరెవరినో తీసుకువచ్చి, భార్యకు పరిచయం చేసి కాఫీకాచిమ్మనీ, తన కేదో తొందరపనుందనీ, త్వరగా వస్తానని చెప్పి బయటికి పోయి గంటో రెండు గంటలో ఉండి, వస్తుండేవాడు. దాని భావం సౌభాగ్యం మొదట గ్రహించలేకపోయింది. కాని రెండో సారి తెలుసుకుంది. తెలుసుకొని తన వీలును పట్టి వాళ్లతో వ్యవహరించేది.

ఈసారి పేచీకి ఇదే కారణం. ఎవరినో నల్లభై ఏళ్ల కరిమొద్దుని ఒకణ్ణి తీసుకువచ్చాడు. ఎక్కడో ఇంజనీరు. తన స్నేహితుడన్నాడు. ఫలహారం, కాఫీ తయారుచెయ్యమన్నాడు. సౌభాగ్యం ఒక్కసారి ఆమొద్దునూ, తీసుకువచ్చిన మొగుణ్ణీ ఎగాదిగా చూచి, తనకు తీరికలేదంది.

"తీరిక లేకపోవడ మేమిటి?"

"అనగా, నాకు వేరే పనుందన్నమాట."

"పనుం టేమట్టుకు, వాకట్లోకి పెద్దమనిషి వస్తే కాస్త కాఫీఐనా కాచనంటావేం?"

"ఎవరు?"

"ఎవ రేమిటి?"

"పెద్దమనిషి ఎవరని?"

"ఏమిటే! ధోరణి ఎక్కువగా ఉంది! పొగరుబోతుతనం బలిసింది!"

"మీరు పెట్టి పోషించేదానితో అలా బలుస్తోంది"

బయలుదేరినవేళ మంచిది కాదనుకుని, వచ్చిన పెద్దమనిషి నెమ్మదిగా, సగౌరవంగా వెనక్కు జారాడు. అక్కడితో భార్యాభర్తలకు మాటామాటా పెరిగి చెయ్యీ చెయ్యీ కలిసింది. జుట్టు పట్టుకుని బరబర వీథిలోకి లాక్కొచ్చి "పో, నాయింట్లోంచి" అని వీథిలోకి గెంటివేశాడు సౌభాగ్యాన్ని.

ఆసమయాన్నే ఆదారిని పరధ్యానంగా వెడుతున్న సాంబశివుడిమీద పడ్డది పాపం! సాంబశివుడు, పాపం, ఆవిడను లేవతీసి, వొళ్లు దులిపి, లోపలికి తీసుకువెళ్లి, భర్తను మందలించాడు. ఆయన, పాపం, తప్పు అభిప్రాయపడ్డాడు. ఈయనే తన భార్యముఖ్యస్నేహితుడనుకున్నాడు. అందుకని సాంబశివుడితో కొంచెము పేచీ పెంచడం మొదలు పెట్టాడు. మావా డతని ధోరణి కనిపెట్టి నోరుమూయించి, వొళ్లుదగ్గర పెట్టుకు మసలమని చెప్పి చక్కాపోయాడు. కాని భార్యాభర్తల మధ్యను బయలుదేరిన మంట మండుతూనే వుందికాని అంతటితో ఆరిపోలేదు.

సౌభాగ్యం మరునాడు భర్త ఆఫీసుకువెళ్లగానే తను ఈఇల్లు విడిచిపెట్టి తనదారి తను చూసుకోవాలని నిశ్చయంచేసుకుంది. మధ్యాహ్నం మూటా ముల్లీ అన్నీ సర్దుకునేసరికి శనిలాగ పరాంకుశం తయారయ్యాడు. "ఎక్కడికన్నా ఊరికి వెడుతున్నారా? నాతో చెప్పకుండా వెళ్లిపోవడం ధర్మమేనా? కాస్త నాచెవిని వేస్తే నేనూ వచ్చేవాడినికదూ. మిమ్మల్ని విడిచిపెట్టి నేను బ్రతుకగలనా" అని నెమ్మదిగా లాలన ప్రారంభించాడు. తన మాట విని జాలితలిచే మనిషి దొరికాడుకదా అని తన కథంతా చెప్పుకుంది.

పరాంకుశం, పాపం, కావలసినంత సానుభూతి చూపించాడు. ఆమె భర్తను - నిర్మొహమాటంగా తిట్టాడు. అటువంటి కర్కోటకుడితో కాపురం చెయ్యడంకంటే మహాపాపం మరొకటి లేదన్నాడు. ఎవరి స్వతంత్రం, ఎవరి సౌఖ్యం వారికి ఉండాలన్నాడు. తన చాతుర్యం యావత్తూ ఉపయోగించి, మళ్లీ జన్మలో భర్తదగ్గరకు వెళ్లనని వాగ్దానం తీసుకున్నాడు సౌభాగ్యందగ్గర. వెంటనే బండి తీసుకొచ్చి, ఆవిడను ససామానుగా ఎక్కించి రాయపేటలో ఒక ఇంట్లో పెట్టాడు. ఆవిడ కేం భయంలేదని అభయం ఇచ్చాడు.

ఆ సాయంకాలం ఇంటికి వచ్చినప్పటినుంచీ సాంబశివుడికి ఏమీతోచలేదు, తిండి సయించలేదు, నిద్రపట్టలేదు. ఆ అమ్మాయిని మాస్తే, ఆపిల్ల అవస్థ తలచుకున్నకొద్దీ ఏదోవిధమైన, ఎన్నడూ ఎరుగని జాలి బయలుదేరింది. మరునాడు ఒకసారి వెళ్లి చూచివద్దామా అని అనుకున్నాడు. కాని ఎందుకని మళ్లీ వూరుకున్నాడు. ఆమరునాడు ఇంక పట్టలేక చూచి ఆవిడ సంగతేదో పూర్తిగా తెలుసుకోవాలని బయలుదేరి వచ్చాడు.

తీరా వచ్చేసరికి, భర్త బోనులోపులిలా తిరుగుతున్నాడింట్లో. ఇతన్ని చూడగానే మండిపడి అమాంతం మింగేసేటట్టు ఇతనిమీద పడ్డాడు. ఇతనే తీసుకుపోయాడని భ్రమపడ్డాడు మొదట. కాని రెండు నిమిషాలు సాంబశివుడితో మాట్లాడినతరువాత తనది పొరపాటని తెలుసుకుని అతన్ని క్షమించమని ప్రార్థేయపడ్డాడు. సాంబశివుడు, ఈమనిషి ఏమయిపోయిందా, ఈవిడను మళ్లీ చూడడ మెలాగు, ఏదుర్మార్గుడిచేతులోపడిందో, అక్కడనుంచి తప్పించడ మెలాగు అనే ఆలోచనతో, ఆందోళనతో ఇంటికి వచ్చాడు. కొన్నాళ్లవరకూ ఎంత ప్రయత్నంచేసినా ఆపిల్లజాడ తెలియలేదు. సాంబశివుడు ఎప్పుడూ, ఏవిషయంలోనూ, ఇంత ఆందోళన పడలేదు. ఎవ్వరికోసమూ ఇంత తాపత్రయపడనూలేదు. ఆపిల్లమీద నేమైనా మనసుపోయిందేమో నంటారా! ఎవర్నిగురించి ఆ మాటఅనుకున్నా సరేకాని సాంబశివుడినిగురించిమట్టుకు అంటే నేను ప్రాణంపోయినా, అతను చెప్పినా అంగీకరించను.

౫

పరాంకుశం అలభ్యయోగంగా దొరికిన ఈ పిల్లను తనివితీరా తనఇష్టం వచ్చినట్లు వాడాడు. ఆ అమ్మాయీ ఏమీ అనలేక అలాగే అతనికి లొంగి ఊరుకుంది. పిళ్లై ఉదయాస్తమానాలూ ఈ పిల్లతోనే కాలక్షేపం చేస్తుండేవాడు. క్లబ్బుకు, మీటింగులకు దేనికీ రావడం మానేశాడు. తన వ్యాపారంకూడా ఉపేక్షించడం మొదలుపెట్టాడు. ఖాతాదారులందరికీ ఆశ్చర్యం వేసింది. పరాంకుశం ఇలా నరమానవుడి కంట పడకుండా - ఇళ్లో ఉండికూడా - ఉండడం ఇదే మొదటిసారి. దీనిలో ఏదో రహస్యం ఉందని వాళ్లంతా ఆచోకీతియ్యగా, రాయపేటలో ఇతను ఉండడం, సౌభాగ్యంతో ఉండడం అందరికీ తెలిసిపోయింది. ఆ పిల్లను చూపించమని వుకట్లా పీక్కుతిన్నారు. గత్యంతరం లేక ఒక్కొక్కరికే వప్పచెప్పడం మొదలుపెట్టాడు.

సౌభాగ్యం ఏడిచింది, ముత్తుకుంది, దెబ్బలాడింది. ఏమిచేసినా లాభం లేకపోయింది. వేశ్యావృత్తి తన ముఖాన అక్షరాలా వ్రాసిఉందనుకొని, గత్యంతరం లేక, తన్ను చూచేవాళ్లు లేక, తన మొర వినేవాళ్లు లేక, తన్ను రక్షించేవాళ్లు లేక, విధికి లొంగిపోయి, ధనికులైన పురుషశబ్ద వాచ్యులందరకూ ఆటవస్తువుగా తయారయింది.

రాయపేటనుంచి మకాం మాంబళానికి మార్చింది. ఒక చిన్న బంగళా, ఇద్దరు ముగ్గురు నౌకర్లు, రెండు కుక్కలు, ఇంటినిండా ఇంటెడు సామాను, వొంటినిండా వొంటెడు వస్తువులు, పెట్టెనిండా పెట్టెడు బట్టలు! ఇంక కావలసిన దేముంది? చిన్ననాటి కలలు సత్యము లయ్యాయా అనిపించింది. ఎప్పుడే మేమి కావలె ననుకుందో అవన్నీ వచ్చిపడ్డాయి. కాని-కాని-సౌఖ్యమూ, సంతోషమూమట్టుకు మృగ్యమయిపోయాయి. అంత చిన్నతనం, అంత అమాయకత్వం ఒకటి రెండు సంవత్సరములలో ఎగిరిపోయినాయి. ఈ రెండు సంవత్సరములలోనూ చాలామంది సంసారిణులకు తెలియని వెన్నో తెలుసుకుంది.

పురుషు లెంత పశువులో తెలుసుకుంది. కామం యొక్క లోతు తరిచి చూచింది. డబ్బు ఎంత పాపిష్టిదో తెలుసుకుంది. పాపంయొక్క పరిమితి చూచింది.

మాంబళంలో ఆనోటా ఆనోటా పాకి అందరికీ ఈవిడసంగతి తెలిసింది. ఆఖరుకు ప్రతిరిక్షావాడికీ, ప్రతి కూలివాడికీకూడా తెలుసు. కావడం తన కేలోటూ లేదు. అందరికిమల్లేనే తనూ స్వతంత్రంగా ఒక బంగళాలో ఉన్నది. నౌకర్లున్నారు. డబ్బుంది. కాని పగలు ఈవిడతో మాట్లాడేవారు ఒక్కరూ లేరు. ఒక్కరూ ఈవిడను పేరంటానికికాని, ఒక్కపూట భోజనానికికాని పిలిచినవారు లేరు. ఇరుగుపొరుగు పిల్లలేనా తనింటికి రారుసరికదా, ఆ ఇళ్లల్లో కాకులేనా తనింటిమీద వాలవు. ఆశ్చర్యం కాదూ! ఆఖరుకు ముష్టివాళ్లేనా ఎవ్వళ్లూ వచ్చిన జాడ ఉండేది కాదు. రాత్రులు తనింటికి వచ్చేవాళ్లేనా పగలెప్పుడూ కనపడేవారు కారు. ఖర్మం చాలక ఏ రోడ్డుమీదో, ఏ బజారులోనో కనపడ్డా మాట్లాడకుండా, తన్ను చూడనట్టు నటించి చక్కా పోయేవారు. ఒక్కళ్లూ తమరింటి కెప్పుడూ తనను తీసుకువెళ్లలేదు; వాళ్లవాళ్లనిక్కడకు తీసుకురాలేదు. పాపం, ఎలా తీసుకొస్తారు? వారంతా పెద్దలు, విద్యాధికులు, ఉద్యోగులు, సంఘానికి నాయకులూ, మార్గదర్శకులూను! పడుపువృత్తి పనికిరాదని ఉపన్యాసా లిచ్చేవారు, పుస్తకాలు వ్రాసేవారు, చట్టాలు చేసేవారు, దాన్ని అమలులో పెట్టేవారూను! వాళ్ల కామం తీర్చుకోడానికి తనో తోలుబొమ్మ కాని వారితో సరిసమానంగా సంచరించతగ్గ వ్యక్తి కాదు. అంత అమాయకత్వమూ క్షణంలో హరించిపోయిందంటే ఆశ్చర్య మేముంది? ఈ కొద్దికాలంలోనే ఆ ముఖంలో ఉండే లావణ్యం, సౌందర్యం, నాజూకూ అన్నీ తగ్గిపోయాయి. విషవాయువు తగిలి మాడిపోయే పువ్వులా అయిపోయింది. ఏమున్నా, ఆఖరుకు మనిషిముఖంకోసం, అనగా మామూలుమనుష్యులకోసం, వారి సహవాసంకోసం, వారిమాటకోసం వెంగటిల్లిపోయింది. గత్యంతరంలేక ఆత్మహత్య చేసుకోవచ్చుననికాని, చేసుకుందామని కాని ధ్యాస లేక అలాగే కాలక్షేపం చేసుకొస్తోంది.

అటువంటి అవస్థలో ఒకరోజు సాయంకాలం తన కుక్కల్ని తీసుకుని విజయరాఘవాచారిరోడ్డులో షికారు వెడుతుండగా, తలవని తలంపుగా, హఠాత్తుగా, అక్కడ నేలలో పుట్టినట్టు సాంబశివుడు ప్రత్యక్షమయ్యాడు. ఇద్దరూ ఒకర్నొకరు పోల్చుకున్నారు. ఇద్దరూ చైతన్యంలేనట్టు, వేళ్లుపారినట్టు అలాగే ఒకరినొకరు చూస్తూ నిలబడిపోయారు. ఇద్దరి కళ్లూ ఒక్కసారే చెమ్మగిల్లాయి. ఒక్కక్షణం ఊరుకుని ఇద్దరూ ఒక్కసారే మాట్లాడారు.

"మీ రిక్కడుంటున్నారా ఇప్పుడు?"

"మీ రిక్కడుంటున్నారా ఇప్పుడు?"

ఇద్దరూ చిన్నపిల్లలులా ఒక్కసారి నవ్వారు.

"అయితే, మీరు ఇక్కడే ఉంటున్నారన్న మాట!" అన్నాడు సాంబశివుడు.

"అవునండీ. మీరు?"

"మైలాపూరు."

ఒక్కమాటు బెదురుతూ ఇటూ అటూ చూచింది. చెప్పలేని ఆనందం, పట్టరాని దుఃఖం ఒక్కసారి సముద్రపుపొంగులా వచ్చాయి. బ్రహ్మాండంమీద ఆపుకుంది.

"నిలబడేఉన్నారు" అంది. తనెక్కడున్నదీ మరిచిపోయి.

"ఏంచెయ్యను? రోడ్డుమీద కూచోడానికి నాకు అభ్యంతరం లేదుకాని, దారే పోయేవాళ్లకు కష్టంగా ఉంటుందేమోనని."

ఇద్దరూ పకాలున నవ్వారు.

"ఎక్కడికేనా పనిమీద వెడుతున్నారా?"

"పెద్దపనేం లేదు. వచ్చినపని అయిపోయింది."

"అయితే మా ఇంటికి రావడాని కేమైనా అభ్యంతర ముందా?"

"అభ్యంతర మెందుకు? సంతోషంతో వస్తాను. నడవండి."

గుమ్మంలో అడుగుపెట్టేవరకూ మళ్లీ మాట లేదు. ఎన్నాళ్లకు మళ్లీ నిష్కల్మషమైన హృదయం, విషరహితమైనవాక్కు, ప్రతిఫలాపేక్షలేని స్నేహం — ఎన్నాళ్లకు కళ్లపడ్డది!

నిండిన గుండెలతో, స్తంభించిన వాక్కుతో, చెమ్మగిలిన నయనాలతో లోపలికి వచ్చి కూర్చున్నారు. ఎక్కడ ప్రారంభించాలో, ఏమిమాట్లాడాలో తోచక ఇద్దరూ కొంచెముసేపు నిశ్శబ్దంగా ఊరుకున్నారు.

"చాలా మంచిమొక్కలిని సంపాదించారు. బాగున్నాయి." అన్నాడు ఒక మొక్కను దువ్వుతూ, సాంబశివుడు.

"అవునండీ. చాలా మంచివే. ఇవే నాకు పిల్లలూ, స్నేహితులూ, చుట్టాలూను" అంది కొంచెము గద్గదికతో.

"నిజమే! వాటికున్న ప్రేమలోనూ, విశ్వాసంలోనూ శతాంశమేనా మనుష్యులకు లేదు. మనిషి గొప్పవాడని ఎందు కనుకుంటామో తెలియదు."

"అందుకనే. హీనజాతిలక్షణాలన్నీ విడిచి, హృదయం లేకుండా, కేవలం యంత్రంలా ఉండగలడు మనిషి. స్వపరభేదంకూడా పాటించనక్కరలేదు. తన అవసరం ఎంతవరకో అంతవరకూ ఉపయోగించుకుని, ఆవస్తువుకేసి మళ్లీ తిరిగైనా చూడడు." అంది కొంచెము ఉద్రేకంతో.

సాంబశివుడు జవాబులేకుండా నిదానంగా సౌభాగ్యంకేసి చూశాడు.

"ఈకొలదికాలంలో జీవితానుభవం చాలా సంపాదించినట్టున్నారు. విధికొట్టే దెబ్బలు కొంచెము గట్టిగానే ఉంటాయి. తట్టుకోడం కష్టమే. సంఘం కూడా చాలా క్రూరంగా ఉంటుంది. వ్యక్తులను లక్ష్యపెట్టదు. ఆకారణంచేత మన హృదయాన్ని చంపుకుని, మానవజాతినే అసహ్యించుకోడం మంచిదికాదు"

"నిజమే కావచ్చు. నా కేం తెలుసును? ముక్కుపచ్చలారనిదాన్ని. ప్రపంచమంతా మంచిది, సృష్టంతా ఆనందమయం, ఇదంతా నా ఆనందంకోసమే పుట్టింది అనుకున్నాను. ఇది మంచి, ఇది చెడ్డ అని చెప్పినవాళ్లు ఒక్కళ్లూ లేకపోయారు. నాకష్టసుఖాలు హృదయం విప్పి చెప్పుకోడానికికూడా ఎవ్వళ్లూ లేకపోయారు. నాదగ్గరకు వచ్చినవాళ్లు యములాళ్లలా నాశరీరాన్నీ, ఆత్మనీ చంపడానికే వచ్చారు. ఏం చెయ్యను?" అని వెక్కి వెక్కి రాగాలెట్టింది. కట్టతెంపుకు పడ్డ ప్రవాహంలో దుఃఖం ఆగకుండా వచ్చిపడ్డది.

సాంబశివుడు, తల్లిలా ఆపిల్ల దగ్గరకు వెళ్లి గట్టిగా పట్టుకొని తల నిమురుతూ ఆపొంగు ఆగేవరకూ అలాగే కూర్చున్నాడు.

"ఆనాడు మిమ్మల్ని చూస్తే ప్రాణం లేచొచ్చింది. ఎందుకో తెలియదు. ఎన్నిజన్మాలనుంచో మిమ్మల నెరిగున్నట్టనిపించింది. మీరు, మళ్లీ వస్తారేమో అని ఎంతో ఆశపడ్డాను. మీ రెవరు, ఎక్కడుంటారు అని తెలుసుకోడానికేనా వ్యవధి లేకుండా మీరు వెళ్లిపోయారు. దారేపోయే ప్రతిమనిషినీ మీరేమోననే ఆశతో ఎన్నిసార్లు చూచానో లెక్కలేదు. నాబ్రతుకిలా ఉంటే మీ రెందుకు కనపడతారు? మీ రెందుకు రావాలో, మీకోసం ఎందు కింత ఆశపడ్డానో నాకే తెలియదు."

"నిజమే! మిమ్మల్ని చూడగానే నాకూ అలాగే అనిపించింది. నా తోబుట్టువనుకున్నాను. ఇతరుల విషయాల్లో—ముఖ్యంగా సంసారవిషయాల్లో— కలుగచేసుకోనివాడిని ఆరోజున మీ విషయంలో ఎందుకు కలుగచేసుకున్నానో నా కిప్పటికీ ఆశ్చర్యమే! మీరన్నట్టుఇదేదో జన్మాంతరసంబంధమే! కాని ఏమిలాభం? నేను మీకుఅక్కరకు రాకపోయాను. ఏమీ చెయ్యలేకపోయాను. నావెధవసందేహాలు నన్నిలాచేశాయి. తీరా తెగించి మీయింటికి వచ్చేసరికి మీరు వెళ్లిపోయారని తెలిసింది. పైగా నేనే మిమ్మల్ని తీసుకువెళ్లానని మీ భర్త నామీద యెగిరాడు. అప్పటినుంచీ మీజాడ తెలుసుకుందామనీ, మిమ్మల్ని చూదామనీ నేనూ యెన్నో ప్రయత్నాలు చేశాను. కాని నా కేమీ దారీ తెన్నూ కనపడలేదు. ఏమీ చెయ్యలేక నోరు మూసు

కాని ఊరుకున్నాను. కాని ప్రాణంమట్టుకు మీ మీదనే ఉందంటే నమ్మాలి మీరు."

"ఆఁ! మా ఇంటికి మళ్లీ వచ్చారా? నాకోసం వెతికారా? ఎంత నిర్భాగ్యురాలిని! మీరు వస్తారని ఏదో అనిపించినా వినిపించుకోక, ఒక్కపూటేనా ఆగకుండా లేచివచ్చాను. నా రాత ఇలా ఉంటే ఎవరేమి చేస్తారు?" అని విచారించింది.

ఎంతో కాలానికి కలుసుకున్న ఆప్తబంధువులులా చాలాసేపు మాట్లాడుకున్నారు సాంబశివుడూ, సౌభాగ్యమూను.

మళ్లీ వస్తానని సాంబశివుడు లేచివచ్చాడు వీథిలోకి. గేటుదగ్గర పరాంకుశం ప్రత్యక్షమయ్యాడు. తన ఖాతాదారు కానివాడు కొత్తవాడెవడో వచ్చాడే అని తేరిపార చూశాడు పరాంకుశం. "ఓరి నీమొహం తగలెయ్యా! నీచేతులో పడ్డదా పాపం! సరే, ఆపిల్ల చెప్పినదానికి పూర్తి అయిన వ్యాఖ్యానం దొరికింది" అనుకొని చక్కాపోయాడు సాంబశివుడు.

కాపురానికి వచ్చినతరువాత ఈ ఒక్కరోజునే, మనస్సు సంతోషంగా ఉంట సౌభాగ్యానికి. ఈ మనిషి ఎవరు? మనమీద యెందుకింత దయ? మళ్లీ కూడా ఆయనసంగతేమీ కనుక్కోనేలేదే అని అనుకుంటుండగా పరాంకుశం సిడసిడలాడుతూ లోపలికి చక్కావచ్చాడు.

సౌభాగ్యానికి అతన్ని చూసేసరికి వొళ్లు మండిపోయింది. మనస్సు కాస్త సంతోషంగా ఉందనుకుంటుంటే ఈసమయంలోనే ఈపీను గిక్కడికెందుకు తగులడ్డాడనుకుంది. మాట్లాడకుండా కూర్చుంది.

"ఎవరాయన?" అన్నాడు.

"ఎవరైతే మీకెందుకు? తమతో మనవిచేసుకోవాలా?"

"అబ్బే! ఊరికే అడిగాను. ఎప్పుడూ చూచిన జ్ఞాపకం లేక. ఆ సినీమా సోదరుడేమో ననుకున్నాను."

సౌభాగ్యం మాట్లాడలేదు.

"ఏం అలా ఉన్నావు?"

"ఏం లేదు. తలనొప్పిగా ఉంది. పడుకోబోతుంటే మీరొచ్చారు. సెలవు" అని లోపలికి చక్కాపోయింది.

పరాంకుశం కాస్సేపు కూర్చుని, ఏమిచెయ్యడానికీ తోచక చక్కాపోయాడు.

## ౬

మర్నాడు అన్నప్రకారం సాంబశివుడు వచ్చాడు. సౌభాగ్యం ముఖం చాటంత చేసుకుని ఎదురుగా వచ్చింది.

"మీరు వస్తారా, రారా అని నిన్నటినుంచీ అలా గంటలూ, నిమిషాలూ లెక్కపెట్టుకుంటూ కూర్చున్నాను. పడుకోలేదు, భోజనం చెయ్యలేదు. నాజన్మలో దేనికోసమూ ఇంత ఆదుర్దాగా ఎదురు చూడలేదు"

"ఎందుకమ్మా, అంత ఆదుర్దా! నే నేం చేశాను నీకోసం? ఒక్క మాట సహాయమేనా చెయ్యలేకపోయానే?"

"ఇంతకంటె నాకేమి చెయ్యాలండీ మీరు? మానవజాతిమీద నశించిన విశ్వాసము మళ్లీ చిగురింపచేశారు. ఈజాతిలో మానవత్వమే లేదనుకున్నదానికి ఉన్నదని ఋజువుచేశారు. అది చాలు. నాహృదయంలో ఏర్పడిన శూన్యం తొలగించారు. ప్రేమామృతంతో నింపారు."

"అమ్మా! ఒట్టివెర్రి. కాలాన్నిపట్టి నీహృదయంలో కలిగిన మార్పేకాని, నాప్రయోజకత్వం ఏమీ లేదు. నువ్వేమీ అనుకోకుండా ఉంటే సాహసించి ఒక్కసంగతి చెపుతాను."

"అబ్బ! నన్ను చూస్తే అంత భయం వేస్తోందేం? అయినా, మీకు అభయమిస్తాను, చెప్పండి, ఆ భయంకరవార్త ఏమిటో."

"ఏం లేదు. మీ రీమకాం, జీవితం మార్చడానికి వీలవుతుందా? ప్రయత్నంచేస్తారా? విధివశంచేత వచ్చిన ఈదుర్భరావస్థ మిమ్మల్ని ఎంత బాధిస్తోందో, మిమ్మల్ని ఎలా తినేస్తోందో నాకు తెలుసు.

కొంత ప్రయత్నంచేసి ఈదొంగఊబిలోనుంచి బయట పడమని నాకోరిక."

"పడి?"

"పడి, ఏమీ లేదు. మామూలుమనిషి కమ్మని"

"హహ్హహ్హా! నేను మళ్ళీ మామూలు మనిషిని కావడమే? మీ రెంత అమాయకులండీ! నేను మామూలు మనిషి నయ్యే అదృష్టం ఈజన్మకు లేదు. తారులో ఉండే నలుపైనా పోగొట్టవచ్చునుకాని, నాజీవితంలో కళంకం పోగొట్టడం అసాధ్యం. నాజీవిత మిలాగే సాగనివ్వండి. ఎప్పుడో నాపాపంపండి, కర్మ పరిపక్వం అయినతరువాత వొస్తుంది ఏదోమార్పు. తొందరేం? మీబోటివారు నాదగ్గరగా రావడం, నాతో మాట్లాడడం, తక్కినవాళ్లమల్లే నన్నుకూడా సగౌరవంగా చూడడం - ఇదే చాలు నా కీజన్మకి. ఎప్పుడేనా మీరు కనపడుతూ ఒక్కమాటు నాయోగక్షేమం కనుక్కుంటూ ఉండడం—అంతే నాకు కావలిసింది."

"అంత అధైర్యపడవలసిన పని లేదు. నీజీవితమంతా ముందు ఉంది. కాలం తారులోనలుపూ తగ్గిస్తుంది, జీవితంలో కళంకమూ పోగొడుతుంది. మనం సంకల్పిస్తే, శ్రద్ధతో తగినసాధనచేస్తే, ఈజన్మే కాదు-జన్మాంతరకృత కర్మకళంకంకూడా పోగొట్టుకో వచ్చును. మన కున్న ఆయుస్సు అందుకే."

సౌభాగ్యానికి ఉన్న అధైర్యం, పిరికితనం పోయి, వింతధైర్యం, ఉత్సాహం వచ్చాయి. జీవించవలెననే ఆశ, జీవితంలో ఆనందం ఉన్నదనే నమ్మకం, ఇంకా అనుభవించవచ్చుననే నిశ్చయం కలిగాయి. ప్రపంచం, కాలం, కష్టం, సుఖం, ఆకలీ, దప్పికా అన్నీ మరచి, గాలివానలో చెట్టుకొమ్మ నంటిపెట్టుకుని కూర్చున్న పక్షులలాగ కూర్చుని సాయంకాలంవరకూ కబుర్లు చెప్పుకున్నారు. సాంబశివుడు మళ్ళీ వస్తాననీ, పనున్నదనీ వెళ్లడానికి లేచాడు. సౌభాగ్యంకూడా లేచింది.

"మీ రివేళ తుపానులో సముద్రంలో కొట్టుకుపోయే జీవుణ్ణి ఒడ్డుకి లాక్కొచ్చి ప్రాణదానం చేశారు. మీరు చేసినఉపకారం ఇంతా అంతా కాదు. నామీదనుంచి ఏదో బరువు పోయినట్టూ, ఎంతో తేలికగానూ ఉంది. రేపు ప్రాణంపోయినా నిశ్చింతగా పోవచ్చును. ఒక్కసారి మీ పాదాలు ముట్టుకోనివ్వరూ?"

సాంబశివుడు పొంగివచ్చే దుఃఖాన్ని అపుకుని వెనక్కు తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు. అతను వెళ్లినవేపే చూస్తూ ఎంతసేపో అలా నిలబడిపోయింది సౌభాగ్యం. కొంతసేపటికి లోపలికి వెళ్లి కాస్త కాఫీ తాగింది. ఇంతలో పరాంకుశం చక్కావచ్చాడు.

౭

పరాంకుశం కాలయాపనేమీ చెయ్యకుండా వచ్చిన పని వెంటనే చెప్పాడు. ఆవిడను త్వరగా డ్రస్సు వేసుకుని సిద్ధముగా ఉండమన్నాడు. "కారుపంపిస్తాను. మామూలుహోటల్లో మామూలుగదిలో తొమ్మిది గంటలకు ఉండ" మన్నాడు.

"ఏమి టీశని ఇలా వెంటాడిస్తోంది! నిన్ననూ ఆయన వెళ్లగానే వచ్చాడు; మళ్ళీ ఇవాళా అలాగే తయారయ్యాడు! ఈ పెడదారినుంచి మంచి దారి కొద్దామంటే పడనివ్వడా ఏమి టీముండాకొడుకు" అనుకుంది.

తనీ వేళ రాలే నన్నది. వంట్లో బాగా లేదన్నది. ఇంక ఈవృత్తే అక్కరలే దన్నది.

"ఏమిటే? ఈ వృత్తే అక్కరలేదూ? ఏం, చేదు మేశావా? సుఖంగా, స్వతంత్రంగా ఉన్నావు. కావలసినంత డబ్బు. ఇల్లు వాకిలి, వస్తువులు, వాహనాలు—ఏమిటి నీకొచ్చిన లోటు! ఇంత కంటె ఇంకోచోటమట్టుకు నీకు ఎక్కువొచ్చేది ఏమిటి?"

"ఏమీ లేదు. నా కిదివరకు వచ్చినది చాలు. ఇంక నాకేమీ అక్కరలేదు. న న్నింతటితో విడిచిపెడితే అంతే చాలు."

పరాంకుశం నవ్వాడు. వేళాకోళం చేశాడు. కోప్పడ్డాడు. బెదిరించాడు. బ్రతిమాలాడు. ఏమి చేసినా లాభంలేకపోయింది. పరాంకుశాని కేమీ పాలు

పోలేదు. అవతల పెద్దమనిషికి మాట ఇచ్చాడు. వ్యాపారంలో అన్నప్రకారం సరుకు వప్పచెప్పక పోతే పరపతి చచ్చి ఊరుకుంటుంది. అందుచేత ఎలాగైనా తీసుకువెళ్లితీరాలి. అందులోనూ ఈ మనిషి ఎప్పుడోకాని తనదగ్గరకు రాడు. అందుచేత అతని బేరం పోగొట్టుకోడానికి వీలులేదు. మళ్లీ అనేక రకాలుగా బ్రతిమాలాడు. అప్పుడూ వినలేదు. ఆఖరుకు ఒకయెత్తు వేశాడు. ముందు ఆ రాత్రి పూచీ గడిచిపోతే తరువాత దాని రోగం కుదుర్చవచ్చు ననుకున్నాడు.

“మాను. మంచో చెడ్డో ఏదో ఇన్నాళ్లనుంచీ అయిపోయింది. నేను ఏది చేసినా నీకు ఉపకారమనే ఉద్దేశంతోటే చేశానుకాని నాస్వలాభంకోసం కాదు. నామాట నమ్ము. నువ్వనుకున్నట్టుగానే మానెయ్యి ఈ వృత్తి. మంచిదే. నా అభ్యంతరమేమీ లేదు. ఈ ప్రశంస మళ్లీ ఎప్పుడేనా నీ దగ్గర చేస్తే నన్ను చెప్పుతీసుకు కొట్టు. ఈ వేళమట్టుకు నీవు అంగీకరించకతప్పదు. నాగౌరవం కాపాడాలి. తప్పదు. కావలిస్తే నీకాళ్లు పట్టుకుంటాను.” అని ఎన్నివిధాల ఎంతనీచంగా బ్రతిమాలాలో అన్నివిధాలా, అంత నీచంగానూ బ్రతిమాలాడు.

సౌభాగ్యం చాలాసేపు ఆలోచించింది. వీడి మాట నమ్మవచ్చునా, కూడదా? పోనీ, నమ్మకపోతే మట్టుకు మునిగిపోయింది ఏముంది? ఈఒక్కసారీ ఏదో ఏడ్చి చక్కావస్తే, వీడి వలనుంచి మర్యాదగా బయటపడొచ్చునేమో! అనవసరంగా పాముతో వైరం పెట్టుకోడ మెందుకు? ఆలోచించి ఆలోచించి ఆఖరుకు సరేనంది.

పరాంకుశం బ్రహ్మానందపడ్డాడు. ఆవిడ నొక్కసారి ముద్దుపెట్టుకోబోయాడు. కాని ఆవిడ వప్పుకోలేదు. కారు పంపుతానని చెప్పి పరాంకుశం చక్కాపోయాడు.

తొమ్మిదిగంటలకు కారు వచ్చింది. సౌభాగ్యం బయలుదేరింది. కాని ఎందుచేతనో ఎప్పుడూలేని బెంగ తోచింది. ఏదో ఘోరవిపత్తు సంభవిస్తుందేమో ననిపించింది. కాళ్లు బరువులెక్కి ముందుకి అడుగు సాగలేదు. అలాగే ఎలాగో వెళ్లి కారులో కూర్చుంది.

హోటలుకు చేరి గదిలో కూర్చున్న అరగంటకు బయట అడుగులచప్పుడూ, మరుక్షణంలో తలుపు నెమ్మదిగా కొట్టినచప్పుడూ వినపడ్డాయి. వెళ్లి తలుపు తీసింది. లోపలికి ఒకదొర చక్కావచ్చాడు. సౌభాగ్యం తెల్లపోయింది. పొరపాటున ఒక గదిలోకి వెళ్లవలె ననుకుని ఈగదిలోకి వచ్చాడేమో ననుకుంది. కాని వాడు వెళ్లే ప్రయత్నం లేకపోగా పైగా తలుపు వేసి నవ్వుతూ లోపలికి వచ్చాడు. అప్పటికే తాగిఉన్నాడు. జేబులో ఇంకోసీసా కనపడుతోంది.

తన పేరు జాన్సన్ అనీ, పరాంకుశం తీసుకొచ్చాడనీ చెప్పాడు. తనకు ఈదేశస్థులంటే చాలా ఇష్టమన్నాడు. ఇక్కడ ఆడవాళ్లు చాలా బాగుంటారన్నాడు. ఇలా ఏదేదో వాగుతూ కూర్చున్నాడు. సౌభాగ్యం దూరంగా మౌనంగా నిలబడ్డది. “రా, దగ్గరకు రా. భయంలేదు. ఎంత చక్కగా ఉన్నావు?” అని లేచివచ్చి, కౌగలించుకుని తీసుకువెళ్లి వొళ్లో కూర్చోపెట్టుకున్నాడు..........

ఆదుర్మార్గుడు తాగిఉండి ఏమిఘోరం చేశాడో తెలియదు. ఎవ్వరూ తెలుసుకునే సావకాశం లేదు. సౌభాగ్యం చచ్చిపోయింది. గొంతుక పిసికి చంపేశాడు. ఆవిడప్రాణం పోవడంతోటే వాడి మైకం వదిలింది. హడిలిపోయాడు. ఏమి చెయ్యడానికీ తోచలేదు. కొంతసేపు అలాగే కూర్చున్నాడు...... ఎలాగో లేచి నిశ్శబ్దంగా, ఆ అర్ధరాత్రి ఆశవాన్ని భుజాన్నేసుకొని తన కారులో ఎక్కించుకొని మాంబళం తీసుకువచ్చి, ఆపిల్లపర్సులో తాళం తీసి, తలుపు తీసి, లోపల మంచంమీద ఆ అమ్మాయిని పడుకోపెట్టి, కారు తిన్నగా బెంగుళూరు పట్టించి, తెల్లవారకుండా బెంగుళూరు చేరాడు.

ఇక్కడ తెల్లవారేసరికి ఈ భయంకరవార్త ఊరంతా పాకిపోయింది. పరాంకుశానికి తెలిసి పారిపోదా మనుకుంటుండగానే పోలీసులు వచ్చి పట్టుకున్నారు. సాంబశివుడు ఈ మాట విని, నిశ్చేష్టుడై,

కొన్నాళ్లవరకూ మతిపోయినట్టు ఏదో పిచ్చిగా ఉండేవాడు.

## ౫

కేసు సెషన్సుకు వచ్చింది. ఊరంతా అట్టుడికినట్టు ఉడికిపోయింది. ఈ స్వామినాథఅయ్యర్లు కాని, అయ్యంగార్లుకాని, చెట్టియార్లుకాని, ఒకళ్లకూ చీమ కుట్టినట్టైనా లేదు. సౌభాగ్యాన్ని ఎరిగున్న ఇంతమంది లోనూ ఆవిడచావుకు నిజంగా కన్నీరు కార్చింది ఒక్కడు సాంబశివుడే.

పరాంకుశంకేసు విచారణ అయింది. అతనే హంతకుడని ఋజువుచేశారు. అతని ఖాతాదార్లలో ఒక్కడూ అతన్ని రక్షిద్దామన్నవాడు లేకపోయాడు. దొరసంగతి చెప్పబోయాడుకాని ఎవళ్లూ నమ్మలేదు. పరాంకుశానికి మరణదండన విధించారు. ఒక మనిషి చంపబడింది, అందుకని ఒక మనిషిని ఉరితీశారు: న్యాయం జరిగింది. ఇంకేం కావాలి? వీళ్లు లేకపోవడంవల్ల ప్రపంచానికి వచ్చిన లోటేముంది? ఒకడికి పదిమంది పరాంకుశాలు బయలుదేరుతారు. ఒక సౌభాగ్యానికి వందమంది సౌభాగ్యాలు బయలుదేరుతారు. జగన్నాథరథం వెడుతూంటే చక్రాల క్రింద పడి ఎంతమంది చావడంలేదు? అయినా రథం సాగుతూనేఉంది. అందులో దేవుడు నవ్వుతూ అలాగే కూర్చున్నాడు. అలాగే కీటకాల్లో కొంత మంది వచ్చినా పోయినా సంఘం సాగుతూనే ఉంటుంది.

పరాంకుశం హంతకుడు కాడేమోనని మా సాంబశివుడికి అనుమానం కలిగింది. పరాంకుశం అంటే ఎంత కోపం, మంటాఅయినా ఒకమనిషిప్రాణం నిర్హేతుకంగా పోతోంది అంటే చూస్తూ ఊరుకోలేకపోయాడు సాంబశివుడు. తను ఒకరిద్దరు స్నేహితులతో చెప్పి వాకబుచేసి ఆచోకీ తీసి, ఇతను నిర్దోషి అని తేల్చాడు. కాని ఇది కోర్టులో ఋజువుకావడ మెట్లా? ఇతను వెళ్లి పరాంకుశంస్నేహితులతో మాట్లాడితే, ఏమీ లాభం లేదనీ, అనవసరంగా తమరు అల్లరిపడి ఇతరులను అల్లరిపెట్టవద్దనీ సలహాఇచ్చారు. ఏం చెయ్యాలో తోచక పిచ్చెత్తినట్టు తిరిగాడు. ఇంతలో పరాంకుశాన్ని ఉరితీశారు. సాంబశివుడికి మతిస్తిమితం బొత్తిగా పోయింది. తను బ్రతికి ఉండి ఎవళ్లకూ ఏసహాయమూ చెయ్యలేకపోయాను సరే—ఆఖరికి, యథార్థం తెలిసిఉండికూడా, ఒక తోటిమానవుడు నిర్హేతుకంగా ఉరితీయబడుతూంటే చూస్తూ ఊరుకోవలసి వచ్చిందే అని మరింత బెంగపెట్టుకుని ఆఖరుకు ఆత్మహత్య చేసుకున్నాడు. దానివల్ల సాధించిందేమిటో నాకర్థంకాలేదు. జగన్నాథునిరథం యథాప్రకారంగా సాగుతూనూ ఉంది, సాగనూకలదు.



# ఆంధ్రులు — హిందీ

శ్రీ 'విషనాగు'

హిందీపైన ఆంధ్రులకు మోజుకలుగుట ఈనాడుమాత్రమే కాదనియు, తరతరాలనాడుకూడ ఆంధ్రులెందరో ఉత్తర హిందూస్థానమునకు వెళ్లి తన్మయులైపోయి స్వమాతృభాషనే పూర్తిగా మరచిపోయినారనియు, ప్రాచీనార్వాచీన కాలములందలి ప్రామాణికహిందీవాఙ్మయములో సుప్రసిద్ధులైయున్న హిందీరచయితలెందరో జన్మతః ఆంధ్రులేయనియు, ఇప్పటికిని హిందీవాఙ్మయసేవ చేయుచున్న ఆంధ్రులెందరో కలరనియు, రాష్ట్రభాష కాబట్టి దాని నాదరించుట జాతీయశ్రేయోదృష్ట్యా మంచిదే కాని దాని మోజులోపడి స్వభాషను పూర్తిగా మరచిపోవుటయే కాక దానిని నిరాదరణతో చూచుట హిందీప్రచారకులకు భావ్యము కాదనియు ఈవ్యాసములో నిరూపింపబడినది.

*

నిజంగా ఆంధ్రులు త్రిశంకు స్వర్గములో వున్నారంటే అతిశయోక్తి కాదు. ఇటు ఆర్యులూ కాదు, అటు అనార్యులూ (ద్రావిడులు) కాదు. వీరి ప్రతిభ అన్నివైపులా వుంది. భారతీయ హిందూ సంస్కృతిని సుదూరపూర్వదేశాలకు వ్యాపింపజేసింది ఆంధ్రులే. బౌద్ధమహాయాన సంప్రదాయానికి పుట్టిల్లు మన గుంటూరే. దీని ప్రధానప్రవర్తకుడు సిద్ధనాగార్జునుడు ఆంధ్రుడు. మహాయాన సంప్రదాయాన్ని చైనావంటి మహాదేశాలకు తీసుకెళ్లి విశ్వవ్యాపకం చేసింది ఆంధ్రులే. కాని ఏం లాభం? అడివిని గాచిన వెన్నెలచందమాయె.

## మన 'అంధ'త్వం:

దొరికినంతమట్టుకు ఇతిహాసాన్ని పరిశీలిస్తే మన ఆంధ్రత్వం, మన పూర్వుల 'ఆంధ్రి' తిరస్కరింపబడుతూనే వచ్చాయి—స్వయం మనద్వారానూ, ఇతరుల ద్వారాను. ఆంధ్రత్వానికి మూలవిరాట్టయిన 'ఆంధ్రి'ని పూర్తిగా మరచిపోతూ వచ్చాం—ఇప్పుడు అంతర్రాష్ట్రీయ ప్రఖ్యాతికొరకు భారతీయ విద్వాంసులు మాతృభాషల్ని మరిచి ఇంగ్లీషుకి దాసోహం చేస్తున్నట్టు. అందుచేతనేకదా నన్నయ్యనాటివరకూ మన 'ఆంధ్రి' అంధకారంలోనే వుంటూ వచ్చింది! తన్నుదాను మరిచిపోవడం ఆంధ్రుల సహజగుణం అనుకొంటాను. అందుకే మనల్ని అంధకారంలో వుండే అంధు (అంధ్రు) లన్నారు. అసలు మనం మన భాషల్ని మరచిపోవడమే మన అస్తిత్వాన్ని మరిచిపోతున్నామనుకోవాలి. సంస్కృతప్రాకృతాల తరువాత హిందీ అఖిలభారత ప్రఖ్యాతి గాంచిన భాష. కాబట్టి అందులో (హిందీలో) ఆంధ్రులు రచనాకౌశల్యం చూపించడం సహజమే. కాని యిప్పుడు నేను చర్చింపబోతున్న ఆంధ్రకవు లందరూ ఉత్తరభారతం వెళ్లి 'ఆంధ్రి'ని తిరస్కరించారంటే ఎంత శోచనీయం! ఇప్పుడు వీరి సంతతివారికి తెలుగురాదు. అందాకా ఎందుకు? కాశీలో నివాసం ఏర్పరచుకొన్న వల్లభు సంతతికి నేడు తెలుగుమాట్లాడడం రాదు. ఎంతఘోరం! కాశీలో తెలుగువారి సంపర్కం తక్కువకాదుగదా! చదువుసంధ్యలు రాని కూలిజనం పొట్టకూటికోసం దూరదేశాలు వెళ్లి మాతృభాషల్ని మరిచిపోవడం సహజమే. క్షమ్యం కూడాను. కాని పండితబృందం కొద్దిరోజుల్లోనే మాతృభాషల్ని మరిచిపోవడం తిరస్కారం కాదంటారా? ఈరోగం యింకా

వహించు కోలేరు. ఇంత విషయం అందరికీ తెలిసిందే. ఇప్పటికిని ఉత్తరహిందూస్తానంలో పెద్ద పదవుల్లో వుంటున్న ఆంధ్రు లెందరో గలరు. వీరిలో చాలామందికి తెలుగు మాట్లాడడం నామోషీ. ఇంకొకటి: మధ్యయుగ భక్తి ఆందోళకుల్లో ఆంధ్రేతరులగు మధ్వాచార్యులూ, విష్ణుస్వామీ తమ జన్మస్థలాన్నే కేంద్రంగా వుంచుకొని భక్తిప్రచారం చేశారు. కాని ఆంధ్రులగు నింబార్కాచార్యనూ, - వల్లభాచార్యనూ బృందావనంలో ప్రధానపీఠం స్థాపించి భక్తిప్రచారం చేశారు. ఇదే యితరులకూ, మనకూ భేదం.

## హిందీభాష భారతభూమికి హృదయంవంటిది:

నేడు హిందీ రాష్ట్రభాషాపదవిని రాజకీయంగా స్వీకరించింది. ఆంధ్రులు అతి వుత్సాహంతో ఆహ్వానించారు, ఆహ్వానిస్తున్నారు. హిందీప్రచారంలో దక్షిణానికి ఆంధ్రభూమి ప్రథమం వస్తుందంటే అబ్బురము కాదు. అటువంటప్పుడు హిందీతో మన కేం చుట్టరికం-ఐతిహాసిక సంబంధం వుందో లేదో తెలుసుకోవడం గౌరవకరవిషయం. ఆవశ్యకం కూడాను. చదువరులకు-రుచికరంగా కూడ వుండొచ్చును.

ఇప్పుడు హిందీ రాష్ట్రభాష అయిందని అనుకొంటున్నాం. కాని పూర్వంనించీ హిందీ రాష్ట్రభాషంత హృదయం కలిగివుంటూనే వచ్చింది. వైదిక యుగంనించీ వచ్చిన ఐతిహాసికఘటనలే దీనికికారణం. తరువాత మధ్యయుగంలో ధార్మికాందోళనకు హిందీ భాషాక్షేత్రం సమస్త భారతీయదృష్టికీ కేంద్రంగా వుండేది. ఈ కారణం చేత కూడ హిందీభాష, హిందీ సాహిత్యం దేశవ్యాప్తగౌరవం పొందుతూవచ్చాయి. అసలు వైదికయుగం నించీ హిందీభాషాప్రాంతం భారత భూమికి హృదయంగా వుంటూ వచ్చింది. అందుకనే వెనకటి రోజుల్లో ప్రతి భారతీయుడూ యీ హృదయానికి బలం చేకూర్చేందుకు ప్రయత్నించాడు. అంటే ఏ ధార్మికాందోళన (ఉద్యమం) వచ్చినా యిచ్చట వ్యాపించందే దానిమహత్వం ఏమీ వుండేదికాదు. ఏవిధమైన సాధనసదుపాయాలూ లేని ఆరోజుల్లో భారతీయవిచారకర్తలు భారతభూమిని ధార్మికంగా ఏకసూత్రంలో బంధించడానికి ప్రయత్నించారు; చాలా వరకూ సఫలు లయ్యారు కూడాను. హిందూ సంస్కృతిలో రాజశక్తి క్షీణదశకు వచ్చేప్పటికి యీ ఐక్యరక్షణకు జనశక్తిని ఆధారభూతంగా తీసుకోవలసివచ్చింది. అందుచేతనే 11, 12 శతాబ్దాల్లో ఒక్కమారుగా దేశభాషలు విజృంభించాయి. ఈ కార్యములో హిందీ ముందడుగు వేసింది. మహమ్మదీయ ఆక్రమణలూ, విధర్మిప్రభుత్వస్థాపనా మరీ దోహదం యిచ్చాయి. అయినా జనశక్తిని సంఘటితపరచడానికి 'హిందీ' మహత్తును దేశం గ్రహించింది. హిందీ వాఙ్మయాన్ని పరిశీలిస్తే భక్తికాలంలో విభాషీయు లెందరో రచయితలుగా కనిపించగలరు.

## హిందీ సాహిత్యంలో దాక్షిణాత్యుల ఋణం:

ఔత్తరేయులు దాక్షిణాత్యుల్ని 'ద్రావిడులు - అనార్యులు' అని ఎంతగోల చేసినప్పటికీ వీరి (దాక్షిణాత్యుల)ఋణం ఎన్నటికీ తీర్చుకోలేరు. అందు హిందీ భాషీయులు మరీని. హిందీసాహిత్యంలో స్వర్ణయుగము భక్తికాలం (వి. సం. 1375-1700 వరకు) దాక్షిణాత్యుల ఋణమే. మన వల్లభాచార్యులూ, రామానుజాచార్యులూ అవతరించకపోతే హిందీవాఙ్మయంలో సూర్యచంద్రులగు 'సూర్ - తులసీ' లు ఎలా జన్మించేవారు? ఈ మహాకవులిద్దర్నీ తీసేస్తే 'భక్తికాలం' చీకటికొట్టుగా వుండగలదు. శుష్క బౌద్ధ దర్శనంవల్లనూ, బౌద్ధవిహారాల నైతిక పతనంవల్లనూ దేశంలో — ముఖ్యంగా ఉత్తరదేశంలో — హిందూసంస్కృతి ఎండిపోతుంటే దాన్ని జీర్ణోద్ధారంచేసి మళ్లీ చిరకాలం వరకూ ప్రవహించేటట్టు చేసింది కుమారిలభట్టూ, శంకరాచార్యులూ. హిందూధర్మానికి ప్రాణాలయిన ఈశ్వరవాదాన్నీ, వేదాల్నీ రక్షించిన యీ కుమారిలభట్టు ఎవరు? ఆంధ్రుడు! శంకరుడు మలయాళీ అని ప్రసిద్ధమే. వీరి ధార్మికాందోళనతో హిందీ సాహిత్యానికి ప్రత్యక్ష సంబంధం లేకపోయినప్పటికీ తరువాత మధ్యయుగంలో దక్షిణభారత భూమిలో మొలకెత్తిన భక్తి, లేక ధార్మిక ఆందోళనలో హిందీసాహిత్యానికి అవినాభావ సంబంధం వుంది. హిందీవాఙ్మయంలో భక్తియుగానికి పృష్ఠభూమి (బాక్ గ్రౌండు) దాక్షిణాత భక్తి ఆందోళనే. ఈ సంబంధాన్ని హిందీసాహిత్యలో

ఎన్నటికీ విడిపించుకోలేదు. "ఈయుగంలో ధర్మాన్నీ, కళనూ వేరుగా వుంచి విచారించలేము" అని హిందీ పండితులే ఒప్పుకొన్నారు. బౌద్ధ, ముస్లిము ఆక్రాంతమయి ఎండిపోతున్న హిందూ సంస్కృతి స్రోతస్సును రసవంతంచేసి నింపడానికి దాక్షిణాత్యులు—ముఖ్యంగా 'ద్రావిడులు – అనార్యులు' అనబడువారే — గంగను ఎగువకు ప్రవహింప జేశారు. అంటే కుమారిలభట్టూ, శంకరాచార్యులూ బౌద్ధ ధర్మంనుంచి హిందూ ధర్మాన్నయితే రక్షించారు కాని బౌద్ధ ధర్మంలో వున్న దార్శనిక శుష్కతను పోగొట్టలేకపోయారు. శంకరుడు తన దిగ్విజయయాత్రను నిరాటంకంగా జరపడానికి తాత్కాలికసామాజికవిచారభిత్తి మీదనే ఆందోళన లేవనెత్తాడు. ఇది నైజమే గూడాను. అందుచేతనే వీరి యుగంలో హిందూధర్మం ఎక్కువ జ్ఞానపరంగా వుండేది. కాని దీన్ని రసవంతమయిన భక్తిపరంగా చేసింది రామానుజ, మధ్వ, విష్ణు, నింబార్కాచార్యులు. శాస్త్ర సమ్మతమయిన భక్తి ఆందోళన ప్రవర్తకులలో యీనలుగురే ముఖ్యులు. వీరు ప్రవహింప జేసిన రస స్రోతస్సులో మునిగి హిందీభాష, హిందూప్రజ ముస్లిమ్ ఆక్రమణలో తనను రక్షించుకొనగలిగింది. దీన్ని ఎవరు కాదనగలరు ?

## హిందీ భక్తిసాహిత్యానికి భిత్తి దాక్షిణాత్యభూమి:

ఇంతవరకూ హిందీ వాఙ్మయచరిత్రగ్రంథాల్లో—ముసల్మానుల ఆక్రమణ, దుండగాలవల్ల త్రస్త హిందూప్రజ నిరాశచెంది సర్వశక్తిసంపన్నుడను, సర్వవ్యాప్తుడయిన ఈశ్వరునివైపుకు తిరగడంస్వాభావికం కాబట్టి హిందీ వాఙ్మయములో 'భక్తికాలం' జనించింది అని తేల్చారు. కాని యిప్పుడీ సిద్ధాంతం పండితబృందంలో మాన్యం కాదు. ఈభక్తికాలం పుట్టుకలో ముస్లిమ్ ఆక్రమణప్రభావమే వుందనుకోవడం పొరపాటు. భారతీయచింత సహజంగా వికసిస్తూ ముస్లింసమయంలో అనుకూల వాతావరణాన్ని పొంది సమస్త భారతీయ అంతరీపంలో విద్యుచ్ఛక్తిలాగ వ్యాపించింది. ఈ భారతీయచింత క్రమికవికాసం దక్షిణభారతభూమినించి కలిగిందే. తమిళదేశంలోని ఆళ్వారులభక్తిని రామానుజాదిఆచార్యులు శాస్త్రసమ్మతంగా గ్రహించి దేశమంతటా వ్యాపింప జేశారు. కావున హిందీభక్తియుగసాహిత్యం 'హతదర్ప పరాజితజాతి సంపత్తి' కాదని విశ్వభారతి (శాంతినికేతనం) హిందీ ఆచార్యులయిన హజారీప్రసాద్ ద్వివేదీగారు వాదిస్తున్నారు. ఏది ఎలాగైనా వుండనీ, భక్తి ప్రవాహం దక్షిణంనుంచి వెళ్లిందే. ముస్లిమ్ ఆక్రాంతం కాకపోయినప్పటికీ కొంచెంనిమ్మళంగా భక్తిప్రవాహం ఉత్తరభారతభూమిలో వ్యాపించేదే. శంకరుని దిగ్విజయం జ్ఞానభిత్తిమీదనే వున్నందువల్ల అద్వైతవాదం లోకమతవాదానికి అనుకూలంగా లేదు. అసలు జ్ఞానసాహిత్యం సామాన్యప్రజకు గాక విద్వజ్జనుల సంపత్తిగా వుంటుంది. అందుచే ముస్లిముఆక్రమణ జరగకపోయినా లోకమతానుకూలమైన రసపూర్ణ భక్తిప్రవాహం వ్యాపించడం సహజం. క్రీ. శ. పదకొండో శతాబ్దంలోనే రామానుజాచార్యులు శంకరుని నిర్గుణబ్రహ్మలో సగుణఈశ్వరుని స్వీకరించి శుష్కజ్ఞానాన్ని సరసంగా చేయడానికి భక్తిని స్వీకరించాడు.

## భక్తివాదానికి మూలం మహాయాన సంప్రదాయం:

అదీగాక రెండువేల ఏండ్ల కిందటే బౌద్ధమతంలోవున్న శుష్కతను పోగొట్టి లోకమతానుకూలంగా చేయడానికి బౌద్ధమహాయాన సంప్రదాయం జనించింది. లోకవాదానికి ఉదారస్థానము తనలో యివ్వబట్టే 'మహాయాన' మనబడింది. మహాయానోత్పత్తితోనే లోకమతవాదస్థాపన చెప్పాలి. ఆచార్య ద్వివేదీగారు ఇప్పటినించీ హిందీ భక్తియుగానికి సంబంధం చూపిస్తున్నారు. నిజంగా ఇప్పటినించీ భారతీయ వాఙ్మయాన్ని చక్కగా అధ్యయనం చేస్తే 'భారతీయచింత' పరంపరావికాసం స్పష్టంగా కనిపించగలదు. మధ్యకాలంలో మెరుపులాగ సమస్త అంధకారంమీదా వ్యాపించిన భక్తి ఆందోళనను చూచి గ్రియర్సను పండితుడు తబ్బిబ్బుపడి "మద్రాసు ప్రాంతంలోవచ్చి వుండిపోయిన నెస్టోరియన్ సంప్రదాయ క్రైస్తవులనించి గ్రహించబడిం"దని అన్నాడు. అంటే భారతీయ భక్తివాదంమీద ఆళ్వారుల దగ్గరనించీ క్రైస్తవమత ప్రభావం వుందని

వీరి అభిప్రాయం. కాని యిది వట్టిభ్రమ. ఎండమావుల్ని చూచి నీళ్లనుకోవడం. కుమారిల - శంకరుల దిగ్విజయ యాత్ర బౌద్ధధర్మ క్షీణతకు కారణమైనప్పటికీ మహాయాన సంప్రదాయం నశించక హిందూలోకవాదంలో మిశ్రితమై పోయింది. అందుకే బుద్ధుణ్ణికూడ అవతారాల్లో చేర్చుకోక తప్పిందికాదు. నేటికిని హిందూ ధర్మంలో అనేక మహాయాన లక్షణాలు వుండిపోయినవి. హిందూభక్తివాదంలో వున్న నామసంకీర్తనం గ్రియర్సను పండితుడు క్రైస్తవులనుండి గ్రహించబడిందని అనుమానించాడు. కాని ఇది మహాయాన సంప్రదాయంలోని అవశేషలక్షణాలు మహాయాన సంప్రదాయప్రభావమే క్రైస్తవ భక్తివాదం మీద వుందని ఆచార్య ద్వివేదీగారి వాదన. క్రైస్తవమతంలో నామసంకీర్తనం మహాయానులనించి గ్రహించబడిందే. కావున మహాయాన సంప్రదాయ ప్రభావం భారతీయ సాహిత్యాలమీద — ముఖ్యంగా హిందీసాహిత్యం మీద —స్పష్టంగా కనిపిస్తోంది. "వైష్ణవ భక్తివాదం యీ మహాయానుల భక్తికి వికసిత రూపమే." "నామజపాల ప్రాచీన నిదర్శనం భారతవర్ష ప్రాచీన గ్రంథాల్లో కనిపించడం లేదని గాదు. కాని మధ్యకాలీన సమాజంలో కనిపిస్తున్న దీనిరూపం నిశ్చయంగా మహాయాన సంప్రదాయంతోనే ఎక్కువగా సంబంధించివుంది...ఈలాగే శాస్త్రసాపేక్షితమైన భావధార (ప్రవాహం) భక్తుల అవతారవాదాని కున్న రూపంమీద మహాయానుల విశేషప్రభావం వుంది."* ఈవిధంగా మహాయానుల భిత్తిమీదనే విశాల వైష్ణవభక్తివాదం నిలిచి వున్నట్లు కనిపిస్తోంది. కావున హిందీ భక్తిసాహిత్య స్వర్ణలత మహాయానుల భక్తి భిత్తిమీదనే పాకి అల్లుకొందంటే అతిశయోక్తి కాదు. తరువాత "ఈవిధంగా మహాయాన సంప్రదాయం, లేక భారతీయ బౌద్ధసంప్రదాయం క్రీస్తుశకారంభంలో లోకమత ప్రధానతను స్వీకరిస్తూ" మత్తానుగూడ లోకమతంలోనే మిళితమై లుప్తమవుతూ అనేక శాఖలుగా చీలి హిందీభక్తియుగీన సంతసాహిత్యం మీదగూడ తనని అచ్చుగుద్దినట్టు వదలి వెళ్లిపోయింది.

సంతసాహిత్యం అధ్యయనం చేసినచో దీన్ని స్పష్టంగా కని పెట్టగలం.

## చౌరాసీ సిద్ధులు:

కొద్దిరోజుల క్రిందటివరకూ హిందీవాఙ్మయ ప్రారంభం పదవ విక్రమశతాబ్ది అంతంనించీ అని అనుమానంతోనే మాన్యమవుతూ వచ్చింది. ఎనిమిదో శతాబ్దిలో పుష్యుడనుకవి హిందీలో అలంకారగ్రంథం రాశాడని వినికిడిగా వున్నప్పటికీ ప్రమాణాలేమీ దొరకనందున అది కింవదంతిగానే వుండి పోయింది కాని ఇటీవల నూతన అన్వేషణకార్యాలవల్ల హిందీవాఙ్మయోద్భవం ఏడో శతాబ్దివరకూ వెళ్లింది. మహాపండిత రాహుల సాంకృత్యాయనులు తిబ్బతుయాత్ర చేస్తూ అసంఖ్య బౌద్ధగ్రంథాల్ని సేకరించేశారు. వీటిలో కొన్ని తిబ్బతు గ్రంథాల సహాయంతో చౌరాసీ (84) సిద్ధుల వివరణ తెలియజేశారు. ఈసిద్ధుల పరంపర ఏడో శతాబ్దినుంచి పన్నెండో శతాబ్దివరకూ గలదు. వీరు తమ మతప్రచారం కొరకు సంస్కృతంలోనేకాక దేశభాష (హిందీ) లోనూ కవిత రచించారు. 'బౌద్ధగాన్ ఓ దోహా' భూమికలో సుప్రసిద్ధ వంగపండితులగు మహామహోపాధ్యాయ హరప్రసాద శాస్త్రిగారు సిద్ధుల దేశభాష వంగభాషకు ప్రాచీన రూపమని నిర్ణయించడానికి ప్రయత్నించారు. కాని యిది భ్రమ. సిద్ధుల కావ్యభాష హిందీకి ఉపభాషయిన 'మగహీ'కి ప్రాచీనరూపం. 'సాంధ్యభాష' అను పేరుతో పిలువబడుచుండేది. దాదాపు ఈ సిద్ధుల్లో చాలామంది నాలంద, విక్రమశిల విద్యాపీఠాల్లో శిక్షణ పొందారు. ఈ సిద్ధుల జీవనచరిత్ర యింతవరకూ వెలుగులోకి రాలేదు. వీరిలో 'కణ్హపా' ఒరిస్సావాడని కొందరూ, కర్ణాటకు డని కొందరూ అంటున్నారు - అనుమానంతోనే. కాని వీరిలో చాలామంది దాక్షిణాత్యులు - అందులో ఆంధ్రులు—కలరని నావూహ. ఈ సిద్ధులందరి నామాంతమందు గల 'పా' సంస్కృత 'పాద' శబ్దానికి అపభ్రంశమని కొందరు పండితులు వూహిస్తున్నారు. కాని యిది ఆంధ్ర-కర్ణాటక ప్రభావంవల్ల 'అప్ప'కు అపభ్రంశ రూపమని చెప్ప

---

* 'హిందీసాహిత్యకీ భూమిక'.

వచ్చు. ఎందుకంటే — పూజ్యపాద, పద్మపాద మొదలగు శబ్దాల్లో 'పాద' ప్రయోగింపబడుచున్నప్పటికీ సిద్ధుల నామాంతమందు గల యీ 'పా(ద)' ప్రత్యయం నిరర్థకంగా కనిపిస్తోంది. పూజ్యార్థంలో ఎంతమాత్రం కనిపిస్తున్నట్టులేదు. 'అప్ప'కు అపభ్రంశమైన యెడలనే 'పా' పూజ్యార్థంలో సార్థకమగుతోంది. 'అప్ప' ఆంధ్రకర్ణాటక భాషల్లో పితృవాచకంగదా. కావున ఈ సిద్ధుల్లో కొందరు ఆంధ్రులనీ, వీరిమీద ఆంధ్రకర్ణాటక ప్రభావం వుందనీ నానమ్మకం. ఆంధ్రభూమిలో పుట్టి పెరిగిన బౌద్ధ మహాయాన సంప్రదాయం వజ్రయాన సంప్రదాయంగా మారినందువల్ల యీ ప్రభావం పడడం అబ్బురంకాదు. వీరిలో నాగార్జున(కొండ) బౌద్ధ విహారంలోని ఆంధ్రబౌద్ధ భిక్షువులు వుండకపోరు. భావి అన్వేషణలు యీ రహస్యాన్ని వెలుగులోకి తీసుకురాగలవు. ఈ సిద్ధులు వజ్రయాన, సహజయాన ('వజ్రయాన'కు వికసితరూపం) సంప్రదాయులు గూడాను. కావున హిందీవాఙ్మయారంభంలో ఆంధ్రుల కలంతో నడిచిందని చెప్పాలి.

## వైష్ణవ సాహిత్యం:

భారతీయ హిందూ సాహిత్యాల్లో వైష్ణవ సాహిత్యానికే ఎక్కువ ఆధిక్యతవుంది. హిందీవాఙ్మయ భక్తి, రీతికాలాల కవుల్లో వైష్ణవ కవులు నూటికి 86 గురు వున్నారు. ఇందులో (భారతీయ సాహిత్యాలన్నిటిలోనూ) ప్రతిమధుర ప్రేమరసబిందువుల్ని చిలుకు కృష్ణసాహితీ మందాకిని మరీ ఎక్కువ వేగంతో ప్రవహిస్తోంది. గోపీకృష్ణుని మధుర గానం లేని సాహిత్యం ఏది? ఇక హిందీమాట చెప్పనవసరంలేదు. సంపూర్ణ హిందీ వాఙ్మయం గోపీకృష్ణుల మధుర గానంతోనూ, గోపికల విరహవేదనతోనూ నిండివుంది. తరువాత రీతికాలం (వి.సం. 1700-1900 వరకు) లోకి వచ్చి రాజాశ్రితకవుల నాలుకనుండి కారిన 'రసిక'తో రాధాకృష్ణులు చిత్రింపబడినప్పటికీ, హిందీ వాఙ్మయంలో నించి కృష్ణసాహిత్యాన్ని తొలగిస్తే ప్లిల్లలులేని గొడ్రాలి కొంపలాగ వుంటుంది. ఈ కృష్ణసాహిత్యామృతాన్ని భారతీయ సాహిత్యాలమీద చిలకడంలో ఆంధ్రుల భగీరథ ప్రయత్నం వుందంటే పాఠకులు నమ్మరేమో! రాధాకృష్ణుల ప్రేమగీతాలు నింబార్క సంప్రదాయంతోనే వ్యాపించాయి. ఈ సంప్రదాయంలో రాధాకృష్ణుల ప్రేమలీలకు ప్రాధాన్యత వుంది. రాధాకృష్ణుల పరకీయప్రేమను స్థాపించింది నింబార్కాచార్యులే. ఇంతకుముందు విష్ణుస్వామి సంప్రదాయంలో గూడ రాధాకృష్ణుల ఉపాసన స్వీకరింపబడినప్పటికీ నింబార్క సంప్రదాయంలోనే దీనికి ఎక్కువ ప్రతిష్ఠ కలిగింది. రాధ తన ప్రియుడగు కృష్ణునితో గోలోకభూమిలో ఎప్పుడూ విహరిస్తూ వుంటుందట. ఈ ప్రేమ ప్రవాహం సమస్త భారతభూమినీ ముంచి లేవనెత్తింది. గీతగోవిందం యీ ప్రవాహంలోదే! మధురగీతాలకి విద్వాంసుల్లో పేరువడసిన ఈ గ్రంథం మీద నింబార్క సంప్రదాయప్రభావం పూర్తిగావుంది. జయదేవుడు నింబార్కసంప్రదాయుడు: నింబార్కుని వల్ల ప్రభావితుడై అతడు గీతగోవిందాన్ని రచించాడు. 'అభినవజయదేవ' బిరుదు పొందిన మైథిలీకోకిల విద్యాపతి గీతగోవిందంవల్ల ప్రభావితుడై హిందీలో (మైథిలి) రాధాకృష్ణుల ప్రేమగీతాల్ని రచించాడు. గీతగోవిందం తరువాత దేశభాషల్లో మధుర గానానికి పేరువడసినవి విద్యాపతిగీతాలే. ఈ గీతాలు వంగరాష్ట్రంలో ప్రతియింటా వ్యాపించి వున్నాయి. ఈ గీతాలు వంగ హృదయాల్ని మోహింపజేశాయంటే అతిశయోక్తి కాదు. చైతన్యమహాప్రభువుగూడ ప్రభావితుడయ్యాడు.

ఈ నింబార్కుడెవరు? ఆంధ్రుడు. బహుశా జన్మస్థానం బళ్లారిజిల్లాలోని నింబాపురగ్రామం. పుట్టుచోటును గురించి అనుమానంగా వున్నప్పటికీ వీరు తెలుగు బ్రాహ్మణులనిమాత్రం పండితబృందానికి విశదమే. వీరు తమ నివాసం బృందావనంలో యేర్పరచుకొని రాధాకృష్ణుల ప్రేమప్రవాహంలో సమస్త భారతభూమినీ ముంచి లేవనెత్తారు.

## వల్లభాచార్యులు:

హిందీసాహిత్యంమీద నింబార్కుని ప్రభావం చూచుకొచ్చాం కాని యింతకన్నా మనకు దగ్గరిచుట్టరికం వుంది. వల్లభాచార్యులు ఆంధ్రుడు. వీరి తండ్రి ఆంధ్రదేశంలోని కాంకరవం (?) నివాసి.

వల్లభుని జననం తల్లిదండ్రులు కాశీయాత్రలో వుండగా మార్గమధ్యంలో—బహుశా కాశీలో — అయిందట. తరువాత వీరి చదువుసంధ్యలు అన్నీ ఉత్తర భారతంలోనే జరిగినవి. వీరికి సంస్కృతంలో ప్రకాండ పాండిత్యం గలదు. వీరి దార్శనిక సిద్ధాంతాల్ని 'శుద్ధాద్వైతవాదం' అంటారు. ఈ వాదమే 'పుష్టి మార్గం' అనిపించుకొంటుంది గూడాను. వల్లభునిమీద నింబార్కుని ప్రభావం వుంది. కాని వల్లభాచార్యులు లోకాచారాన్ని రక్షించడానికి గాను రాధాకృష్ణుల పరకీయప్రేమను స్వకీయ ప్రేమగా మార్చారు. వల్లభ సంప్రదాయ ప్రభావం హిందీసాహిత్యంమీద అచ్చుగుద్దినట్లు కనిపిస్తోంది. విద్యాపతి సమయంలోనే కృష్ణ సాహిత్య నిర్మాణం జరిగినప్పటికీ ఇచ్చటినించే కృష్ణ సాహితీ ప్రవాహం ఎడతెగకుండా మహావేగంతో ప్రవహించింది. పుష్టిమార్గం ప్రవృత్తిమూలకమైనందువల్ల వల్లభసంప్రదాయానుయాయుల్లో చాలామంది కళాకారులు జన్మించారు. ప్రసిద్ధ 'అష్టఛాప' కవులు వల్లభసంప్రదాయులే. జనశక్తిని ఆకర్షించడానికి హిందీ మహత్తును గ్రహించిన మతప్రవర్తకుల్లో వల్లభాచార్యులు ముఖ్యులు. వీరి జననం వి. శ. 1535 లోనూ, గోలోకవాసం వి. శ. 1587 లోనూ జరిగినట్లు మిశ్రబంధువులు రాస్తున్నారు. వీరు దేశభాష (హిందీ) లో గూడ కొన్ని శ్లేషపద్యాల్ని రచించినట్లు తెలుస్తోంది. హిందీలో వీరిచే రాయబడిన 'వనయాత్ర' అన్నే గ్రంథంకూడ లభ్యమైంది. వల్లభుడు హిందీ రచయితగా మనముందుకు రాకపోయినప్పటికీ మత ప్రచారానికి దేశభాషల మహత్తును గ్రహించాడు. కనుకనే బృందావనంలో రోజూ కృష్ణపూజాసమయంలో కీర్తన చేయడానికి హిందీలో గీతాల్ని రచించమని తన ప్రియశిష్యుడైన 'సూరదాసు'కు ఆజ్ఞాపించారు. ఇది హిందీ సాహిత్యాన్ని తక్కువ ప్రభావితం చేయలేదు. తరువాత ఎంతోమంది వీరి అనుకరణమీద కృష్ణసాహిత్యాన్ని నిర్మించారు. ఇప్పటికీ హిందీ కృష్ణ సాహిత్యమంతా వల్లభుని ప్రభావంలో వోలలాడుతోంది. వీరి సంతతి గూడ హిందీ సాహిత్యోన్నతికి చాలా గొప్పసేవ చేస్తూవచ్చింది. వల్లభునిపుత్రుడు విఠలనాథున్నూ, పౌత్రుడు గోకులనాథున్నూ రచించిన గద్యగ్రంథాలు హిందీ వాఙ్మయంలో చిరస్మరణీయాలు.

**విఠలనాథు:**

ఆంధ్ర వాఙ్మయంలోవలె హిందీలో పద్య సాహిత్యంతోబాటు గద్యం వికసించలేదు. మొన్నటి ఆధునిక కాలం వరకూ హిందీకవులు సాహితీదృష్టితో గద్యాన్ని ఎచ్చటా వుపయోగించలేదు. అందుచేతనే విఠలనాథు, గోకులనాథులు రాసిన వ్రజభాషాగద్య గ్రంథాలు — సాహిత్యికమహత్తు లేకపోయినప్పటికీ- హిందీ వాఙ్మయచరిత్రలో చాలా మహత్తరమైనవి. విఠలనాథు వి.శ. 1572 లో 'చునార్' అను గ్రామంలో (కాశీకి దగ్గరగా వుంది.) జన్మించాడు. వీరు పుష్టి మార్గపీఠంమీదికి వచ్చి వ్రజభాషాసాహిత్యంలో జీవన శక్తి పోశారంటే అతిశయోక్తి కాదు. వీరి ప్రోత్సాహంవల్లనే హిందీలో ప్రఖ్యాతి చెందిన 'అష్టఛాప' కవుల నిర్మాణం జరిగింది. పితృశిష్యులను' నలుగురినీ, స్వశిష్యులను నలుగురినీ కలిపి 'అష్టఛాప' అను బిరుదు యిచ్చారు. వీరు స్వయంగా వ్రజభాషా గద్యంలో గ్రంథరచన చేశారు. దీన్నిబట్టి చూస్తే హిందీలో సాహిత్య నిర్మాణానికి యితరుల్ని ఎంత ప్రోత్సహించారో వూహించగలం. వీరి గద్యగ్రంథాలు కేవలం ధార్మిక ప్రచారంకొరకు రాయబడినవి: ధార్మిక భావాన్ని వివేచించి ధార్మికమర్యాదను సర్వసామాన్యానికి సులభం చేయడానికి గద్యం ప్రయోగించబడింది. ఈవిధంగా సర్వసామాన్యంలో ప్రచారంకొరకు 'భాష'ను ప్రయోగించుటలో వీరే ప్రథములని చెప్పాలి. వీరు రాసిన గ్రంథాలు — (1) శృంగారరసమండనం, (2) యమునాష్టకం, (3) నవరత్నసటీక. శృంగార రసమండనంలో రాధాకృష్ణుల ప్రేమవిహారం వర్ణించబడింది. యమునాష్టకం సంస్కృతభాషలో వల్లభుని చేత రాయబడింది. దీన్ని విఠలనాథు సర్వజనానుకూలంగా హిందీటీకలో రాశారు. నవరత్న సటీకలో వల్లభ సంప్రదాయ సిద్ధాంతాలు వర్ణించబడ్డాయి.

**గోకులనాథు:**

గోకులనాథు విఠలనాథుకు నాలుగోసంతానం. వీరిజననం ఎప్పుడో తెలియదు. వీరి రచనాకాలం

వి. శ 1624 అని మాత్రం తెలుస్తోంది. వీరు బ్రజభాషా గద్యంలో చౌరాసీ వైష్ణవోంకీ వార్త, దో సౌ బావన్ వైష్ణవోంకీ వార్త అను రెండు గ్రంథాలు రచించారు. వీటిలో వల్లభసంప్రదాయ వైష్ణవభక్తుల జీవితాలు వర్ణించారు. ఈ విధంగా జీవితాల్ని రచించు పరిపాటికి గోకులనాథు సూత్రధారు డయ్యాడు. వీరి అనుకరణ మీదనే తరువాత అనేకగ్రంథాలు రచించబడ్డాయి. గోకులనాథుని పై గ్రంథాలు అచ్చమైన వ్యావహారిక బ్రజభాషాగద్యంలో రాయబడినందువల్ల హిందీగద్య చరిత్రలో చాలా మహత్తరమైనవిగా పరిగణింపబడు తున్నాయి. వీరి భాషలో అనేక వివిధ భాషాశబ్దాలు కలగా పులగంగా వుండడం చూస్తే మతప్రచారానికై వీరు దేశమంతటా విశేషపర్యటన చేసినట్టు కనిపిస్తోంది.

కాలాంతరంలో వల్లభసంప్రదాయమూ, దాని ప్రభావిత సాహిత్యపరంపరా 'వికృతి' చెందినప్పటికీ భక్తియుగంలో వల్లభసంప్రదాయకవుల్ని వేరుచేస్తే స్వర్ణయుగంలో వట్టిమాత్రం మిగులుతుంది. భక్తి కాలంలో దేదీప్యమానమైన కవులందరూ (ఒక తులసీ దాసును వదిలిపెట్టి) వల్లభసంప్రదాయులే. అస్తు.

**ఆంధ్రుల వలస :**

ఆంధ్ర సామ్రాజ్య వైభవకాలంలో, దాక్షిణాత్య భక్తిప్రవాహం ఉత్తరఖండములో ప్రవహించి వోలలాడుతున్నప్పుడు ఆంధ్రభూమినించి చాలామంది ఆంధ్రులు ఉత్తర దేశం — ముఖ్యంగా మధ్యప్రాంతం — వలసవెళ్లినట్టు చరిత్ర చెబుతోంది. ఆ రోజుల్లో దాక్షిణాత్యులంటే ఔత్తరేయుల్లో మంచి సన్మానం వున్నట్టు కనిపిస్తోంది. అక్బరురాజ్యకాలంలో మహారాణి దుర్గావతి అధీనంలో నర్మదానది ఒడ్డున 'గఢ పత్తనం' అను రాజ్యం వుండేది. ఇచ్చటికి (దుర్గావతి రాజ్యంలోకి) వి. శ. 1615 లో మూంగీపట్నం, మధుపురి, శ్రీరంగపట్నం, కాళేశ్వరంనించి ఏడు వందలమంది దాక్షిణాత్యులు వలసవచ్చారట.

"వర్షే వాణరసా రసేందుమిలితే
శ్రీమద్గఢాపత్తనే
రమ్యే నర్మదకోట తీర్థకలితే
దుర్గావతీపాలితే,
మూంగీ పట్టనతో ఒథవా మధుపురీ
శ్రీరంగకాళేశ్వరాత్
సంయాతా కిల దాక్షిణాత్య విబుధాః
సార్ధం శతం సప్తచ."

— వంశోపాఖ్యానమ్.

కాలాంతరంలో వీరంతా ఆ మేర్, ఝాలావాడ, బూందీ, రతలామ్, అనూపశహర్, కాశీ, ప్రయాగ, కాన్పూరు, ఆగ్రా, భదావర్ మొదలగు అనేక చోట్లకు వ్యాపించారట. వీరిలో ఆంధ్రు లెంతమం దున్నారో స్పష్టప్రమాణాలు దొరకడం లేదు. కాని వీరితోబాటు మధుకరభట్టు అను తెలుగుబ్రాహ్మణుడుగూడ దుర్గావతి రాజ్యంలోకి వచ్చాడట. ఇతడే హిందీలో ప్రఖ్యాతి గాంచిన ఆంధ్రుడగు పద్మాకరకవికి పూర్వపురుషుడు. ఇక్కడినించి వీరిసంతతి రెండు శాఖలుగా చీలి మధుర, గోకులం వలస వెళ్లింది. అప్పటినించీ యీ రెండు శాఖలూ మధురాస్థ (మాధుర్), గోకులస్థ అని పిలువ బడుతున్నవి. పద్మాకరుడు మాధుర్ శాఖకు చెందిన వాడు. ఈయన తన కృత్యంతంలో "ఇతి శ్రీ మధురాస్థ మోహన్ లాల్ భట్టాత్మజ......" అని పేర్కొన్నాడు. కాలాంతరంలో యీ మాధుర్ శాఖీయులు సాగర్, బాందా కూడ వలసవెళ్లారు. పద్మాకరవంశీయులు యిప్పటికిని సాగర్, బాందాలో వున్నారు. వీరికి తెలుగు పూర్తిగా రాదు. కాని వీరు మాట్లాడు హిందీలో మాత్రం తెలుగు ప్రభావం యిప్పటికిని కనిపిస్తోందట. వీరు తమ నామాంతంలో 'తైలంగ' ఉపాధి యింకనూ ప్రయోగిస్తుంటారు.

**మోహనలాల్ భట్టు :**

మధుకర భట్టుకి అయిదో తరంలో జనార్దనభట్టు జన్మించాడు. వీరు బాందాలో వుంటూవుండేవారు. వీరికి తృతీయ సంతానం, పద్మాకరకవికి తండ్రి అయిన మోహనలాల్ భట్టు వి. శ. 1743 లో జన్మించాడు. వీరు సంస్కృతంలో గొప్పపండితులు. మంత్ర శాస్త్రంలోగూడ పారంగతులట. తన అపారపాండిత్యం వల్ల పేష్వా రఘునాథరావు (నాగపూరు)దర్బారులోను, జయపురాధీశు డైన ప్రతాపసింహుని రాజదర్బారు లోను గొప్ప ప్రతిష్ఠ సంపాయించారు. హిందీలో వీరు

గ్రంథ రచన చేసినట్లు కనిపించనప్పటికీ మంచి కవిత్వం చేస్తుండేవారట. వీరివి కొద్దిపద్యాలుమాత్రమే నేడు మనకు లభిస్తున్నవి. వీరి భాష చాలామధురంగా వుంది.

పద్మాకర్:

హిందీలో ప్రఖ్యాతి వహించిన ఆంధ్రుడు పద్మాకరభట్టు. వీరి అసలు నామధేయం ప్యారీలాల్ భట్టు. కాని ఉపనామంతోనే ప్రసిద్ధి కెక్కారు. పద్మాకరుని తరువాత యింత ప్రఖ్యాతి వహించిన హిందీకవి ఆంధ్రుల్లోనూ, హిందీరీతికాలంలోనూ జన్మించలేదు. "రీతికాలీన కవుల్లో పద్మాకరుకి సజ్జన బృందం గొప్ప స్థానం యిస్తూ వచ్చింది. ఇంత సర్వప్రియుడైన కవి యీ కాలం (రీతి)లోపల 'బిహారీ'ని వదిలి మరొకరులేరు. పద్మాకరుని రచనా రమణీయతే యీ సర్వప్రియతకు కారణం. ఈయన తన (రీతి) పరంపరలో పరమోత్కృష్ట కవి అయినట్టే ప్రసిద్ధిలో ఆఖరువాడు కూడాను. దేశంలో వీరిపేరు మారుమోగినట్టు మరోకవిపేరు ప్రసిద్ధికిరాలేదు" అని హిందీపండితు లందరూ ఏక గ్రీవంగా ఆమోదిస్తున్నారు. పద్మాకరు వీరకవిత్వం చేసినప్పటికీ శృంగారప్రధానకవి అనే చెప్పాలి. వీరు రచించిన వీరకావ్యం 'హిమ్మత్ బహాదుర్ బిరుదావళి' నాయకుడు (లక్నోనవాబైన సుజా ఉద్దౌలాయొక్క సాధారణ సేనాని) ఉత్తముడు కాకపోయినప్పటికీ వీరరసపూర్ణమైన గ్రంథం. ఈయన వీరరసాన్ని చక్కగా నిర్వహించారు. కాని శృంగార కవితకే వీరు ప్రసిద్ధిచెందింది. 'రీతి' పరిపాటిని నిర్వహించినప్పటికీ వీరి శృంగారకవితలో అశ్లీలత రాలేదు. మృదుమధుర పదశైలికీ, కోమలభావశిల్పసౌష్ఠవానికీ పద్మాకరుతో సరితూగ గల కవి రీతికాలంలో మరొకడు లేడంటే అతిశయోక్తి కాదు.

పద్మాకరుడు వి. శ. 1810 లో బాందా, లేక సాగర్‌లో జన్మించాడు. చిన్నప్పటినించీ పద్మాకరుప్రతిభ అపరూపమైంది. తనపూర్వులకు అనురూపంగానే కొలదికాలంలో సంస్కృతంలోనూ, అనేక శాస్త్రాల్లోనూ గొప్ప పాండిత్యం సంపాదించాడు. దీనితోబాటు హిందీలోకూడా అసమాన ప్రతిభ ప్రాప్తించింది. పూర్వుల ప్రతిష్ఠనుబట్టి కొలది కాలంలోనే పద్మాకరుడు ప్రసిద్ధిచెందడం సహజమే కదా! రాజసభలలో తండ్రికి వున్న ప్రతిష్ఠను బట్టి పద్మాకరుని ప్రతిభకూడ అనతికాలంలోనే వికసించింది. అనేక రాజసభలలో గొప్ప సన్మానం దొరికింది. ఒకనాడు పద్మాకరకవి పీష్వా రఘునాథరావు ప్రశంసలో ఒక 'కవిత' (హిందీలో ఒకఛందస్సు) చదివి వినిపించాడట. దానిమీద రఘునాథరావు సంతోషించి లక్షరూపాయలు బహుమానంగా యిచ్చాడట. పద్మాకర వంశీయులలో యిప్పటికిని ఆ ఛందస్సు 'లఖియా' అను పేరుతో పిలువబడుతోంది. అనేకమంది రాజుల్ని ఆశ్రయించడం చూచి పద్మాకరుడు 'ధనలోభి' అని చాలామంది విమర్శకుల అభిప్రాయం. కాని యీ ఆరోపణ న్యాయ సమ్మతం కాదు. జీవితావసరాలకు ధనాన్ని ఆశించడం కవిదోషంకాదు. అయినా అప్పటి భారతీయ సాంఘిక రాజకీయాలే యింతమందిని ఆశ్రయించేందుకు పద్మాకరుని బాధ్యుణ్ని చేసివుంటాయి.

పద్మాకరుడు చాలావైభవంతో ఎప్పుడూ రాజభోగం అనుభవిస్తూ జీవితం గడిపాడట. ఎక్కడికి వెళ్ళినా వెంట రాజపురుషుడిలాగ ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, సైనికులు, రథాలు, నలుగు రైదుగురు వారకాంతలు వుండేవారట. ఒకమారు పద్మాకరుడు సిబ్బందితో రావడంచూచి ఏదో గ్రామస్థులు రాజు దండెత్తి వస్తున్నాడని భయపడ్డారట. అప్పుడు వారి భయాన్ని పోగొట్టి శంకా సమాధానం చేయడానికి "నేను ప్రతాపసింహ మహారాజుగారికి కవిరాజు"నని ఆశుకవితలో చెప్పాడట.

పద్మాకరకవి జయపూర్‌లో వుండగా ఒక స్వర్ణకారిణి (కంసాలిస్త్రీ)తో అనుచిత ప్రేమ కలిగిందట. ఈపాపంవల్లనే వారికి కుష్ఠురోగం వచ్చిందని కింవదంతి. ఈ అపవాదు ఎంతవరకు నిజమో గాని కుష్ఠు కలిగిన మాట మాత్రం వాస్తవం. ఈరోగావస్థలోనే వాల్మీకిరామాయణాన్ని ఆధారంగాగొని 'రామరసాయణం', నీతిపరకమైన 'ప్రబోధపచాసా' అను గ్రంథాల్ని రచించారు. దీనితరువాత కుష్ఠు

నయమైందట. తరువాత వృద్ధాప్యంలో వైరాగ్యం చెంది గంగాసేవనంలో మిగిలిన జీవితాన్ని గడపడానికి కాశీకి వెళ్లారు. ఈ రోజుల్లోనే లోకప్రియత నొందిన 'గంగాలహరి' అను గ్రంథాన్ని రచించారు. ఇచ్చటే 80 ఏళ్ల వయస్సులో వి. శ. 1890 లో (క్రీ. శ. 1833) తన అమరకీర్తిని వదలి దివంగతులైనారు. హిందీసాహిత్యంలో వీరికీర్తి అమరంగా వుండగలదు.

పద్మాకరుడు రాసిన గ్రంథాలు—(1) హిమ్మత్ బహాదుర్ బిరుదావళి, (2) జగద్వినోదం, (3) పద్మాభరణం, (4) జయసింహ బిరుదావళి, (5) ఆలీజాహ్ ప్రకాశ్, (6) హితోపదేశ్, (7) రామరసాయణం, (8) ప్రబోధపచాసా, (9) గంగాలహరి.

## గదాధరభట్టు (ద్వితీయ):

తరువాత పద్మాకరవంశంలో ప్రసిద్ధి చెందిన కవి గదాధరభట్టు. ఈయన పద్మాకరునకు మనుమడు; మిహీందీలాల్ భట్టు పుత్రుడు. వీరి జననం ఎప్పుడో తెలియదు గాని, వి. శ. 1955 కు సమీపాన స్వర్గవాసులైనట్టు తెలుస్తోంది. వీరికి దతియా, జయపూర్, సుతాలియా రాజసభలలో మంచి సన్మానం వుండేదట. వీరి గ్రంథాలు లోకప్రసిద్ధి చెందనప్పటికీ చాలా ప్రశంసనీయమైనవి, కావ్యత్వపూర్ణమైనవి అని మిశ్రబంధువులు రాస్తున్నారు. వీరి గ్రంథాలు—(1) వృత్తచంద్రిక, (2) కామాంధకం, (3) బిరుదావళి, (4) వ్రజేంద్రవిలాసం, (5) కైసరసభావినోదం, (6) దేశాటనవినోదం, (7) అలంకారచంద్రోదయం, (8) గదాధరభట్టుకీ బానీ.

వీరి యనంతరం పద్మాకరవంశంలో ఎంతమంది కవు లయ్యారో విశదం కాలేదు. అముద్రిత గ్రంథ పట్టికలో ఇంకా కొందరు కనిపిస్తున్నారు. కాని యిక్కడ అందరినీ పేర్కొన్నందువల్ల గ్రంథవిస్తరం అవుతుంది. వర్తమానకాలంలో శ్రీయుత బాలచంద్ర కవీశ్వర్ తైలంగ్, బి. ఏ. శక్తికొలదీ కొద్దిగా హిందీసేవ చేస్తున్నట్టుంది. 'కవీశ్వర్' బిరుదు పద్మాకరకవినించీ వీరివంశంలో వస్తోంది.

## గదాధరభట్టు (ప్రథమ):

ఈ గదాధరభట్టు భక్తి కాలంలోనివాడు; ఆంధ్రబ్రాహ్మణుడు. జనన విషయం కాలగర్భంలోనే వుండిపోయింది. కాని 'భక్తమాల' ద్వారా చైతన్యప్రభువుకు శిష్యులైనట్టున్నూ, ఎప్పుడూ భాగవత పురాణ కాలక్షేపం చేస్తుండేవాడనీ తెలుస్తోంది. దీన్నిబట్టి వీరు వి. శ. 1580 వరకూ జీవించివున్నట్టు తెలుస్తోంది. ఒకరోజున బృందావనంలో చైతన్యప్రభువుకు ప్రముఖశిష్యులైన జీవగోస్వామి గదాధరభట్టు రచించిన రాధాకృష్ణుల ప్రేమ సంబంధమైన ఒక మధుర గీతాన్ని యిద్దరు సాధువులు పాడుచుండగా విని ముగ్ధులై యీ క్రిందిశ్లోకం రచించి గదాధరభట్టువద్దకు పంపించారట:

"అనారాధ్య రాధాపదాంభోజయుగ్మ
మనాశ్రిత్య బృందాటవీం తత్పదాంకం,
అసంభావ్య తద్భావగంభీరచిత్తాన్
కుతః శ్యామసింధోః రసస్యావగాహః."

ఇది చదివి కవిభట్టు మూర్ఛితుడయ్యాడట. తెలివివచ్చిన తరువాత బృందావనంవెళ్లి చైతన్యప్రభువుకు శిష్యుడయ్యాడు. భట్టు చాలా భావుకవ్యక్తిన్నీ, పరిపూర్ణమైన భక్తి కలవాడూ నట. సంస్కృతంలో మంచి పారంగతుడు. వీరి హిందీరచన 'ధ్యానలీల' ఒకటే లభ్యమైంది. వీరి హిందీభాష సంస్కృతగర్భిత మవుతూకూడా చాలా వ్యవస్థితంగానూ, లాలిత్య పూర్ణంగానూ వుంటుంది.

## గోరేలాల్ భట్టు:

పద్మాకరకవికి ముందు లోకప్రసిద్ధి చెందిన ఆంధ్రుడు గోరేలాల్ భట్టు. కల్పిత నాయికానాయకుల కౌగిలింతల్లో లొట్టలు వేసుకొంటున్న రీతికాలపు రోజుల్లో భూషణమహాకవి తరువాత వీరరసాన్ని పోషించినవాడు గోరేలాల్ భట్టు. వీరి ఆశ్రయదాత బుందేల్ కేసరి ఛత్రసాలుడు. శివాజీ లాగానే దేశస్వాతంత్ర్యానికి పోరాడిన మహాయోద్ధ. ఛత్రసాలుని ఆలంబనంగా తీసుకొన్నందువల్ల గోరేలాల్ కవితకు గొప్ప ప్రతిష్ఠ కలిగింది. రాష్ట్రీయ కవుల్లో భూషణకవి తరువాత యితనిదే స్థానం. వీరి కవితాశక్తి చాలా

గొప్పది. ఎంత క్లిష్ట భావాన్నయినా సరళమైన శైలిలో ప్రకటించే శక్తి వీరిలో ఎక్కువగా వుంది. వీరు ప్రయోగించిన పదసంచయం, రచనాశైలి చూస్తే ఇతడు పరభాషీయుడు కాదేమో ననిపిస్తుంది.

గోరేలాల్ జననం వి. శ. 1738 లో జరిగినట్లు పండితుల అభిప్రాయం. స్వరచనలద్వారా వీరి జనన వృత్తాంతం తెలియనప్పటికీ, వీరి వంశీయుడు బికానేర్ నివాసి అయిన ఉత్తమలాల్ గోస్వామి ద్వారా చాలా వెలుగు ప్రసరించింది. వీరి పూర్వీకుల నివాసస్థానం తూర్పుగోదావరి జిల్లాలో నృసింహక్షేత్రమైన ధర్మపురి(?). వీరి పూర్వుల్లో ఒకరైన కాశీనాథుని కన్య పూర్ణమ్మను వల్లభాచార్యులు వివాహం చేసు కొన్నారట. ఈ కాశీనాథునికి పుత్రుడైన జగన్నాథునికి ఆరుగురు పుత్రులు కలిగారు. వీరికి ఢిల్లీరాజైన బహలోల్ లోడీ గిట్టా, లంబుక్, జోగియా, తిఘురా, గిరధన్, ధరస్ అను పేర్లుగల ఆరుగ్రామాలు యీనాంగా యిచ్చాడు. అప్పటినించీ వీరు యీగ్రామ నామాలతోనే ప్రసిద్ధిచెందారు. వీరిలో 'గిట్టా'కు నాగనాథుడు జన్మించాడు. ఈ నాగనాథునికి పదో తరంలో గోరేలాల్, దీనానాథులు జన్మించారు. వీరు ముద్గల గోత్రీయులు. దీనికి పుష్టిప్రమాణం పండిత గంగాధరశాస్త్రి గారి కుమారుడైన కృష్ణశాస్త్రి గారు 'వల్లభ దిగ్విజయం'లో యిచ్చిన తన వంశపరిచయంవల్ల కూడ కలుగుతోంది.

బధంయీ, పతారా, అభానగంజి, సగేరా, దగ్గా అను అయిదుగ్రామాల్ని ఛత్రసాలుడు గోరేలాల్‌కు యీనాంగా యిచ్చాడట. ఇప్పటికిని 'దగ్గా'లో వీరి వంశీయులు గలరు.

గోరేలాల్ కృతులు— (1) ఛత్రప్రశస్తి, (2) ఛత్రఛాయ, (3) ఛత్రకీర్తి, (4) ఛత్రఛంద్, (5) ఛత్రసాల్ శతకం, (6) ఛత్రహజారా, (7) ఛత్రదండం, (8) ఛత్రప్రకాశ్, (9) రాజవినోదం, (10) విష్ణువిలాసం. వీటిలో 'ఛత్రప్రకాశ్' చాలా అమూల్యమైన గ్రంథం.

**కుమార మణిభట్టు :**

వీరికి సంస్కృతంలో మంచి విద్వత్తుగలదు. సంస్కృతంలో సూక్తిసంగ్రహం, సప్తశతి అను రెండు గ్రంథాల్ని గూడ రచించారట. హిందీలో వీరు రచించిన 'రసికరసాల్' అను పరమోత్కృష్ట గ్రంథం మాత్రమే లభ్యమైంది. వీరు హిందీకవులలో గొప్ప విజ్ఞులు. వీరి కవితాశక్తిని చూచి పద్మాకర శ్రేణిలో వాడని మిశ్రబంధువులు ఒప్పుకున్నారు. కుమారమణిభట్టు జననతిథి, జీవిత విశేషాలు తెలియరావు. గ్రంథ రచనాకాలం వి. శ. 1776 అని మాత్రం తెలుస్తోంది. వీరివంశీయుడున్, 'కోటా'నివాసియు అయిన కంఠమణిశర్మగారివల్ల కొద్దివృత్తాంతం తెలియవచ్చింది. వత్సగోత్రీయ తైలంగ బ్రాహ్మణుడైన గోవర్ధనాచార్యులకు కనిష్ఠసోదరుడగు బలభద్రునకు ఆయిదో తరంలో హరివల్లభశాస్త్రి జన్మించాడు. వీరే కుమారమణిభట్టు జనకులు. హరివల్లభశాస్త్రి గారు మహారాష్ట్రాంతంలో వున్న 'గఢమండలా' అను స్థానంలో వుండేవారట. రాణి దుర్గావతి వీరి విద్వత్తుకు మెచ్చి కనెరా, ధర్మసి అను రెండు గ్రామాల్ని ప్రదానం చేసింది. ఈగ్రామాలు యిప్పటికీ వీరివంశీయుల అధీనంలోనే వున్నవి.

కళానిధి:—వీరి అసలు నామధేయం కృష్ణభట్టు. ఆంధ్రబ్రాహ్మణుడు. రచనాకాలం వి. శ. 1769. ఇంతకు మించి వీరి జీవిత వృత్తాంతం తెలియరాదు. వీరు సంస్కృతంలో మంచి విద్వాంసులు. వాల్మీకి రామాయణంలోని బాల ఉత్తరకాండలు, బ్రహ్మసూత్రం, తైత్తిరీయ మాండూక్యం, కేనోపనిషత్తు, ప్రశ్నోపనిషత్తు మొదలగు సంస్కృత గ్రంథాల్ని చక్కని హిందీలోకి అనువదించారు. హిందీలో నిమ్నాంకిత గ్రంథాలు కూడ రచించారు: (1) అలంకార కళానిధి, (2) సాంభరయుద్ధం, (3) దుర్గాభక్తి తరంగిణి, (4) వృత్తచంద్రిక, (5) శృంగారరసమాధురి.

మురళీధరభట్టు : — బహుశా వీరిజననం వి. శ. 1837 లో అయినట్లు తెలుస్తోంది. వీరు అళ్వారు రాజదర్బారులో రాజకవిగా వుండేవారు. వీరికవిత్వం

చాలా సరసమైందని మిత్రబంధువులు రాస్తున్నారు. ఇంతకుమించి వీరినిగురించి ఏమీ తెలియడం లేదు.

హిందీ వాఙ్మయ చరిత్రలో యింకా చాలామంది దక్షిణదేశీయ కవులు గలరు. కాని వారి జననవృత్తాంతాల్ని గురించి ఏవిధమైన ప్రమాణాలూ దొరకనందున ఆంధ్రులని సాహసించి చెప్పడం వుచితంకాదు. భావి అన్వేషణలు చీకటిని వెలుగులోకి తీసుకురాగలవు. ఈ పూర్వకవుల సంతతివారు వర్తమాన సమయంలో ఎవ రెంత హిందీసేవ చేస్తున్నదీ చెప్పడం కష్టతరం. (ఈ వ్యాసం పూర్తి అయిన తరువాత అన్వేషణవల్ల మరికొందరు ఆంధ్రకవుల పరిచయం దొరికింది. కాని గ్రంథ విస్తరభీతి చేత వారిని యీ వ్యాసంలో పేర్కొనడం లేదు.)

## హిందీ అఖండత :

మన రాజకీయ వైశిష్ట్యంతో బాటు హిందీ రాజకీయంగా రాష్ట్రభాష అయింది. ఇది సైజమే. "హిందీని మించి రాష్ట్ర భాషాపదవిని అలంకరించడానికి యోగ్యమైనభాష భారతభూమిలో మరొకటి లేదు. భారతభూమిలో హిందీ, హిందీప్రాంతం ఎప్పటికైనా 'హృదయం'గా వుండగలవు. భారతభూమిలో అనేక భాషలు, అనేకలిపులు, అనేక ధర్మాలు, అనేక జాతులు వున్నవి. ఐక్యతా శూన్యదేశం" అని పాశ్చాత్య విద్వాంసులు నిందిస్తూవుంటారు. ఇదంతా ఇంగ్లీషువారి రాజకీయ కృహాదృష్టిగాని మనలో వున్న ఐక్యతను గుర్తించక కాదు. భారతభూమి ఆదినించీ అఖండసూత్రంలోనే వుంటూ వచ్చింది. హిందీయొక్క విరాట్ స్వరూపాన్ని చూస్తే అది బోధపడగలదు. ఒకవేళ రాజకీయంగా దేశాన్ని విభజించడానికి సుపుత్రులు ప్రయత్నించినా యీ అఖండతను ఎప్పటికీ ఛేదించలేరు.

## హిందీప్రచారంలో ఆంధ్రులు:

హిందీ రాష్ట్రభాష అయిన దగ్గరనించీ దాక్షిణాత్యులు ప్రచారక కార్యంలో అమితోత్సాహం చూపుతున్నారు. చరిత్ర కాలంనించీ ఆంధ్ర, మహారాష్ట్ర, గుజరాతు ప్రాంతాలు ఎక్కువగా హిందీసేవ చేస్తూ వస్తున్నారు. ఇప్పుడూ హిందీ ప్రచారంలో వీటిదే అగ్రస్థానం. ద్రావిడ ప్రాంతాల్లోకి 'ఆంధ్ర' అగ్రస్థానంలో వుంది. ఆంధ్రులు హిందీమీద చూపుతున్న ప్రేమ అపారం. హిందీని శుద్ధంగా ఉచ్చరించడంలో కూడా అఖిల భారత భూమిలోకీ మనదే అగ్రస్థానం. కేవల హిందీ నేర్చుకోవడంలోనే కాదు, హిందీ ప్రచార కార్యంలోగూడ ఆంధ్రులకు విశేషగౌరవం వుంది.

## ఆధునిక హిందీరచయితాంధ్రులు:

వర్తమానకాలంలో ఆంధ్రుల్లో హిందీకవితా కలాపం చేసేవారు సి. వై. చింతామణిగారి కుమారులయిన బాలకృష్ణరావు ఐ. సి. యస్. గారు. వీరికి హిందీలో విశేషరుచి గలదు. హిందీమాసపత్రికల్లో తరుచుగా వీరి కవితలు గౌరవయుక్తంగా వెలువడుతుంటాయి. వీరంటే హిందీప్రపంచం చాలా గౌరవిస్తుంది. 'కౌముది', 'అభాస్' అను రెండుగ్రంథాలు కూడ వెలువడినవి. ముందుముందు హిందీవాఙ్మయంలో వీరికి మంచిస్థానం దొరకగలదు.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో హిందీఅధ్యాపకులుగా వున్న ఓరుగంటి వెంకటేశ్వర్లు గారుగూడ ఇంగ్లీషునించి 'సప్తభారత్‌కీఖోజ్' అను గ్రంథాన్ని అనువదించారు. అన్యభాషీయులయ్యీకూడా చక్కని హిందీలో అనువదించారు. ఈ పుస్తకం చాలా లోకప్రియత పొందింది.

ఇంతేకాక హిందీప్రచారార్థమై వాచకాల్ని రచించిన ఆంధ్రులు అనేకులుగలరు. ఇందులో మోటూరి సత్యనారాయణగారు, యలమంచిలి వెంకటప్పయ్యగారు, స్వర్గీయ జంధ్యాల శివన్నశాస్త్రిగారు మొదలగువారి పేర్లు ఉల్లేఖనీయమైనవి.

## హిందీప్రచారకుల కర్తవ్యం:

ఇంకా మనం అంధకారంలోనే వుంటున్నాం. హిందీప్రియులు అంధానుభక్తితో 'ఆంధ్రి'కి ద్రోహం చేస్తున్నారు. పిల్లలకు హిందీలో అక్షరాభ్యాసం చేయిస్తున్నారంటే ద్రోహం కాదా? ప్రతిసంవత్సరమూ హిందీలో పెద్ద చదువులు చదువుకోవడానికి ఉత్తర భారత దేశానికి ఆంధ్రు లెందరో వెళ్లుతుంటారు. వీరిలో

దాదాపు అందరికీ మాతృభాషాజ్ఞానం, ఆంగ్లవాఙ్మయ పరిచయం పూర్తిగా శూన్యం. ఈ అంధానుకరణవల్ల దేశానికి ఏమీ మేలు కలుగదు. మాతృభాషా వాఙ్మయ పరిచయం లేని వ్యక్తి రాష్ట్రభాషా ప్రచారోద్యమంలో సఫలుడు కాలేడు. హిందీ ప్రచారకుడు మాతృభాషలోనూ, రాష్ట్రభాషలోనూ మంచి పరిచయం కలిగి వుండాలి. కేవలం హిందీభాష ప్రచారం చేసినందువల్ల రాష్ట్రైక్యత కలుగనేరదు. ప్రతి హిందీప్రచారకుడూ మాతృభాషా వాఙ్మయాన్ని గురించీ, మాతృభాషీయుల సంస్కృతినిగురించీ హిందీలో వ్యాసాలు రాయగల సమర్థత కలిగివుండాలి. తెలుగుసాహిత్యాన్ని హిందీలోకి అనువదించాలి. హిందీలో మంచివిద్వత్తుగల ఆంధ్రు లెందరో గలరు. కాని ఒక్కరిలోనూ పై సమర్థత వున్నట్టు కనిపించదు. ఇదే మొదటినించీ మనం ఆంధ్రానికి చేస్తున్న ద్రోహం! ఇంతమంది హిందీప్రచారకులుండీ తెలుగును గురించి ఏమైనా చర్చిస్తున్నారా? హిందీ ఓనమాలు నేర్పడమే రాష్ట్రభాషాప్రచారమా?........ఆంధ్రి వెలుగును రాష్ట్రభాషవరకూ ప్రసరింపజేస్తున్నది ఒక్క యలమంచిలి వెంకటేశ్వరరావుగారు. వీరు ఆంధ్రవాఙ్మయాన్ని గురించీ, ఆంధ్ర సాహిత్యకుల్ని గురించీ తరుచుగా హిందీలో వ్యాసాలు రాస్తుంటారు. తెలుగునించి కథల్ని, ఏకాంకిక నాటికల్ని గూడ చాలా అనువదించారు. ప్రతి హిందీప్రచారకుడూ వీరిని అనుకరించాలి. అప్పుడే 'ఆంధ్రి' వెలుగులోకి రాగలదు. ప్రతి భాషలోనూ వాఙ్మయవినిమయం జరిగితేనే గాని దేశంలో 'ఐక్యత' రాదు. ఈ వినిమయానికి ముఖ్యంగా రాష్ట్రభాషను ఉపయోగించుకోవాలి.



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.